## ప్రకటన

భామాశా నాటకము ననువదించి ప్రచురించుకొనుటకు, భామాశా హిందీ నాటకకర్త శ్రీ ధన్యకుమార్ జైన్ 'సుధేశ్' గారిచే సర్వహక్కులు మేము పొందియున్నాము.

ఈ నాటకము నెవ్వరు సంపూర్ణముగ గాని ఏ కొంత భాగమునుగాని ప్రచురింపరాదు. రేడియో, సినిమా, నాటక ప్రదర్శనలకు మా అనుమతిలేక వాడుకోరాదు. ఇందుకు వ్యతిరేకముగ వ్యవహరించిన, మాచే, సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురని ఇందుమూలముగ హెచ్చరించుచున్నాము. సమర్థులగు నాటక సంస్థలవారు ముందుగ కోరినచో ఉచిత ప్రదర్శనమునకనుమతి యొసంగబడును.

ఇట్లు,
వేంకటేశ్వర వేంకటరమణ కవులు

# భామాశా
(చారిత్రక నాటకము)



మూలము:
ధన్యకుమార్ జైన్ "సుధేశ్"

అనువాదము:
వేంకటేశ్వర వేంకటరమణ కవులు



[అఖిలభారత వైశ్య యువజన సంఘము, హైదరాబాదువారి
ద్రవ్య సహాయముచే ముద్రించబడినది.]



ప్రచురణ:
భారతీయ వైశ్య చారిత్రక పరిశోధన సమితి
విజయవాడ.

తొలి ప్రచురణ :
వేయి ప్రతులు

విళంబి
కార్తీక శు॥ ౧-౨

[ఈ నాటకము మధ్యప్రదేశ్ ప్రభుత్వముచే ఐదువందల రూప్యముల బహుమతి నంది రాజస్థాన ప్రభుత్వ విద్యాశాఖవారిచే గ్రంథాలయముల కంగీకరింపబడినది.]



ముద్రణ :
నాగేంద్ర ప్రింటింగ్ ప్రెస్
మహంకాళీ స్ట్రీట్
సికింద్రాబాద్



"భామాశా" హిందీ నాటక కర్త శ్రీ ధన్యకుమార్ జైన్ 'సుధేశ్' గారికి మధ్యప్రదేశ
గవర్నర్ గౌ. శ్రీ పటాస్కరుగారు ఐదువందలరూప్యములను
బహూకరించి సన్మానపత్ర మొసంగుచున్న దృశ్యము.



అనువాదకులు :

శ్రీ వేంకటేశ్వర వేంకటరమణ కవులు



“కవిపాదుషా” శ్రీ కొప్పరాపూరి సత్యనారాయణగారు

భారతీయ వైశ్య చారిత్రక పరిశోధన సమితి అధ్యక్షులు

# రెండు మాటలు

'భామాశా' నాటకోపయోగము భారతీయ వైశ్యచారిత్రక పరిశోధన సమితి, విజయవాడ (ఆంధ్ర) వారి దృష్టికి రాగలుగుటెరిగి నేనానందించితిని. వారు దీని నాంధ్రీకరింపజేసి ప్రచురింప బూనుటెంతేని శ్లాఘనీయము. వారి సాహిత్యప్రేమ, చరిత్రానురక్తి ప్రశంసనీయము, అభినందనీయము! ఈ విధముగనే ముందు ముందుగూడ నీసంస్థ భారతీయ నరరత్నముల విషయమున నెక్కుడు పరిశోధనకావించి పవిత్ర జీవిత చరిత్రల నాంధ్రపాఠక లోకమున కందింప బ్రయత్నింతురని విశ్వసించుచున్నాను. ఇట్టి ప్రశంసనీయమైన పవిత్రకృషి కావించుచున్న నీసంస్థ వారి కభివాదనము కావించుచున్నాను. ఈ సంస్థ ముఖ్యోద్దేశ్యము లచిర కాలములో కార్యరూపమొంది సఫలత నొంద నాకాంక్షించుచున్నాను.

ఈ సంస్థయొక్క పరిశోధనాత్మక సాహిత్యానుష్ఠానమునకు శ్రీమంతులు నుదారులు నగు దాతలు తమ ద్రవ్యము వినియోగించి ఆంధ్ర సాహితీ భాండారమును సర్వసమృద్ధము కావింప సహకరింతురని ఆశించుచున్నాను.

ఆంధ్రలోకమీ నాటకము చదివి భామాశా మహోదాత్తతను మననము కావించుకొని తదాశయముల ననుకరింప ప్రయత్నింప నభిలషించుచున్నాను.

ఇట్లు,

ధన్యకుమార్ జైన్ " సుధేశ్ "

నాగోద్
18-9-58

# కృతజ్ఞత

వస్తుపాలుడు ప్రచురించిన పది మాసములకు 'భామాశా' నాటకము పాఠకుల కరపద్మముల నలంకరింప జేయు చున్నందుల కానందించు చున్నాము. లేఖనాపరికరములే మూల ద్రవ్యముగాగల మా సమితి సహాయమున, క్రిందుజేయి నుంచరాదనుదీక్షగల మేము, బాధ్యతాయుతము లగు పదవులందుండియు, విరామ సమయములందు రచనావ్యాసంగము సాగించుచు, 'భామాశా' నాటకమును స్వేచ్ఛానువాదము కావించి, యాంధ్ర నాటక సంప్రదాయానుసారము పద్యములు గూర్చి, ప్రచురణకు సిద్ధపరచి, మూల నాటక కర్త యనుమతి నర్థించి, యెట్టకేలకు సాధింపగల్గితిమి.

మాలో నొకరగు వసమా, వేంకటరమణ గుప్త తన బాల్యమున భామాశా త్యాగవృత్తము విని విస్మితుడై మనస్సీమను విస్మరింపకుండి, కొన్నాళ్ళకు రాణాప్రతాపుని జీవితమును వచనమున రచించెను. ఆ యభి మానమే మాయీగ్రంథ రచనకు మూలకారణము.

మేమర్థింపకపోయినను స్వసంఘాభిమాన నిరతులగు దాతృ వతంసులు సంస్థలు ధనవ్యయము భరించి మా రచనల ప్రచురింప ముందడుగు వేయుచుండుటచే నీమాత్రమైన సంఘసేవ సాహిత్యసేవ చేయగల్గితిమని మనవి చేసికొనుచున్నాము.

రచనము పూర్తిగావించి ప్రచురణకు సిద్ధపరచిన మా యితర గ్రంథము లచిరకాలమున పాఠకుల కరకమలముల నలంకరించగలవు. మాగ్రంథ రచనోద్యమమునకు మార్గదర్శకుడును, మా శ్రేయోభిలాషియు నగు మిత్రశ్రీ 'కవిపాదుషా' కొప్పరాపూరి సత్యనారాయణ గారికి, మా చారిత్రక వ్యాస పరంపరలకు తగు ప్రాధాన్యత నొసంగి ప్రచారము

కావించుచున్న 'గుప్త' పత్రికా సంపాదకులు మిత్రశ్రీ కె. సి. గుప్త గారికి, ఖామాశా ముద్రణ వ్యయము భరించి ప్రచురించిన అఖిలభారత యువజన సంఘంవారికి, మాలేఖలు చేరుటయే తడవుగ నెప్పటి కప్పుడు ప్రత్యుత్తరము లొసగిన శ్రీ శ్రీ శ్రీ ఉదయపుర మహారాణా వారికి, ప్రచురణ కనుమతి నిచ్చిన శ్రీ ధన్యకుమారజైన్ 'సుధేశ్' గారికి మా కృతజ్ఞతాభి వందనము లర్పించుచున్నాము.

"కామదేవుడు" గ్రంథానువాదమునకు ప్రచురణల కనుమతి గోరుచు మేము లేఖ వ్రాయుటే తడవుగా వారి అసంఖ్యాక గ్రంథముల నాంధ్రీకరించి ప్రచురించుకొనుట కనుమతి నొసగిన శ్రీ పండిత కాశీనాధ జైన్‌గారికి మా మనఃపూర్వక వందనము లందించుచున్నాము.

మా రచనోద్యమానికి సహాయపడిన యా యా గ్రంథకర్తలకు మా నమస్సులు ! మా మూడవ రచన "హేమచంద్రుడు" త్వరలో వెలువడ నున్నదని మనవి చేసికొనుచు సెలవు గైకొనుచున్నాము.

—వేంకటేశ్వర వేంకటరమణ కవులు

# పీఠిక

నేడు భౌతికవాదులు హింసాత్మక చర్యలతో ప్రపంచమున శాంతి స్థాపింప గోరుచున్నారు. అహింస పిరికితనమునకు పుట్టినిల్లనియు, అహింసారాధకులు పరాధీనతను ప్రేమించువారనియు తలచుచున్నారు. అహింసారాధకులయ్యు సమయమరుదెంచిన స్వాతంత్ర్య సంగ్రామమున ప్రముఖపాత్ర వహించిన మహనీయు లనేకులున్నారు. ఈ విషయము వీ భామాశా ప్రముఖ చరిత్ర ఋజువు చేయగలదు. చరిత్రను సింహావలోకనము చేసిన, హింసావాదు లమానుష క్రూరకృత్యముల గావించు నపుడెల్ల నహింసావాదులు శాంతి కాముకులై మాతృదేశోద్ధరణ మొనరించిన ఘట్టములు కోకొల్లలుగ గనిపించుచున్నవి. ఆ మహనీయులు స్వదేశ, స్వధర్మ, స్వజాతి రక్షకులై శస్త్రాస్త్రములు పూని దేశకంటకుల నున్మూలించుచుండిరి. వారి సైన్యబలమును, దురాక్రమణకు గాదు — దౌర్జన్యశక్తుల విముక్తి కొరకు వినియోగించిరి. వారు పరాంగనా సాంగత్యము కోరియుండలేదు—స్త్రీ గౌరవము నిలుపుటకు దీక్షాకంకణములు దాల్చియుండిరి. ఆ మహనీయ చరిత్రులకుఁ దలమానికము భామాశా! ఆ మహనీయుడు ప్రాతస్స్మరణీయుడు !

దానవీరుడగు భామాశా మేవాడ విముక్తికై కావించిన మహాత్యాగము నేచరిత్ర పాఠకుడును మరచిపోజాలడు. ప్రతాపసింహుని మహోద్యమమునకు మూలవిరాట్టు భామాశా! నేడు కాదేనాడైన నట్టి పూజ్యులిద్దరు ముగ్గురు లేరు.

మేము చారిత్రకులము, పరిశోధకులము కాకపోయినను, పూజ్య భామాశా విషయమున పామర ప్రజల కల్పనల కుపేక్షాభావము వహింప జాలకుండియు, సమర్థులగు వారివిషయమున వహించిన మౌనము మమ్ము బాధించుటవలనను కించిదజ్ఞమగు యీ సాహసమునకు పూనుకొనవలసి వచ్చినది. సూర్యుడు లేనపుడు తారకలు వెలుగునిచ్చునుగదా!

మేము భామాశా చరిత్రను వ్రాయ సంకల్పించి గ్రంథ పరిశీలన కావించుచు మిత్రులతో నుత్తర ప్రత్యుత్తరములు గావింప వారు తగిన సమాధానములదెల్పి మా యుద్యమము నాశీర్వదించుచు మమ్ము నాశీర్వదించుచు ప్రోత్సహించిరి. మే మీ పరిశోధన కావించి భామాశా రత్నము నొక మారుమూల గనిలోనుండి యీవలకు గొనివచ్చితిమి మేము గమనించిన చారిత్రకాధారముల ప్రసంగించుట యనవసరము. కాదని భావించుచున్నాము.

భామాశా కావడియాగోత్ర వోసువాల జైన వైశ్య వంశమున జన్మించిరను విషయము 'రాజపుటానా కె జైనవీర్' 80వ పుటలో గలదు. వీరిపూర్వుల చరిత్రను సేపగ్ జేఠ్మల్‌గా రిట్లు వ్రాసిరి : "భామాశాకు ముందు ఆరవ తరమువాడు 'చాందా కావడియా'. వీరు రాయగోత్రజులు. ఢిల్లీయందు నివసించుచుండెడివారు. వారి తాతతండ్రులు పాదుషా కోపమునకు గురియై యుద్ధమున మరణించియుండిరి. అప్పుడు 'చాందా' పసివాడగుటచే నతనిని బంధువులు కావడియందుంచుకొని మేవాడకు దీసికొనివచ్చిరి. అందువలన 'చాందా' సంతతివారు కావడియావారైరి. చాందా కుమారుడు 'తీడాతడా'కు భారమల్ కుమారుడు. వీరు పాదుషా కొలువందు కొఠారి కామ్‌దారు (హెడ్ గుమాస్తా)గా పనిచేయుచుండిరి. కొన్నాళ్లకు నుదయపుర రాజావారివద్ద దివాన్జీగా పనిచేయుచుండిరి. మొదటినుండియు వీరు గొప్పధనవంతులు. అందువలన వీరిని శాహో (షాహో)లని పిలచుచుండిరని 16-12-1952 'వీరశాసన్' పత్రికలో 7 వ పుటలో నున్నది. వీరివంశము భామాశాకు మున్నేగాక పిదపగూడ మన్నతి కెక్కియున్నది. భామాశా జన్మతహ మహాపురుషుడు. వారి యనుపమ త్యాగము ప్రశంసనీయము."

బికనీరు చరిత్ర పరిశోధకులగు శ్రీ అగర్‌చంద్ నాహటాగారు వీర శాసనములలో "భామాశా విషయక జిజ్ఞాసావోంకా సమాధాన్"

అను శీర్షికక్రింద కొన్నివ్యాసములు ప్రచురించియుండిరి. అందీవిషయము గూర్చి రెండు శాసనములలో చక్కగా నుదాహరించిరి. భామాశాను గురించి తత్కాలముగ ప్రచారములోనున్న విషయములు విస్మయము గొల్పుచున్నవి. ఈ శాసన లేఖలవలన భామాశా అష్టాదశకోటిసువర్ణా ధీశ్వరుడని తెలియుచున్నది. ఆ ధనమాతనికి దక్షిణావర్తశంఖమువలన గలిగినదని చెప్పబడుచున్నది. ఒక శాసనము సంస్కృతమున గలదు. మరొకటి వ్యావహారికభాష యందున్నది. వ్యావహారిక భాషా శాసనము నకు మాతృక సంస్కృతశాసనము. వ్యావహారిక భాషా శాసనముకన్న సంస్కృత శాసనము వివరముగనున్నది. దానికి ప్రతికృతి ఇది.

ఓం శివ

సం 1616 (విక్రమశకము) చిత్రకూట మహాదుర్గ కావడి యాందయో భారమల్లో ధనీ తపోగణీయోభూత్. తేన శ్రీదేవాఘర్ సూరీణామభిధానం యుద్ధక్రియాధారకత్వం చాశ్రుతం తదాదిష్ట ఇవ తద్గుణ రంజిత చేత సోఽవదత్

ధన్యో దేవాగరస్వామీ ప్రదీపో జైన శాసనామ్
వసావవ గురుర్భాతి ధన్యోహం తన్నిదేశకృత్ (11. గా. 9.)

ఇతి భావనయా శుద్ధాత్మా భారమల్లః తస్మి న్నవసరే తత్రత్యో భోమానామ నాహటోస్తి. తద్గృహేషు పుణ్యయోగా ద్దక్షిణావర్తః శంఖః ప్రాదుర్భూత. తత్సాన్నిధ్యాత్ గృహేష్టాదశకోట్యోధనస్య ప్రకటీ భవతి. అధ షణ్మాసోపాంతే శంఖదేవేన భోమాకస్య స్వప్నే దర్శనం దత్తం నివేదితం చ భోమోమాసాహ త్వం శ్రుణు తవ భార్యాయా ఉదరే పుత్రీత్వేన కశ్చిజ్జీవః సమేతోస్తి. కావడియా భారమల్ల భార్యోదరే సుకృతీ కశ్చిజ్జీవః సుతోవతీర్ణోస్తి. తత స్తత్పుణ్యప్రేరితో భారమల్ల కావడియాగృహే గమిష్యామి త్యాకర్ణ్య భోమోకావదత్. ఏవం మయాపి

యధాహం కరోమి తథా గచ్ఛే త్యుక్తే తేనామేతి భణితమ్ అధా హర్మ్మఖే తే సర్వ స్వజనసహితః శంఖస్వన జాగరూకకృతానేకలోకః సర్వస్థాలే దక్షిణావర్తశంఖం నిధాయాతి మహార్ఘ్యవస్త్రైణాచ్ఛాద్య భామోకో భారమల్ల భవనాభిముఖ మాగతం తమాలోక్య సానందం భార మల్లోభిముఖం మిళితః పృష్టం చ కిమాగమన ప్రయోజనం ప్రోచ్య తా మిత్యుక్తో భామకోపదత మమ పుత్రీ తవ చ పుత్రో భవిష్యాతి తయోనం బంధకర్తుం శ్రీఫలస్థానే ఇద మద్భుత మాహాత్మ్యం శంఖం దదామీ త్యానం తీర్యసముత్పన్న పరమాద్భుతో బహుళా దానపూర్వక మనుగృ హీతం భారమల్లః గృహకోష్టకాంత స్సమభ్యర్చ్య సమ్యక్చందన చతు ష్కికోపరి సంస్థాప్య సంస్మృతో దేవస్తే నాష్టాదశకోటిధనం తత్ర ప్రకటీకృతమ్.

—(వీరశాసన్ 1 జనవరి 1953 పేజి 7)

విక్రమశకము 1616లో చిత్రకూట మహాదుర్గ కావడియా భార మల్లుడు ధనికుడు, తపోవంత గణికుడై యుండెను. అతడు శ్రీ దేవాగర సూరుల పేరు, యుద్ధక్రియా నిపుణత విని యాతని గుణములకు రంజిల్లి 'జైన శాసన ప్రదీపమగు దేవాగరస్వామి ధన్యుడు. ఆయన ఆజ్ఞానుసారి నగు నేను ధన్యుడను' అని భావించెను. ఈ భావనవలన శుద్ధాత్ముడగు భారమల్లుడు ప్రకాశించుచుండెను.

అచ్చట థోమానాహటు డుండెను. అతని పుణ్యము వలన వాని గృహమున దక్షిణావర్త శంఖముండెను. దాని మహిమవలన నతనికి పదునెన్మిది కోట్ల ధనముండెను. ఆరు నెలల పిదప శంఖదేవత థోమా కలలో కనిపించి, "నేను భారమల్లు నింటికేగెదను. అతనికి కలుగబోవు తనయుని యదృష్టము వలన నే నేగుచున్నాను. నీకొక తనయ కలుగ గలదు. నీకూతును భారమల్లు తనయునకిమ్మ"ని చెప్పెను. థోమానాహటా మరునా డుదయమున శంఖదేవతను భారమల్లున కర్పించి కన్యాదానము

నకు గుర్తుగ శ్రీఫలము బదులు దీనిని గైకొమ్మనెను. భారమల్లు డింటిలో శంఖదేవతనుంచి యర్చించుచుండ నతనికి పదునెన్మిది కోట్ల ధన మాశంఖదేవత యొసగెను.

మేవాడ ప్రసిద్ధ చారిత్రక గ్రంథము వీరవినోద 241వ పుటలో భామాశా జననము విక్రమశకము 1604 ఆషాఢ శుక్ల దశమి (క్రీస్తుశకము 1547 జూన్ 28వ తేదీ) సోమవారమని చెప్పబడియున్నది. భామాశా ఆరేండ్లవాడై యుండగా భారమల్ మహారాణా ఉదయసింహుని మంత్రి యాయెను. అప్పు డుదయసింహుడు లక్ష ధన మొసగి శాసనము కావించెనని వీరవినోద్ 68వ పేజీలో నున్నది. భామాశా జన్మదినము రాజపుతానేకే జైన్‌వీర్ 96వ పుటలోగలదు. అంతేగాక భారమల్లుడు రణ దంభోరు దుర్గాధ్యక్షుడు గావింపబడెను. ఇంతకు ముందు హాడా సూరజ్ వందలాల్ ఖిలేదార్‌గా నున్నప్పటి నుండికూడ భారమల్ చేతియందు ఎక్కువ కార్యభార ముండి యుండెనని రాజపుతానేకే జైన్‌వీర్ 80వ పుటవలన తెలియుచున్నది.

భారమల్ తన జీవితకాలమున 'తపోగచ్ఛ'మైయుండియు, విక్రమ శకము 1616లో, దేవాఘర్ ప్రభావమున 'లుంకా'యైరి. ఈ విషయము వీరశాసన్ 1వ జనవరి 1953 పేజీ 7 లో నిట్లున్నది :

ఏకదిన వనాంత రుచ్చైర్మండపాధి ధర్మధ్యానసాధు గుణగ్రామా భిరామః శ్రీ దేపానగర స్వామీ శుద్ధతపోధనో భారమల్లేన దృష్టః విధివాదవందితశ్చ శుద్ధధర్మోపదేశామృతం పీతం శ్రవణాభ్యామ్. అతి ప్రపన్నేన భారమల్లేనా విమృష్ట మహామహోను. భాగ్యోదయోమే ప్రక టితః యద్గుణాః గురవో దృష్టాః సర్వేర్థాః మేపేత్స్యన్తి తదా భారమల్లో న్యేవ హావోనో గోరీలుంకా గణీయాః శ్రావకాః జాతాః

ఒకనాడు వనాంతము నుండి ధర్మధ్యాన సాధుగుణ గ్రామాభి రాముడు శ్రీ దేపానగరస్వామి భారమల్లు వద్దకు రాగా నతడా శుద్ధతపో

ధనుని జూచి నమస్కరించి ధర్మోపదేశామృత మాస్వాదించి ప్రసన్నుడై భారమల్లుడు— "నా గుణములు గురువులు చూచితిరి కదా! నన్ను స్వీకరింపుడ"ని పలికి, లుంకాగణీ శ్రావకుడాయెను.

మహారాణా ఉదయసింహుడు వీరాయను వేశ్యాలోలుడై రాజకార్యములు నిర్వహింపకున్న యదను జూచి 1624లో అక్బరు చిత్తోడు దుర్గ మాక్రమించుకొన రాణా గిహ్లోట్ యనుచోట తలదాచుకొనెను ఉదయసాగరమువద్ద నగరము నిర్మించి ఉదయపురమునకు భారమల్లును పిలచి మంత్రిని గావించుకొని పాలించుచుండెను.

మహారాణా మరణానంతరము ప్రతాపసింహుడు రాణాకాగా భామాశా మంత్రి యాయెను. భామాశా, ప్రతాపుని తనయుడు అమరసింహుని కాలమున మూడేండ్లు మంత్రిగా నుండెనని వీరవినోద్ 259వ పుటవలన దెలియుచున్నది. మహారాజా మానసింహుడు ప్రతాపుని సహపంక్తి భోజనము కోరి తిరస్కృతుడై హాల్దీఘాట్ రణ కారకుడయ్యెనని శ్రీ నాహటజీగారి వ్రాతగ్రంథము 'భామాశాకా ఘరానా' యను గ్రంథము వలన తెలియుచున్నది. ఇదే సుప్రసిద్ధ చారిత్రకులు శ్రీ ఓఝాజీగారు ఉదయపూర్ రాజాకా ఇతిహాస్ చివర నుల్లేఖించిరి. భామాశా హాల్దీఘాటు యుద్ధమున నిర్వహించిన పాత్రను గూర్చి పండిత ఝాబర్‌మల్‌జీశర్మగారు (సంపాదకుడు, దైనిక "హిందూ సంసార"పత్రిక) రాజపుతానేకే జైనవీర్. 93వ పుటలో దెల్పియున్నారు. భామాశా తమ్ముడు తారాచంద్ కూడ హాల్దీఘాటు రణమున పాల్గొన్నట్లు వీరశాసన్ 1వ డిశంబర్ 1952 పేజి 7లో గలదు. హాల్దీఘాటు యుద్ధానంతరము కలిగిన క్లిష్ట పరిస్థితులలో భామాశాను 'బాబంద'యందుండి ప్రతాపసింహుడు మాళవ దేశముపైకి పంపెనని నాహటజీ వ్రాతగ్రంథము 'భామాశా కా ఘరానా'లో గలదు. షాబాజుఖాన్ ఉదయపురమున నుండెను. విక్రమశకము 1635లో భామాశా సోదరుడు తారాచంద్రుడు 25 లక్షల రూప్యములు, 20 వేల

బంగారు నాణెములు 'బూలియా' గ్రామమున నున్న ప్రతాపుని కడకు గొంపోయెను. ఈసమయమున భామాశా తిరిగివచ్చువరకు 'రామాసాహిణీ' ప్రధానిగ నుండెను. ఈ విషయము ఒక కవి గేయమున పేర్కొన్నాడు.

" భామోపర్ ధానోకరే రామాకీధోరద్ధ్
ధరచీ బాహర్ పీంణను: మిలియో ఆయమరద్ధ్. "

రాణాజీ భామాశా నాంతరంగికునిగ జూచుకొనువాడు. అంతః పురమునగూడ భామాశా నిరాటంకముగ ప్రవేశించువాడని ఓఝాజీ ఉదయపూర్ రాజా కా ఇతిహాస్‌లో దెల్పియుండిరి. దివేరుబాదుషా రాణా ముట్టడిలో నీతడుండెను. ఉదయపుర రాజచరిత్ర 431వ పుటలో "తారా చంద్రుడు మాళవమున కేగి షాబాజుఖానుతో బోరుచు బసీదుర్గము చేరి గాయపడ నాదుర్గాధీశ్వరుడు తారాచంద్రుని కాపాడెను. మహారాణా బాబందనుండి బయలుదేరి బాదుషా రాణాల లోగొనుచు బాబందచేరి తారాచంద్రుని గలిసికొనెనని యున్నది.

భామాశాను అక్బరు తన పక్షమునకు ద్రిప్పుకొనుటకు మీర్జా ఖానుతో రాయబారములు సాగించెననియు, వానిని భామాశా దృఢచిత్త ముతో తిరస్కరించెననియు వీరవినోద్ 158వ పుటలో గలదు.

మేవాడరాజ్యమున భామాశాపేరు సుప్రసిద్ధి నొందియున్నది. సరస్వతి 18వ భాగము 2వ సంచికలో శ్రీ దేవీప్రసాదజీ మున్షీగారు 'మహారాణా ప్రతాపసింహ కా తామ్రపత్ర' అను శీర్షికతో నొకవ్యాసము ప్రచురించిరి. ఆ శాసనము విక్రమశకము 1639వ సంవత్సరములోనిది. మృగేషర్ అను గ్రామమును మహారాణా ప్రతాపసింహుడు భామాశాహా కొసగియుండెనని శాసన మందున్నది. ఆ శాసనము నకలీక్రింది విధ ముగనున్నది.

"మహారాజాధిరాజ మహారాణా ప్రతాపసింహజీ ఆదేశాత్ చారణ కొష్టాహే గాంమిర్‌ఘే షర్‌దత్త పయాకిధో అఘాట్‌హైదీధో సం॥

1639 వర్షే పాగుణ సుదీపంచమీహం ఏ శ్రీముఖ వీదమాణ శాహ భామాశా"

—( వీరశాసనము 16వ డిసెంబర్ 1952 పుట 7 )

కర్నల్ ట్రాడ్ రాజస్థాన చరిత్రలో, "రాణా ప్రతాపునకు భామాశా 25 వేల సైనికులకు పండ్రెండు సంవత్సరములు భోజన వేతనాదులకు సరిపోవు ధనమిచ్చెను. 'మేవాడ ఉద్ధారకుడు భామాశా' యని లోకమున ప్రతిష్ట కలిగె"నని కలదు. (ట్రాడ్ రాజస్థాన, మొదటిభాగము 402, 403 పుటలు)

భామాశా అపూర్వత్యాగమును ప్రఖ్యాత హిందీ కవికులాలంకారుడు భారతేందు హరిశ్చంద్రగారిట్లు కీర్తించిరి :

జా ధనహిత నారిత జై పతి
పూ తత జై పితు శీలహిసో ఈ
భాయీా సోభాయీా లరై రిపు సేపుని
మిత్రతామిత్రతజై దుఖజో ఈ
తాధనకోబని వాహై గిన్యోన
దిమోదుఖదేశకె ఆరత్ హో ఈ
స్వారథ ఆర్యతుమ్ హారో ఈహై
తుమరే సమ్ ఔర్ నయాాజగకో ఈ

—(రాజపుతానేకే జైనవీర్ పుట 91)

అనూహ్యమగు నీ భామాశా త్యాగమునకు మహారాజు, తత్కాలీనులగు నశేష ప్రజల సుహృద్భావము పెక్కు శతాబ్దములు గడచినను నేటిదనుక భామాశా వంశీయులకు సన్మానములు జరిపించుచున్నది. ఈ విషయమును స్పష్టము చేయుచు అయోధ్యాసింహజీ గోయలీయయొక్క సుప్రసిద్ధ గ్రంథమైన "రాజపుతానెకె జైనవీరులు" పుట 94, 96 లో దెలిపిన ప్రకారమిట నుదాహరింతుము.

మేవాడ రాజధానియగు ఉదయపురములో భామాశాయొక్క వంశీయులకు పంచ పంచాయతీలలో, వితర విశేష కార్యక్రమములందు

ప్రథమ గౌరవమర్యాదలు జరుపబడుచున్నవి. భామాశా వంశీకులు నాల్గు తరములవారు రాణాలకు మంత్రులుగా నుండిరి. ఉదయసింహునకు భారమల్, రాణాప్రతాపునకు భామాశా, అమరసింహునకు జీవాశా, కర్ణసింహునకు అక్షయరాజు మంత్రులైరి. భామాశా విక్రమశకము 1656 మాఘ శుక్ల ఏకాదశి (క్రీస్తుశకము 16-1-1600) నాడు పరలోకయాత్ర గావించిరని "ఉదయపూర్‌కా ఇతిహాస్" తెలుపుచున్నది.

భామాశా వంశీకులకు పరంపరగా జరుగు గౌరవము తెల్పుచు 1912 లో నాటి ఉదయపుర రాణా స్వరూపసింహజీ ఒక శాసనము కావించిరి. ఇది దాని నకలు.

శ్రీరామో జయతి

శ్రీగణేశజీ ప్రసాదాత్ శ్రీఏకలింగజీ ప్రసాదాత్ భాలేకా నిశాఃా సహీ

స్వస్తిశ్రీ ఉదయపుర శుభస్థానే మహారాజాధిరాజ మహారాణాజీ శ్రీ స్వరూపసింహజీ ఆదేశాత్ కావడియాజీ చంద్ కునడో వీరచందకస్య అప్రందారావడావామా భామోకావడయో ఈ రాజమ్హే సామప్రూమా సుకామ్‌బాకరీ కరీజీకే మరజాద్ చేట్ సూప్యాహై మహాజణా కీ జాతమ్హే బావనీ త్యా చౌకాకోజీమణవసీంగ్ పూజాహోలేవే వహాలేతలక్ ధారేహో తో హోనో అగలా నగర సేట్‌వేణీదాస్ కర్‌నోకురయో. అర్ వేద వ్యాప్త తలక్‌ధారే నహీ కరబాదీదో అవారూధారీనలాసీదీ ఖీనోనగేకర్ సేట్ పేమచంద్‌నే హుకమ్‌దీనోవీ జో ఆజ్‌కరా అర్‌న్యాత్‌మ్హే హుకసర్ మాలుమ్‌హుఅణో అబ్ తలక్ మాఫక్ దసతుర్ కె దేథారోకరయ్యా జాజో ఆగాసూఖారా బంస్‌కోహో వేగాజీకె తిలక్‌హువా జావేగా పంచా నేబీ హుకమ్‌కర్‌దియోహై నోలై పీ తలక్ ధారే హోవేగా ప్రవానగిమ్హే తాపేద్ సింహ వం 1912 జ్యేష్ఠ శుక్ల పూర్ణిమ బుధవారం.

—("హిందూ సంసార్" దీపావళి సంచిక వి. శ. 1982 కార్తీకకృష్ణ తదియ)

దీని సారాంశ మేమనిన: 'భామాశా వంశీకులకు పరంపరగా వచ్చు చున్న మేరకు మహాజనులు (వైశ్యులు) సమస్త గృహములందు జరుగు విందులకు ప్రప్రథమమున భామాశావంశీకులకు తిలకముదిద్దు ఆచారము జరుగుచుండెను. కాని యిటీవల కొంతకాలమునుండి ఆ వంశీయులకు తిలకధారణ మొనరించు నాచారమును మానివైచిరి. అప్పుడు మహారాణా స్వరూపసింహజీగారు, తన వంశీకులకు, మాతృదేశమునకు గావించిన సాహాయ్యమును పురస్కరించుకొని ఈ శాసనము కావించిరి. 'మహాజను' లందు 'బావనీ' (సమస్తమగు తమజాతి భోజనము) వివాహాదులందు సింహ పూజాదులకు తొలుతటి ఆచారానుసారము భామాశా వంశీకులకు కావింపవలయును. ఇందునుగూర్చి విక్రమశకము 1912 జ్యేష్ఠ శుక్ల పూర్ణిమ బుధవారము జయచందుకుల ఆణావీరచందు కావడియా పేరుతో నొక శాసనము కావించి భామాశా వంశీకుల కాగౌరవము జరిపించు చున్నారు. మరల కొన్నాళ్లకీ గౌరవము మూలబడగా ప్రస్తుత రాణా వారు విక్రమశకము 1952 కార్తీకశుక్ల ద్వాదశినాడు మరల నాజ్ఞాపత్ర మొసగి ఈ మర్యాదలు జరిపించుచున్నార'ని ఉదయపూర్ కా ఇతిహాస్ 475, 476 పుటలు ప్రథమభాగమువలన తెలియుచున్నది.

భామాశా సోదరుడు తారాచంద్రుడు శాశ్వత కీర్తికాముఁడు. లబ్ధప్రతిష్ఠుడు. సంగీత సాహిత్యాది లలితకళాప్రియుడు. అతడు శ్వేతాంబర పునవియాగచ్ఛాచార్యుడగు శ్రీ హేమరత్నజీ గారిచే 1645లో సాదడి యందు "గోరాబాదల్‌కథా పద్మినీ చౌవాయి" యను గ్రంథము రచింప జేసెను. ఆ గ్రంథమున తారాచంద్రుడు మహాద్భుత సంగీత సాధకుడని తెల్పబడినది.

సంవత్ సోలహాసతః పణంయాల్
సావణసుది పంచమ సువిశాల్
పుహవీపీత్ ధణపరగాడే
సబల పురీసో హే సాదడే

ప్రథవీపరగట్ దాండ ప్రతాప్
దిన్ దిన్ చఢతై తేజ్ విఖ్యాత్
తసమంత్రి సదూ బుద్ధినిధాన్
కావేడయాకుల తిలక సమాన్
సామంధర్ మధుర్ భామాశాహ్
వై రీవంస విధ్వంసణరాహ్
తస లఘు భాయీ తారాచంద్
అవనిజాణి అవతారియో ఇంద్
ధ్రూజిమి అవిచలపాలై ఘరా
సత్రు సమా కీథా పాధరా
తవ ఆదేస్‌లహి సదూభావ్
సుణ్యోతి సోభాఖ్యో వరబంధ్
సాంమధరమ వీర్ రససంబంధ్.

దీని సారమేమన, తారాచంద్రుడు సాదడి పాలకుడనియు, పెక్కు దండయాత్రలు సలిపి శత్రుల గెల్చెననియు తెలియుచున్నది. (ఇది వీర వాణి 1952 డిసెంబర్ 1; పుట 7)

భామాశా పైతము తారాచంద్రునివలె సాహిత్యప్రియుడు. ఆకాల మందలి సుప్రసిద్ధ కవిశేఖరుడు విదురుడు భామాశా ఆశ్రితుడు. విదురుడు 1646 ఆశ్వయుజశుక్ల దశమిన "భామాబావనీ" యనుగ్రంథము రచించెను. ఇది అకారాది వర్ణములతో ప్రారంభించు ఉపదేశాత్మక పద్య గ్రంథము. ఇందు ఏబదిరెండు పద్యములు కలవు. ఇవి భామాశా ప్రబోధించినట్లు వ్రాయబడి యున్నవి.

విమలగచ్ఛ నాగోరీ జ్ఞాని దేపాల్ జసాగుర్
దయాధర్మ ధార్ లియే దేవ చౌబీస్ తీర్థంకర్॥
మదియవటి పృథ్వీరాజ్ సాండ్ తారమల్లు సుణీజై
జసవంత బాంధవ జోడ్ కరణ కలియాణ కహీజై॥
తారాచంద్ లక్‌మణ రామజిణ థితథోమడ్ జోడీధయో

కులతిలక అభంగకావేడియా భామో ఉజలావణభయో॥
మూలమండ్ భారమల్ల సాఖ్ కావేడియోసోహిఈ
పుత్రపౌత్ర పరివార్ భదరి భంజయదతిమోహాఈ
లఖమీనితలఖ్ గుణిఫాల్యంతా సూరజ్ ఖుల్‌హాల్
విస్తరియో జసవాసవీర్ కవికరఈ కుతుహూల్
విస్తార్ ఘుణపూతివహు ఖండబిచఈ జగి అలంవణి ఎహాజణ్
కవికాల ఇయఈ పీథల్ కులఈ భామౌకల్పతురుభవణా
—(వీరశాసన్ 7వ పేజి, క్రీ. శ. 1953 జనవరి 1వ తేది)

జైనులలో పదునాల్గవ తీర్థంకరుడు విమలగచ్ఛ వంశీయుడు జ్ఞాని దేపాలుడు కలడు. అతని శిష్యుడు పృథ్వీరాజు లేదా పీథల్ కలడు. ఆ వంశమున భారమల్లుదయించెను. అతనికి రామలక్ష్మణులవలె తారా చంద్రుడు భామాశా ఉదయించిరి. భామాశా కావడియా కులతిలకుడు. వీరు పౌత్రపుత్ర పరివారములతో నుండిరి. భారమల్లునకు జస్వంతుడను సోదరుడు కలడు.

భామాశా సోదరులు రాజకీయములతోబాటు ధార్మిక సాహిత్య క్షేత్రములందు పలుతెరగుల పరిశ్రమించిరి. రాణా వీరి భక్తిభావమునకు ముగ్ధుడాయెను. కాని రాణా అయోగ్యపుత్రుడు అమరసింహాడు తండ్రికి పూర్తివ్యతిరేకమైన మనుష్యుడు. అతడు పూజ్య తారాచందునకు గావించిన యపకారమే అతని కాలమున మేవాడ స్వాతంత్ర్యే మస్తమింప జేసినది. ఇతడు తండ్రివలె దీక్షగలవాడు కాక భోగలాలసుడైనందున నీ పరిణామము తటస్థించెను. ఈ క్రింది విషయమువలన అమరసింహుని కృతఘ్నత తెలియుచున్నది. ఇది శ్రీ మున్షీజీ వ్రాసినారు.

తారాచంద్రుడు గోడవాడకు ప్రభువు. ఇతని రాజధాని సాదడి. ఇతని ఆశ్రమమున కీతుయను నర్తకి, గాయకి కలదు. అమరసింహుడామెను తన కప్పజెప్పుమని తారాచంద్రునకు వార్తపంపించెను. తారాచంద్రుడు నిరాకరించెను. అమరసింహుడామె నుదయపురమునకు పిలి

పించి చంపెను. తారాచంద్రుని సేవకుడు సైనూరాం ఆమె మేలిముసుగు నానవాలుగా గొంపోయెను. తారాచంద్రుడు అమరునిపై పరాక్రమింప బోవగా, భామాశా-"నాయనా! మనమెల్లరము కాపాడుకొన్న మేవాడ స్వాతంత్ర్యమునిలుపు వారసు డమరుడు. రాణా వృద్ధుడాయెను. మనము పెంచిన మేవాడ స్వాతంత్ర్యము మనమే ఈ రక్తపాతముతో బాడుచేసి కొనరాదు. ఈ విషయము రాణాకు తెలిసిన నాతడాకుమారుని శిక్షించును. మేవాడ రాజ్యమునకు వారసుడుండబోడు. కాన నీవు శాంతింపు"మని వార్త నంపెను.

లక్ష్మణునివంటి తారాచంద్రుడు అన్నగారిమాట దాటలేక తన ప్రియురాలి దుర్మరణ మోర్చుకొనలేక తన నలువురు పత్నులు, సేవకులు, ఆర్వురు గాయకురాండ్రు, ఉత్తమాశ్వము, మేనత్త మేనమామలు, ఒక ముస్లిం సాధువు వీరితో గలసి మొత్తమిరువదొక్క ప్రాణులు చితిలో దుమికి మరణించిరి.

తారాచంద్రుడు లూంకా మతానుయాయి. ఈ మతోద్ధరణ కీత డనేక మహత్కార్యముల గావించెను. ఈ క్రింది సంస్కృత శాసన మీతడొనర్చిన మహత్కార్యముల దెల్పుచున్నది.

'తారాచంద్రేణ సాదడీనామ నగరం స్థాపితం సర్వత్ర పౌషధ శాలాదికాని స్థానాతికారితాని పురేపురే గ్రామే గ్రామే బహుజనే బోధవందేమం స్వగణీయః కృత్వా శ్రీనాగోరీయలుంకాగణోతి ఖ్యాతి మాయపునః భామాశా హేవ దిగంబరమతస్థేన నరసింఘ పౌరాస్వగణే వ్వమానతీర బహుస్వం దత్వా 1700 గృహాణి తేషా మాత్మీయాని కృతాని బండారకాది పురేషు.

(వీరశాసన పేజి 7: 1952 డిసంబర్ 16 : 1-11-1953)

"తారాచంద్రుడు సాదడి నగరము స్థాపించెను. అన్నిచోట్ల పౌషధ శాల లేర్పరచెను. గ్రామగ్రామములందలివారికి ధనమిచ్చెను. శ్రీనాగో

రీయలుంకాగణమతి విఖ్యాతి నొందెను. భామాశా దిగంబర జైనమతము స్వీకరించి నరసింహలుంకా తన గణమందు బహుళధనమొసగి బండార కాది పురములందు 1700 గృహములు కట్టించి వారి కొసగెను."

దీనినిబట్టి తారాచంద్రుడు లూంకామత మెట్లుద్ధరించినది, యే యే కార్యములు కావించినది తెలిసికొనవచ్చును. నేటికిని లూంకామతాను వాదులు తారాచంద్రుని పవిత్రనామమును సమాదరించుచున్నారు. అతడు ఆత్మత్యాగము కావించిన ప్రదేశమున నా యాత్మత్యాగము కావించిన ఇరువదొక్క ప్రాణుల విగ్రహములను వి. శ. 1648 వైశాఖకృష్ణనవమి నాడు ప్రతిష్ఠించిరి. ఈనాటికిని లూంకామతానుయాయులా విగ్రహములను కుంకుమ పూవు చందనములతో పూజించుచున్నారు. అది ఆ మతస్థుల తీర్థయాత్రాస్థలముగ ప్రసిద్ధికెక్కినది. వారు దీక్షాదినమున, తపోదీక్ష నొందు సమయమున మంగళవాద్యములతో నేగి యా విగ్రహముల నారాధించి వచ్చుచుందురు. ఈ విషయములు శ్రీ రత్నప్రభాకరజ్ఞాన పుష్పమాల 'ఫలౌది'నుండి వి. శ. 1985 లో "శ్రీ జైనశ్వేతాంబరమూర్తి పూజక గోడవాడ ఔర్ పాదడీ లూంకామత యోంకెమతభేద్‌వా దిగ్దర్శన్" అను పేరుగల గ్రంథమునుండి పేర్కొనబడినవి.

తారాచంద్రునకు రాజకీయరంగముననేగాక మతరంగమున గూడను హెచ్చుస్థానము కలదని గ్రహించియున్నాము. విక్రమశకము 1648 (క్రీస్తుశకము 1590) లో తారాచంద్రుడు పరమపదించెను.

తన సోదరుని దుర్మరణమున కమరసింహుడు కారకుడని తెలిసి యుండియు భామాశా మేవాడ రాజ్యమందలి యకుంఠిత భక్తితో ప్రతీకారము చేయనొల్లక ప్రాపంచిక విషయములు రోసి విరక్తుడై యంత్యకాలమువరకు దేశభక్తి నేమరక కర్మయోగియై మంత్రిత్వము నెరపుచుండెను. విక్రమశకము 1653 (క్రీస్తుశకము 1595) లో మహా రాణా ప్రతాపుడు మరణింపగా భామాశా అమరసింహుని రాజునుగావించి

విక్రమశకము 1656 (క్రీస్తుశకము 1598) మాఘశుద్ధ ఏకాదశినాడు పరమ పదించెను.

వీరి మరణముగూర్చి వీరవినోదము 251వ పుటలో నిట్లుల్లేఖింప బడియున్నది.

"భామాశా మహా శక్తిసంపన్నుడు. అతడు మహారాణా ప్రతాపుడు సింహాసన మెక్కినది మొదలు రాణా అమరసింహుని కాలమున మూడేండ్లవరకు ప్రధాని పదవిని నిర్వహించి, ఘోర రణములందు పోరాడి, దేశరక్షణకు ధన, దేహముల నర్పించియుండెను. ఈతడు విక్రమశకము 1656 మాఘశుక్ల ఏకాదశి (హిజరి 1009 సా 98 జలాయి) (క్రీస్తుశకము 17-1-1600) నాడు తనకు 51 సంవత్సరముల 7 నెలల వయస్సులో మరణించిరి. తాను మరణశయ్యపై నుండి తుది నిముసములలో తన భార్యను బిలచి మేవాడ రాజ్యములోని ఖజానా ఆదాయ వ్యయములు వ్రాసియుంచిన లెక్కపుస్తకము తన యనంతరము రాణా కొసగమని చెప్పెను. ఆమె యట్లే కావించెను."

భామాశా అనంతరము రాణా అమరసింహుడు భామాశా కుమారుడు జీవాశాను తనకు ప్రధానిని గావించుకొనెను. కాని వీరి కాలమునందే జహంగీరు పాదుషా వీరి స్వాతంత్ర్యా మపహరించెను. అమరసింహుని కుమారుడు కర్ణసింహుడు జీవాశా యనంతర మతని కుమారుడు అక్షయరాజును మంత్రి గావించుకొనెను. ఈ విషయములు రాజపుతానెకె జైనవీర్ పుటలు 96, 100 లలో నున్నవి. మరియు రాజ పుతాన్‌కా ఇతిహాసము మూడవభాగము 787వ పుటలో నున్నది.

రాణా ప్రతాపసింహుని కాలమునుండియు "డూంగరపూర్" పాదుషా రాజ్యములో చేరియుండెను. డూంగరపూరు రాజు రావల్ ఉదయపుర రాణాల ఆధిపత్యము నంగీకరించ కుండెను. కర్ణసింహుని కుమారుడు జగత్‌సింహరాణా తన ప్రధాని యక్షయరాజును రావలుని

మీదకు సేనతో పంపెను. రావల్ భయపడి అడవులలో దాగుకొని ప్రాణములు కాపాడుకొనెను. భామాశా వంశీకులు నాలుగు తరములవారు రాణాలకు మంత్రులై మేవాడను సేవించిరని ఓఝాజీగారు వ్రాసి యున్నారు.

గుజరాతునందు వస్తుపాల తేజఃపాల మంత్రి సోదరులవలె భామాశా తారాచంద్రు లఖిల మేవాడలో కీర్తి నొందిరని రాజపుతానాకా ఇతిహాస్ మూడవ భాగము 787వ పుటలో నున్నది.

భామాశాగారి భవనము చిత్తోడునందలి తోపుఖాన (ఫిరంగిశాల) సమీపమందలి సైనిక శిక్షణ మైదానమునకు సమీపమున పశ్చిమదిశనుం డెను. రాణా సజ్జనసింహుడు క్రొత్తసైనిక శిక్షణశాల నేర్పించు సమ యమున భామాశా భవనమును పడగొట్టించెనని శ్రీ నాహటజీగారి 'భామాశా కా ఘరానా' అను గ్రంథమున గలదు.

భామాశా మహాత్యాగమును చరిత్రయం దీవిధమున స్వర్ణాక్షర ములతో లిఖించియుండిరి. కాని - రావుబహదూర్, మహామహోపా ధ్యాయ, పండిత గౌరీశంకర హరిశ్చంద్రజీ ఓఝాగారు తాను రచించిన 'ఉదయపూర్ రాజ్యకె ఇతిహాస'ములో 'మహారాణా ప్రతాప్‌కీ సంపత్తి' అను శీర్షిక క్రింద మహారాణా ప్రతాపుడు నిరాశతో దేశము వదలి పోనుండ భామాశా సాయమొనరించిన సుప్రసిద్ధ చారిత్రక సంఘటనమును గురించి కొన్ని యాక్షేపణీయములగు విషయములు వ్రాసియుండిరి.

" మహారాణా కుంభాసాంగావలన పూర్వార్జితములగు పతుల సంపదలు నిలువ యుండినవి. అక్బరు పాదుషా ఆ ద్రవ్యము నంత వరకు గనుగొని యుండలేదు. అట్టి సంపదలే వారికి లేకున్నచో జహాంగీరుతో సంధి కుదుర్చుకొని మహారాణా అమరసింహు డమూల్య రత్నముల నాతని కెట్లీయగలడు ? ముందు కాబోవు రాణాలు జగత్ సింహ, రాజసింహు లనేక దానము లెట్లు చేయగలరు ? రాజసముద్రాది

అనేక బహుధనవ్యయ కార్యము లెట్లు చేయగలరు ? అందువలన, భామాశా తన సొంతద్రవ్యము నీయలేదు. వేరు వేరుచోట్ల సుర క్షితముగ నున్న రహస్య రాజకోశాగారముల నుండి ద్రవ్యమును దీసి కొని వచ్చి యిచ్చియుండిరి." ఈ విషయము ఉదయపూర్ కా ఇతిహాస్ మొదటి భాగము 463-466 పుటలలో గలదు.

దీనిమీద 'త్యాగభూమి' యను శీర్షికతో శ్రీ హంసజీగారీవిధ ముగ ఖండనము వ్రాసియుండిరి. "గౌరీశంకరజీగారి యుక్తివాదనకు ప్రత్యుత్తరమిచ్చుట మిక్కిలి కష్టమనుట నిస్సందేహము. కాని - రాణా ప్రతాపుడు తన రాజ్యములోని పలుచోట్ల నున్న రహస్య కోశాగారముల తెలిసికొన జాలనివాడనుట యసంభవము. అది అతని అసమర్థతను అశక్తతను దెలియజేయుచున్నది. భామాశా తన సొంతధన మీయక రాజ కోశములోని ధనము మాత్రమే ఇచ్చినచో నతనికి, నతని వంశీ కులకు మహారాణాలు వంశ పరంపరగ అపూర్వ సన్మానము జరిపినట్లు శ్రీ ఓఝూజీగారు ఉదయపూర్ రాజ్యకా ఇతిహాస్‌లో 788వ పుటలో నంత శ్లాఘ్యముగ నేలవర్ణించి ఉదాహరించి యుందురు ? ఒకకోశాధికారి కది సామాన్య కర్తవ్యమైయుండ నింతమాత్రమునకు వారిని వంశ పరం పరగా మహారాణా వంశీకులు, మేవాడపౌరు లెట్లుసన్మానించియుందురు? కావున వీరి వాదము యుక్తి యుక్తముగ లేదు. సత్యదూరమైనదనియు తెలియుచున్నది." ఈ విషయము త్యాగభూమి సంపుటి 3; సంచిక 4 పుట 445లో గలదు.

త్యాగభూమిలోని శ్రీ హంసజీగారి వాదనమును బలపరచుచు శ్రీ గోయల్‌జీగారిట్లు వ్రాసియున్నారు.

"ఈ విషయమున శ్రీ ఓఝూజీగారి యుక్తివాదమును విమర్శించుచు వది కేవలము కల్పితమను వాదము కొంతవరకు సత్యమని విశ్వసింప వలసియున్నది. శ్రీ ఓఝూగారి వాదము నెంతవరకు విశ్వసించు వచ్చు ననగా మహారాణా కుంభ, సాంగాదులు సంపాదించిన అతుల సంపద

రాణాప్రతాపుని కాలమువరకు సురక్షితముగ నుండెను. అది వ్యయము కాలేదు. అది చిత్తూరు దుర్గమున లేదు. ఉదయపురముననో మరెందో యుండవచ్చును. అక్బరుపాదుషా రహస్య ధనాగారముల విషయము తెలిసియుండక పోవచ్చును. కాని ఈ రెండు దుర్గములమీది అధికారము అక్బరుదే. వారి సైన్యము సామంతులు అందుండిరి. ముమ్మరముగ పోరు జరుగుచున్న కాలమున నందరు సైనికుల కనులు గప్పి భామాశా అంత ధనము నెట్లు ఆ కోశాగారములనుండి కొని రాగలడు? కావున హాల్దీఘాటు యుద్ధము పిదప మహారాణా ప్రతాపునకు భామాశా తన పూర్వీకు లార్జించిన ధనమునే దేశోద్ధారణకై యిచ్చియుండు ననుటే సమంజసము.

అయినచో — అమరసింహుడు జహాంగీరు కిచ్చిన అమూల్య రత్నములు, జగత్సింహుడొసరించిన దానములు మామాట కేమి చెప్పుదు వని మనలను ప్రశ్నించుచున్నవి. వానివిషయమేమనగా—వారందరు చిత్తూరు, ఉదయపుర దుర్గములు స్వాధీనపరచుకొని ఆ రహస్య ధనా గారములందలి ద్రవ్యమును వ్యయించియుండవచ్చును. కాని భామాశా గావించిన సహాయ మాతని స్వార్జితధనమేగాని, రాణాలది కాని వారి పూర్వులదికాని కాదు. కావ- ఓఝూగారివాదము ఓటికుండ యగుచున్నది. భామాశా అపూర్వ త్యాగమే మేవాడ స్వాతంత్ర్యమును కాపాడెను. కావుననే భామాశా మేవాడోద్ధారకుడని ప్రసిద్ధినొందెను." ఈ విషయము రాజపుతానెకె జైనవీర్ పు. 99 లో గలదు.

భామాశా ఉదారత త్యాగముల యావద్భారతదేశప్రజలు స్మరించి గర్వించి ధన్యులగుచున్నారు. రాణా ప్రతాపుని పేరు స్మరించు ప్రతి చోటను భామాశా త్యాగము స్మరింపబడుచున్నది. మేవాడలోనే కాక యావద్భారతమం దేమూలనైనను నొక్క- పౌరుడైనా నున్నన్నాళ్ళు భామాశా అపూర్వ త్యాగాలు స్మరింపబడితీరును. మాకీ యవకాశము కల్పించిన యెల్లరకు కృతజ్ఞులము.

—వేంకటేశ్వర వేంకటరమణ కవులు.

# ఇందలి పాత్రలు

## పురుషులు.

| | |
|---|---|
| ఉదయసింహుడు: | మేవాడ మహారాణా. |
| భారమల్: | భామాశా తండ్రి, రాణా మంత్రి |
| ప్రతాపసింహుడు: | ఉదయసింహుని కుమారుడు, మేవాడ రాణా. |
| భామాశా: | ప్రతాపసింహుని మంత్రి. |
| భోమానాహటా: | భామాశా మామ. |
| అమరసింహుడు: | ప్రతాపసింహుని కుమారుడు, యువరాజు. |
| మాళవరాజు: | మాళవదేశాధీశ్వరుడు, |
| తారాచంద్రుడు: | భామాశా సోదరుడు. |
| అక్బరు: | ఢిల్లీ మొగల్ పాదుషా. |
| మానసింహుడు: | అక్బరు నాశ్రయించిన రాజపుత్ర రాజు. |
| మీర్జాఖాన్: | అక్బరు దండనాథుడు. |
| రామాసాహిణీ: | ప్రతాపుని ఆస్థానమంత్రి. |
| సాయిదాసు దేవదా: | బస్సీ ఖిలేదారు. |
| సైనూరాం: | తారాచంద్రుని ఆశ్రితుడు. |

జ్యోతిష్కుడు, మంత్రులు, గూఢచారులు, జైనమునులు, కోశాధిపతులు, తదితరులు.

## స్త్రీలు

| | |
|---|---|
| వీరా: | ఉదయసింహుని ప్రేయసి. |
| * మోహినీదేవి: | భారమల్ భార్య. |
| పద్మావతి: | ప్రతాపసింహుని రాణి. |
| * మనోరమ: | భామాశా భార్య. |
| * అలకాసుందరి: | భోమానాహటా భార్య. |
| శీతా: | తారాచంద్రుని ప్రేయసి. |
| * కేతకి: | తారాచంద్రుని ప్రముఖ గాయకురాలు. |

గాయకురాండ్రు, రాకుమారి, తదితరులు.

---

* ఈ గుర్తుగల పేరు కల్పితములు.

# భా మా శా

## (ప్రథమాంకము – మొదటి దృశ్యము)

స్థలము – భారమల్ భవనము.

సమయము – సంధ్యా సమయము.

(పుత్ర జన్మోత్సవ సందర్భమున మంగళవాద్య ధ్వనులు మ్రోగు చుండును. ఇంటిలోపల ముత్తైదువల జోలపాటలు వినిపించు చుండును. ఒక ప్రక్క అతిథులకు భారమల్ కావించు సత్కారములు; బ్రాహ్మణులు, విద్వాంసులు, కవులు, గాయకులు, జ్యోతిష్కుల పరస్పర సల్లాపములు; కవి, గాయక, విప్ర సన్మానములు జరుగుచుండ తెర యెత్తుదురు.)

(ఉన్నతాసనము నధిష్ఠించి భారమల్, ఎదుట ఉచితాసనముపై జ్యోతిష్కుడు కనిపింతురు.)

భారమల్ :— భూదేవా! నేడు నాపూర్వ పుణ్యము ఫలించినది. నా ధర్మపత్ని మగ బిడ్డను ప్రసవించినది. నే నీ నాటికి తండ్రినైతిని. ఈ సుదినమున మీరు నా శిశువునకు జన్మపత్రిక లిఖించి ఆతని జీవిత విశేషముల వినిపింప మిమ్ము ప్రార్థించుచున్నాను. మీకీ శ్రమ నొసగినందులకు నన్ను మన్నింప ప్రార్థన.

తాను పెంచిన తీగ పూతను గనంగ
స్వయముగాఁ బెంచు వృక్షంబు ఫలము జూడ
పడెడు తహతహ నెన్నవ వంతు సుమ్మి?
తనయు భవితవ్య మెఱుగు నుత్కంఠ లోన. (1)

జ్యోతిష్కుడు :— భారమల్ జీ ! ఇందు శ్రమ యేమున్నది ? ఇది నా విధ్యుక్త ధర్మము. ఇదిగో ఇప్పుడే బాలుని జన్మకాలమును గుణించి భావి ఫలముల విన్నవించెదను.

ఎవ్వనికి జన్మ పత్రిక నివ్వటిలదొ ?
వాని జీవన మత్యంత భారమగును
తారకలు, చంద్రుడును లేమి దైన్యమొందు
కటిక చీకటి రాతిరిగా రహించు. (2)

కావున ప్రతివానికి జన్మపత్రిక అవసరము. అది భావి శుభాశుభ ఫలములకు దీపిక.

(అని గ్రంథములు చూచుచు గుణించుకొను చుండును.)

భారమల్ :— ఆర్యా ! బాలకుని జన్మ ముహూర్త మెట్టిది ? గ్రహబల మెట్లున్నది ? శారీరక లక్షణములు శుభ సూచకము లేనా ?

జ్యోతిష్కుడు :— శాహోజీ ! ఇదిగో ముహూర్తము కట్టితిని. తాత్కాలిక గ్రహసంపత్తిని పట్టి చూడ నీ బాలకుడు అసాధారణ వ్యక్తి కాగలడు. మహారాజ్య చక్రమును త్రిప్పగల శక్తి సంపన్నుడు కాగలడు.

భారమల్ :— ఆర్యా ! మిక్కిలి సంతోషము. ఇకను కొన్ని ఫలితముల సెలవిండు. అనుభవించు కొలది కోరిక లూరునట్లు వినుకొలది తనయుని భావిఫలముల విను నభిలాష మిక్కుటమగుచున్నది.

జ్యోతిష్కుడు :— అయ్యా! ఈ బాలుడు మీకన్న నైశ్వర్య వంతుడగును. సామ్రాజ్యమునకు సచివ మౌళియై దేశోప కారకుడు కాగలడని చెప్పవచ్చును.

ఖారమల్ :— మహాశయా! మీరు మిక్కిలి ఆనందము కలి గించితిరి. చిరంజీవి ఆయురారోగ్యము లాశాజనకము లేనా?

జ్యోతిష్కుడు :— ఖారమల్ జీ! మీ చిరంజీవి డెబ్బదైదు వసంత ముల మాధుర్యము చవి చూడగలడు. తన బల పరా క్రమములచే దేశద్రోహుల పీచమడచి దేశ మాతృ్యాణము తీర్పగలడు.

ఖారమల్ :— ధన్యుడను. తమరు జ్యోతిశ్శాస్త్రమం దందె వేసిన చేతులు! క్షణములో నా ప్రశ్నల కుచిత సమా ధానము లొసగుచున్నారు. మీకు జ్యోతిషము కరతలా మలకమై యున్నది.

జ్యోతిష్కుడు :— పూజ్య శాహాజీ! ఇందు నా ప్రత్యేకత యేమున్నది? జ్యోతిర్విద్యా ప్రభావ మట్టిది! మీ ప్రశంస శాస్త్రమునకే చెందవలసి యున్నది. దీనివలన ననేకములగు నమూల్య విషయముల నెఱుగ గలము.

అభము శుభంబును శాస్త్ర
ప్రభావమునఁ దానెఱింగి పౌరుష మేధా
విభవముల నశుభమీగుట
శుభముల నార్జించు కొనుట జ్యోతిష ఫలముల్. (3)

కావున, మనము జ్యోతిషమున నేదో గండమున్నదని గాని, యేదో సంపద రాగల యోగమున్నదనిగాని నమ్మి కాచుకున్నది కాకపోవునని ఊరకుండుట పనికిరాదు. తగిన ప్రయత్నము చేయనిదే శాస్త్రము చెప్పిన శుభఫలమురాదు. అశుభఫలము పోదు. ఇది జ్యోతిశ్శాస్త్ర ప్రయోజనము.

ఖారమల్ :— ఆర్యా! శాస్త్రప్రయోజనమును లెస్సగ సెల విచ్చితిరి. ఇంకొక విషయమును గూర్చి ప్రశ్నింతును. నా కుమారుడు డబ్బున కెన్నడేని కటకటలాడునా?

జ్యోతిష్కుడు :— మహాభాగా! ఈ చిరంజీవి మీకన్న నైశ్వర్య వంతుడు. అంతేకాదు, తన వివాహమువలన దక్షిణావర్త శంఖము నొందగలడు. దక్షిణావర్త శంఖ ప్రభావము మీరెరుగనిది కాదుగదా?

ఖారమల్ :— (ఆశ్చర్యముతో) ఏమేమి? నా కుమారుడు దక్షిణావర్త శంఖ మొందగలడా? మహానందము కలుగు చున్నది. పూర్వము ప్రాగ్వాట వైశ్య వంశాలంకారుడగు వస్తుపాలునకు సముద్రుడు దక్షిణావర్త శంఖము నిచ్చి నాడట! ఆయన అర్బుదాచల యాత్ర కరుగునపుడు రత్నశ్రేష్ఠి యింట శంఖాధిష్ఠాన దేవత యాతనికి స్వప్న మున కనిపించి తనను వస్తుపాలునకు చేర్చుమని యాదేశింప నాతడట్లు కావించె ననియు, వస్తుపాలుడా శంఖమును తన రాజగు వీరధవళున కొసగినట్లు పూర్వ చరిత్రలు తెలుపు చున్నవి.

ఈనాడు భోమానాహటా యింట శంఖదేవత యున్నది. శంఖదేవత యింట వెలయుట యన సాక్షా ల్లక్ష్మీదేవి యనుగ్రహించుటే !

జ్యోతిష్కుడు :— ఆర్యా ! మీరు నుడివినదంతయు యథార్థము. మీ చిరంజీవి ఔదార్యవంతుడు. ఈ సంపదల నన్నిటినీ దేశోద్ధరణ కుపయోగింప గల మహామహుడు.

భారమల్ :— నా కుమారు డంతటి త్యాగశీలుడా ! త్యాగ మహిమ మెవరు వర్ణింపగలరు ! మా పూర్వీకుడగు వస్తుపాలుడు మూడు వందలకోట్ల ద్రవ్యము దానధర్మము లొనర్చినవాడు కాదా ! మాఘు మహాకవి త్యాగము లోకుల కాదర్శపాత్రము గదా !

ధనముననను, కర్మచేతను
తనయుల నొందుటను గాని తనరదు, త్యాగం
బున మాత్రమె యమృతత్వం
బొనరు ననుచు చాటుచుండె నుపనిషదుక్తుల్. (4)

నూరుగుర లోన ప్రభవించు శూరుడొకడు
వేవురం దుదయించును విజ్ఞుడొకడు
దశ సహస్ర జనంబుల దాత యొకడు
కలడొ ? లేడో ? యనెడి శంక కలుగుచుండు. (5)

కావున త్యాగమహిమ వర్ణింప నలవికానిది. ఇంకొక్క విషయము. మా చిరంజీవి కేమి నామధేయము సూచించెదరో సెలవిండు.

జ్యోతిష్కుడు :— (కొంచెమాలోచించి) 'భామ' (స్త్రీ) మూల ముస భాగ్యమందగలడు. కాన నీతనికి తమ వంశ పరం పరగవచ్చు 'శాహా' బిరుదము జేర్చి 'భామాశాహా' యని పేరిడుట లెస్సయని తోచుచున్నది.

భామాశాహ్ :— (ప్రసన్నతతో) మహాశయా! కృతజ్ఞుడను! మీరీ సన్మాన మందుకొని నన్నానందింప జేయుడు. నాకును ఈ పేరే తోచినది. మీ కివే నా ధన్యవాదములు.

(సేవకులు స్వర్ణంపు బళ్లెరమున బంగారు నాణెములు, పట్టు బట్టలు, తాంబూలము, ఫలములు గొనివచ్చి అందింతురు. భారమల్ వానిని గైకొని జ్యోతిష్కున కిచ్చి నమస్కరింప నాతడు దీవించును.)

జ్యోతిష్కుడు :— మహదానందము! శాహాజీ! ఇక నేను శలవు తీసికొందును. ఇట్టి శుభ సమయములలో నీ యాశ్రితుని మఱచి పోకుడు.

(నిష్క్రమించును. ఎల్లరు నిష్క్రమింతురు. తెరవ్రాలును. )

## ( రెండవ దృశ్యము )

స్థలము — భోమానాహటా పడకటిల్లు. సమయము — రాత్రి.

( ఒక ప్రక్క తెల్లని దువ్వటి పఱచిన మణిమయ తల్పము. మరొకదెస బంగారు నాలుగుకాళ్ల పీటపై రత్న సింహాసనము. సింహాసనముమీద దక్షిణావర్త శంఖము. సమీపమున వెలుగుచున్న దీపము. భోమానాహటా హారతినీయబోవు చుండును. చేతిలోని బంగరు పళ్లెరమందు భోమానాహటా భార్య అలకాసుందరి పూజా సామగ్రులతో చెంత నిలువబడి యుండగా తెర యెత్తుదురు. )

భోమానాహటా :- ( హారతి నిచ్చుచు ) ఓ శంఖరాజమా! నీవు నాయింట నడుగిడి పదునెన్మిదికోట్ల ధన మొసంగితివి. వ్యయమొనరించు కొలది సంపదల నక్షయము కావించు చుంటివి. ఎట్టి స్థితియందైనను నీ పూజ గావింపనిదే నిదు రింప నొల్లను. నేడు సైతము నా పూజలను గ్రహించి నన్ననుగ్రహింపుము.

(అలకాసుందరి వీణావాదన మొనరించుచు పాట పాడు చుండును.)

పాట. అనుబంధము — 1.

(పాట ముగియక ముందే ఆకస్మికముగ హారతి దీపకళిక జారి భోమానాహటా దుకూలముపై బడి మండుచుండ నలకాసుందరి వీణను వదలి వెళ్లి మంట నార్పును.)

అలకాసుందరి :-(విస్మయముతో) నాథా! నేడీ యమంగళమేమి? ఏమీ శంఖ దేవతకు నేడు మనపూజ స్వీకరింప నిష్టము కాలేదా ? ఏమి యీ యపశకునము! తమ దుకూ లము కాలుట చూడ నవశ్యమేదో మనకొక యనిష్టము కలుగునని తోచుచున్నది.

భోమానాహటా :- (నిర్విణ్ణతతో) ప్రాణేశ్వరీ ! ఏల చింతించె దవు ? మన లలాటమున నేది లిఖింపబడి యున్నదో యది జరుగక మానదు. నీ వీ విషయ మింతటితో మరచి పొమ్ము. పోయి శయనింపుము. నేనుసైత మీ సంఘట నను మరచి శయనించుటకు ప్రయత్నింతును.

(అలకాసుందరి వెళ్లిపోవును. భోమానాహటా ముఖము వరకు శాలువా కప్పుకొని పాన్పుపై శయనించును.)

(నేపథ్యమున) — భోమా ! నిదురించితివా !

భోమానాహటా :- (నిద్రమత్తుతో) ఎవరు నా నిద్రను భంగ పరుప వచ్చితిరి ?

(నేపథ్యము నుండి) - నేను నీ దక్షిణావర్త శంఖదేవతను. నీ గృహామునుండి వెడలుటకు ముందుగా నీకు తెలియ పరుప వచ్చితిని. సావధానముగ వినుము. నీకు నవతి కాలమున నొక బాలిక జన్మింపనున్నది. అది యట్లుం చుము.— భారమల్ కావడియా కొక యదృష్టశాలి జన్మించియున్నాడు. ఆతని అదృష్టదేవత నన్నచటి కాక ర్షించుచున్నది.

భోమానాహటా :- ( విస్మయచకితుడై లేచి నలుదిక్కులు చూచి) ఏమేమి ! శంఖదేవతా ! నా గృహాము వీడి పోవుచున్నావా ? ఇది స్వప్నమా ? లేక భ్రాంతియా ? నా తల తిరిగిపోవు చున్నది. నాకేమియు తోచుటలేదు.

(నేపథ్యమున) — భోమా ! విస్మయమందకుము. ఇది స్వప్న మైనను యథార్థమే. నేను నీయింట నిక నుండుట వీలు పడదు. నీవు మానవ మాత్రుడవే కాన నీ యాకస్మిక సంఘటనకు తారుమారగుట సహాజము! కాని ధీరుడవై యితర యోచనలు మాని ప్రసన్న హృదయముతో నాకు వీడ్కోలొసగుము.

భోమానాహటా :- ( లేచి నిలువబడి పూజాపీఠము కడకరిగి ఆతురతతో) ఓ శంఖదేవతా ! నీకు వీడ్కోలొసగుటయా ! అది నాకు సాధ్యమా ? నా కంఠమున జీవ ముండగా నాపని చేయగలనా ?

పాదముపెట్టి నా గృహము పావనమున్ బొనరించి నాకు న
ష్టాదశ కోటి సంఖ్యగల స్వర్ణము లర్పణజేసి ప్రోచి యే
ఖేదము కల్గనీక పరికీర్తిత సౌఖ్యము లందజేసి నీ
వై దయవీడి నన్ విడువ న్యాయమె? తెల్పుము
శంఖదేవతా! (1)

అనుదినము నీదు నర్చన
పొనరింపక పచ్చిగంగ ముట్టి యెఱుగనే
మనమున శల్యము రీతిగ
చనెద ననుచు పలుక నీకు సౌజన్యంబే ! (2)

(నేపథ్యమున)—నాయనా ! భోమా ! కాలము మరలింపరానిది. సుఖదుఃఖములు పూర్వజన్మమం దొనరించిన పుణ్యాపాపముల వలన కలుగు చుండును. సుఖమున పొంగి, దుఃఖమున క్రుంగుట ధీరుల లక్షణము కాదు. నాకు మాత్రము నిన్ను వదలి పోవుట యిష్టమా ! కాలపూరుషుని కఠోర శాసనమునకు నౌదల వంచక తప్పదు. నీవును నేనును నీకు కనిపించు సర్వమును ప్రకృతికి దాసులము. కాన నీవు జాలిగొల్పు ముఖముతో నన్ను మరలింప ప్రయత్నింపకుము. పట్టును కట్టుకొన రమ్మన్న

ప్పుడు, వనములకు వెడలు మన్నప్పుడు ఒకే రీతి నుండిన శ్రీరాముని మనఃప్రవృత్తి మన కారాధ్యము. నీవు వారించి నన్ను ప్రయోజనములేదు. నేనా బాలుని యదృష్ట దేవతకు పరతంత్రను. అపరిహార్యమైన నీవిషయమున నీవు దిగులు వదలి నిశ్చింతుడవై నాకు ప్రసన్నవదనముతో వీడ్కోలొసగుము.

భోమానాహాటా :— తల్లీ ! నా యజ్ఞానము నీ వాక్యములచే నివృత్తి చెందినది. కృతజ్ఞుడను. ఈ పాదసేవకుని తుది కోర్కె తీర్పుము. రేపు సూర్యోదయము వరకు నిందుండుము. రేపు స్వయముగ నేను భారమల్ కావడియా యింటికి నిన్ను గొంపోయి సమర్పింతును. తల్లీ! నా యీ తుది కోర్కెను మన్నింపుము.

(నేపథ్యమున) — నాయనా ! నా ప్రియ భక్తుడవగు నీ కోరికను నిరాకరింపజాలను. నీ యిష్టమెట్లో యట్లే యగుగాక ! ఈ లోగా నీ మనస్సు మార్చుకొనకుము. రేపు మధ్యాహ్నము లోగా నీవు నన్నచ్చటకు చేర్పనిచో రేపు సాయింసంధ్య యగు నప్పటికి నీ సింహాసనము శూన్యము కాగలదు.

భోమానాహాటా :— అట్లెన్నటికి జరుగదు నా శంఖదేవతా ! రేపు మధ్యాహ్నమునకు ముందే నిన్ను భారమల్ జీ గృహమునకు చేర్చెదనని నా పుణ్యముపై శపథము గావించుచున్నాను.

(నేపథ్యమున) — తథాస్తు !

భోమానాహటా :— జీవితేశ్వరీ ! జీవితేశ్వరీ ! నీ వింత త్వర లోనే నిద్రించితివా ?

(నేపథ్యమున) — నాథా ! లేదు. వచ్చుచుంటిని.

( అలకాసుందరి ప్రవేశించును )

అలకాసుందరి :— నేడీ అసాధారణ సంఘటనము కారణముగ నింతవరకు తాము నిద్రింపరైతిరి. (నిదానించి చూచి) నేను వచ్చునంత వరకు తా మెవరితోడనో సంభాషించు చున్నట్లున్నారే ? నే నప్పుడు రా బ్రయత్నించియు మధ్యలో నే నరుదెంచుట సమంజసము కాదని రాజాల నైతిని. (నాలుగు దిక్కులు కలియజూచుచు) ఇక్కడెవ రును కన్పించుట లేదే? మీతో సంభాషించిన వా రెవరై యుందురు ?

భోమానాహటా :- నిన్ను పిలచుటకు ముందు నేను నా యారాధ్య దేవత యగు శంఖదేవతతో సంభాషించు చుంటిని. మనకు సకలైశ్వర్యము లొసగిన శంఖదేవత రేపు నా కుటీరమును విడచి పోనున్నది.

అలకాసుందరి :— నేటి యపశకున ఫలిత మిదియా ? ఏమీ ! శంఖదేవత మన గృహమందుండ నొల్లదా ?

భోమానాహటా :- లేదు. ఇంతటితో మన యిల్లువదలి అన్యత్ర వెడలుట కుద్యుక్తయై యున్నది.

అలకాసుందరి :— ఎక్కడ ? ఎవరి పవిత్రగృహమునకు ? మనకన్న యోగ్యులెవరు లభించిరో ?

భోమానాహాటా :— నే నీ ప్రశ్న నడుగుటకు పూర్వమే శంఖ దేవత సెలవిచ్చినది. భారమల్ కావడియా కొక యపూర్వ భాగ్యశాలి యుదయించినాడట ! అతని యదృష్ట దేవత వలన నీ శంఖదేవత యాకర్షింప బడు చున్నదట !

అలకాసుందరి :— ఐనచో మనమిప్పుడేమి చేయ వలయును ?

భోమానాహాటా :— చేయుట కేమున్నది. శంఖదేవతయే ప్రస్తావ వశమున నీ కొక కన్య జన్మింపగలదని సెలవిచ్చినది. మన పుట్టబోవు బిడ్డను తన కోడలిని కావించుకొన వలసిన దని భారమల్లునకు మనవిచేయ దలచితిని.

అలకాసుందరి :— (ఆనందముతో) మీ యాలోచన లెస్సగ నున్నది. స్వామి కార్యము స్వకార్య మన్నట్లు భారమల్లు నింటికి శంఖదేవతను కన్యను మన మప్పగించు కొందము. మనమును తగిన వియ్యము చేసిన వారమగుదుము. మీ నిర్ణయమున కానందముతో సమ్మతించుచున్నాను.

భోమానాహాటా :— ప్రేయసీ ! ఇంకను జాలరాత్రి కలదు. నీవు పోయి శయనింపుము. ప్రభాత కాలముననే భారమల్ జీకి శంఖదేవత నర్పింపవలసియున్నది. నేనును శయ నింతును.

( అలకాసుందరి నిష్క్రమించును. భోమానాహాటా శాలువను గప్పుకొని నిద్ర నభినయించును.)

( తెర వ్రాలును )

## ( మూడవ దృశ్యము )

స్థలము — భారమల్ కావడియా భవనము.

సమయము — ప్రాతఃకాలము.

( గృహాంతర్భాగమున తమ మిత్రులతో భారమల్ కావడియా పట్టుబట్టలు కట్టుకొని నిలువబడి యుండును. బంగరు పళ్లెరమందు శంఖ దేవత నుంచుకొని పైన పట్టుబట్ట కప్పి భోమానాహటా అరుదెంచి యుండును. )

( తెర యెత్తుదురు )

భారమల్ :— భోమానాహటాజీ ! మీ శుభాగమనమున కానందించు చున్నాను. మీకు సుస్వాగతము. మీరెల్లరు కుశలమా ? మీ పాదస్పర్శవలన నా గృహము పవిత్రమైనది. నా నోములు ఫలించినవి.

భోమానాహటా :— ఇది తమ యదృష్టముకాదు. తమ దర్శనమువలన నా పూర్వ పుణ్యములు ఫలించినవి.

భారమల్ :— ఇది సజ్జన లక్షణమే కదా ! తా మింత శ్రమించి యరుదెంచిన కారణము నానతీయ ప్రార్థన.

భోమానాహటా :— నా స్వార్థమే నన్నిటకు గొని వచ్చినది.

భారమల్ :- ఇందు తమ స్వార్థమేమి కలదు? నా అదృష్టదేవత మిమ్ము ప్రేరేపింప మీరు నాకు దర్శన మిచ్చి యుందురు.

మీ ముఖమను తామరపూవు నుండి వెడలు తేనెను నా మానసమను కోదమ తుమ్మెద గ్రోల నుత్సహించు చున్నది.

భోమానాహాటా :— ఆర్యా! ఆదేశముకాదు. నా మనవి నాల కింపుడు. ఒకానొక భాగ్యశాలి తమ కుమారుడుగా నుదయించినాడని విని నాకచరకాలమున జన్మింపనున్న కన్యను తమ కోడలిని గావించుకొనుట్కై మిమ్ము ప్రార్థింప నరుదెంచితిని. (పళ్లెరము వైపు జూపుచు) ఈ సదుద్దేశముతో నేను వంశ పరంపరగా నరుదెంచు చున్న ఈ దక్షిణావర్త శంఖదేవతను తమకు కానుకగా నర్పింప గొనివచ్చితిని. దీని మహిమ మీరెరుంగనిదికాదు. ఐనను సందర్భము కనుక నాలుగు మాటలు మనవి చేసెదను.

వస్తుపాలుని యందు పరమ ప్రసన్నుడై
వారాశి యిది యిచ్చి గారవించె
శంఖదేవత యాన సలిపి రత్నశ్రేష్ఠి
వస్తుపాలున కిచ్చి స్వస్తినొందె
తనప్రభుండగు వీరధవళేంద్రునకు వస్తు
పాలుండు శంఖదేవత నొసంగె
పదియు నెన్మిది కోట్ల బంగారు నాణెముల్
నాయింట వసియించి నా కొసంగె

అపజయంబులు ఖేదంబు లవలద్రోచి
కోరికల దీర్చునిది కల్ప కుజము వోలె
శంఖదేవత నర్చించు జనున కెపుడు
ధరణి యందేదియు నసాధ్యంబు గాదు. (1)

ఖారమల్ :— ధన్యుడను! నా యదృష్టము వలన మీ వంటి సజ్జన మైత్రి లభించినది. సజ్జనమైత్రి కల్గింపని శుభము లేమి యుండును? ఈ దక్షిణావర్త శంఖదేవత మీరు నుడివిన మహాప్రభావము కలిగినదనియే నేనును పెద్దల వలన విని యున్నాడను. మా పూర్వులలో నాయంతటి యదృష్టశాలి యెవ్వరును లేరనియే నా విశ్వాసము. మీ యౌదార్యము కొనియాడ శక్యము కాకున్నది. నా కుమారునకు తమవంటి మామగారు దొరకుట చేతనే వాని యోగ జాతకము స్పష్టపడుచున్నది.

భోమానాహాటా :— ఇది నా యుదారత గాదు. నా స్వార్థము మాత్రమే! మీ కుమారుని వంటి యోగపురుషు నల్లుని గావించు కొనుట కిది తగిన బహుమానము. కొండంత దేవుని కొండంత పత్రితో నర్చింప గలమా!

ఖారమల్ :— తమ కిదొక మహత్తర త్యాగము కానిచో నిట్టి మహత్తర భాగ్యము లభించుట నాకొక మహోత్తమ యోగదాయక మనుకొందును.

భోమానాహాటా :— మీ బోటి మహాత్ములు గోరంతలు గాని పరుల సద్గుణములను కొండంతలు కావించుట సహజమే కదా! ( కొంచెము నిదానించి ) నే నిప్పటికే తమ అమూల్య కాలమును వ్యర్థము కావించితిని. ఇంకను తమ కాలము వ్యర్థము కావించి తమ అమూల్య కార్య

క్రమము భగ్నపఱుపజాలను. నాకు పోయి వచ్చుటకు ననుమతి నీయ గోరుచున్నాను.

ఖారమల్ :— అప్పుడే వెడలి పోయెదరా ? నే నెట్లు లంగీకరింతును? అకారణ బంధువులగు మిమ్ము వదలుటకు నా హృదయ మంగీకరించుట లేదు. ఈ ఆహ్లాదకరమైన శుభ వాతావరణము నింతలో కనుమరుగు కావించుట నా యభిమతము కాదు.

భోమానాహటా :— వాత్సల్య పూర్ణులగు మీ కిట్లే తోచవచ్చును. కాని మీ కార్య క్రమముల భగ్నపఱచుట కంగీకరింపను. నిజమైన స్నేహము పరోక్షమందే రాణించును. మన హృదయములు నేటినుండి స్నేహసూత్రమున బంధింపబడినవి. మనస్సున కంతయు సమీపమేగాని దూరము లేదు. మన స్నేహము కలకాలము వర్థిల్ల వలయును.

రవిచంద్ర తారలకా దివిటీల గ్రహియించి
కాలమెందాక మార్గంబు జూపు
పారావతాదిక పక్షు లెందాకను
గగన మార్గంబున నెగురుచుండు
ఉదయ సాయంసంధ్య లొదవించి లోచన
పర్వ మెందాకను ప్రకృతి సలుపు
మాధవ, గ్రీష్మ, హేమంత, వర్షా, శరత్
శిశిరంబు లెందాక నెసగు భువిని
అంతదాకను విమల చిత్తాఢ్యులైన
సజ్జనులస్నేహ బంధంబు సడలబోదు
మైత్రి వర్థిల్లబోదు సమక్షమందు
వర్థిలు పరోక్షమందె భావమున నిలచి. (2)

కావున నో మహానుభావా! నా పయనమున కంగీక
రింపుము.

ఖారమల్ :— మహాశయా! స్నేహధర్మమును చక్కగా సెల
విచ్చితిరి. మీ యభిమత మెట్లో యట్లే కానిండు. ఇదే
తమను సాగనంపుటకు వచ్చుచున్నాను.

భోమానాహాటా :— తాము నా కొరకింత శ్రమ తీసుకొను
టనవసరము.

ఖారమల్ :— ఇందు శ్రమ యేమున్నది. అతిథివి, బంధుడవు,
ఆప్తుడ వగు మిమ్ము సాగనంపుటకు వెంట వచ్చుట నా
ధర్మము కదా! మీ మీదనే నా సర్వస్వ మాధారపడి
యున్నది. మన స్నేహము చిరకాలము వర్థిల్లుగాక!

( వి ష్క్ర మిం తు రు )

[తె ర ప్రా లు ను.]

## నా ల్గ వ దృ శ్య ము

స్థలము—చిత్తోడు దుర్గము— మంత్రాలోచనా గృహము

(మహారాణా ఉదయ సింహుడు, వారి మంత్రి.)

( తె ర యె త్తు దు రు )

ఉదయసింహుడు :— మహామంత్రీ! ఇప్పుడు రణదంభోరు దుర్గ
రక్షణ కవసరమగు చర్యలు తీసికొనుట ముఖ్యమై
యున్నది. కారణమేమన రాజ్యరక్షణకు దుర్గములే

ముఖ్యములు కదా ! ప్రస్తుతమా దుర్గము సరియైన స్థితిలో లేదు. దుర్గమును దృఢమొనరించి దక్షతతో పాలించు నేర్పరు లెవరాయని నే నాలోచించు చున్నాను. కాని నాకింతవరకు సమర్థుడగు వ్యక్తి తోచుట లేదు. మీ కెవరేని దకులు తోచిన సెలవిండు.

మంత్రి :— మహారాజా ! మీ యాలోచన లెస్సగ నున్నది మీ యాలోచనకు తగిన వాడీ చిత్తూరు దుర్గమున లేడు. ఆతడు భారమల్ కావడియాయను పీర పురుషుడు. అత డాల్వారు నివాసి ప్రభూ !

ఉదయసింహుడు :— దుర్గరక్షణ మన్న మాటలు కాదు సాహస పరాక్రమములు కలిగిన వీరాధి వీరుడు కావలయును. అతని కులగోత్రములు మీ కెరుగుదురా ?

మంత్రి :— ఏమియు తెలిసికొనకనే మీకీ విషయము విన్నవింతునా ప్రభూ ? ఆతని పేరు శాహా భారమల్. వైశ్యుడు. జైనమతస్థుడు.

ఉదయసింహుడు :— అమాత్య తిలకా ! ఏమీ ! మీ ఆలోచన నే డిట్లున్న దిదేమి ? ఆతడు జైనుడా ! అహింసా వాది యగు జైనుడు దుర్గరక్షక డా ! ఆతడు కోట బురుజుల మీద నుండి శత్రువులపై నెట్లు శర పరంపరల సారింప గలడు ? కోటవాకిట నిలచి సేనకు ముందుండి పగవారి గుండెల నెట్లు చీల్పగలడు ? అహింసా పరమో ధర్మః

యను నాతడు శత్రుల బారినుండి దుర్గము కాపాడ గలడా ?

మంత్రి :— మహాప్రభూ ! నేను మీరనుకొన్నంత తెలివి తక్కువ ఆలోచన చేయలేదు. మీకు జైనమతమే కాక యే మతము తుదిముట్ట నొంటికి బట్టనందున నిట్లు తలచుచున్నారు. ఆత్మరక్షణకు, దేశరక్షణకు కావించు హింస హింసగాదని సర్వమతములు, సకల శాస్త్రములు తెల్పుచున్నవి. జైనధర్మము సైత మావిషయమున భిన్నాభిప్రాయము తెల్పియుండ లేదు. హింసా ప్రధానమగు వైదిక మతమందే యజ్ఞములందు మేకలజంపు సోమయాజి సామాన్యకాలమందు చలి చీమనేనియు త్రొక్క సంశయించునని తెల్పియున్నది. కాన నాతని పరాక్రమమున కహింసా వాదము విఘ్నకారి గాదు.

ఉదయసింహుడు :— అట్లయిన భారమల్ జీ బల పరాక్రమము లుగ్గడింపుడు. తలచి చూడక రాజు క్రొత్తవారిని దరి జేర్చరాదను రాజనీతి మీరెరుగనిది కాదు గదా !

మంత్రి :— చిత్తము మహాప్రభూ ! ఇదం బ్రాహ్మ్య మిదం క్షాత్ర మన్నట్లు భారమల్ జీ శస్త్ర శాస్త్రములందు సమాన ప్రజ్ఞల నలవఱచుకొన్నాడు. ఆతడు బుద్ధియందు బృహస్పతి. పరాక్రమ మందు పరశురాముడు. ఆతడే ఈ క్లిష్ట పరిస్థితిలో రణథంభోరు దుర్గమును రక్షింప సమర్థుడని త్రికరణశుద్ధిగా మనవి చేయుచున్నాను.

ఉదయసింహుడు :— మహామంత్రీ ! మీ నిర్ణయము కాదన జాలను కాని స్వజాతీయుడగు రాజపుత్రుడు విజాతీయు డగు నితని కంటె విశ్వాసపాత్రుడని నా విశ్వాసము. రాజపుత్రున కున్నంత సాహస పరాక్రమ విశ్వాసము లితరుల కుండునా ?

మంత్రి :— మహారాజా ! మీరు కేవలము కులప్రసక్తితో మాటాడిన నేనేమి చెప్పగలను ? కాని ఒక చిన్న యుదాహరణము చెల్పుదును. వనవీరుని కోపాగ్ని కెరగాకుండ మీకై యాత్మతనయుని బలిగావించిన పన్నా రాజపుత్ర కాంతయేనా ? ఇక రాజపుత్రుల విశ్వాసమా! మీ రెరుగని దేమున్నది ! పసికందుగానున్న మిమ్ము పన్నా గొనిపోయి యాశ్రయింప నీ రసపుత్రులే వనవీరునకు వెఱచి క్షాత్రధర్మమును మంట గలిపి మానవ సహజమగు కారుణ్యమును గుండె నులిమి నిర్దయతో వెడల నడచిరి కదా ! ప్రభూ ! జైన వైశ్యుడగు ఆశాశాహ యాతని పీకమాత తమ అంకమందు మిమ్ముంచుకొని కాపాడి మరల మీ రాజ్యమును మీ కర్పింప సర్వస్వమును త్యాగ మొనరించిరికదా ! వారు అన్ని సంవత్సరములు మిమ్ము గూఢముగ కాపాడి సైన్యము కూర్చి వనవీరునిపై దండెత్తి రాజ్యముగెల్చి మిమ్ము రాణాను గావింపలేదా ? ఆ తల్లిచేతి చలువయే నేడు మిమ్ము మహారాణాను గావించినది. మిమ్మి సింహా పీఠమున మహారాణాగా చూడగల్గు సదృష్టము మాకా తల్లి వలన లభించినది !

ఉదయసింహుడు :— మహామంత్రీ ! నా యజ్ఞానమును లెస్సగ బోగొట్టితిరి. నామేన నూపిరుండు వరకు వీరమాత పన్నాను, ఆశాశావోను వాగి మాతృ దేవతను మరువ గలనా ?

కన్న కొడుకును బలియిచ్చి నన్నుగాచి
యున్న పన్నాను, ప్రాణము కన్నమిన్న
గాగ నన్ను కాపాడి త్యాగంబొనర్చు
నాశశాహకు, తన్మాత కంజలింతు. (1)

వీరు నాకొఱకు సర్వస్వమును వ్యయించి ప్రాణములపై నాశవదలి తమ సాహసమును, కార్యచతురతను జోడించి శ్రమింప దైవమనుకూలమై విజయము చేకూర్చి నది. వీరి మహత్తర త్యాగము నాకు జైన వైశ్య వంశముపై విశ్వాసమును పెంపొందించు చున్నది.

మంత్రి :— మహారాణా ! ఈ కారణము వలననే భారమల్ జీ కార్యదీక్షయందు నాకు విశ్వాసము కలిగినది. తమరు అనుమతించుచో దూతమూలమున నేడే వారి నిచ్చట కాహ్వానింతును.

ఉదయసింహుడు :— అవశ్య మాహ్వానింపుడు. వారిని రణ దంభోరు దుర్గాధికారిగా నియమింపుడు.

(నిష్క్రమింతురు)

[తెర వ్రాలును.]

## ( ఐ ద వ దృ శ్య ము )

స్థలము — అలవరులో భారమల్ భవన ద్వారము.

సమయము — ప్రాతఃకాలము.

( ఆరేండ్ల భామాశా ధనుర్బాణముల గైకొని లోననుండి యీవలకు వచ్చి యెదుట వ్రేలుచున్న చిన్న బంతిని గురిచూచి బాణమును వదలగా శరము తగిలి బంతి క్రింద బడును. ఆ సమయమందే చిత్తోడు నుండి రాజదూత ప్రవేశించును.)

( తెర యెత్తుదురు. )

రాజదూత :— కుమారా ! నీ యస్త్రవిద్యాభ్యాసము చక్కగ నున్నది. నీ కెవరో ధనుర్విద్యా ప్రవీణులు చక్కని శిక్షణ నిచ్చు చున్నట్లున్నది.

భామాశాహ :— లేదు. నాకు మాతండ్రిగారు విలువిద్య నేర్పు చున్నారు. వారి శిక్షణ వలననే నాకీ మాత్రము విద్య లభించినది.

రాజదూత :— తమ తండ్రి శుభ నామధేయము తెలిపెదరా ?

భామాశాహ :— వారి విషయము మీకు చెప్పుటకు ముందుగనే మీ విషయము తెలిసి కొనుటకు నామన ముచ్చిళ్లూరు చున్నది.

రాజదూత :— చతుర బాలకా ! మీ వాక్చాతుర్యము సామాన్య మైనది కాదు. నా విషయము తెరిగి నీ వేమి చేయ గలవు ? నేను విదేశ యాత్రికుడను. ఒకానొక యవసర మైన పనిమీద నిచ్చటకు వచ్చితిని.

ఖామాశాహ :— మీ కార్యమేమో నాకు దెల్పగలరా ? ఐనచో తమకు నా సహాయము కొంత అవసరమగును.

రాజదూత :— మీరు సాయము జేయ దలచినచో తమ కళక్య మైన దేమున్నది.

ఖామాశాహ :— తమరు మీ విషయ మానతిండు. నాకు చేత నైన సాయము చేయుటకు సంసిద్ధుడను.

రాజదూత :— అటులైన నాకు శాహ ఖారమల్ జీ గృహమున కేగు మార్గమును జూపింపుము.

ఖామాశాహ :— మీ ధోరణి వలన వారితోనే మీకు పని యున్నట్లు తోచుచున్నది.

రాజదూత :— కుమారా! నీయూహ సరిగా నున్నది. నేను వారిని కలసికొన గోరు చున్నాను.

ఖామాశాహ :— తమ అభిలాష శీఘ్రముగనే నెఱవేర గలదు. ఇపుడు మీరు వారి గృహ ద్వారము ముంగదే నిలచి యున్నారు. (వినుట నభినయించి) అటుచూడుడు! వారే మీరు కోరినవారు. వారే మా తండ్రిగారు. వారి పుడే దేవాలయమున కేగి పూజ ముగించుకొని వచ్చు చున్నారు.

( ఖారమల్ శాహ ప్రవేశించును. )

ఖామాశాహ :— (ఖారమల్ జీని జూచుచు) తండ్రీ! మిమ్ము కలసికొనగోరి వీరు పొరుగూరి నుండి వచ్చి యున్నారు.

రాజదూత :— శాహ ఖారమల్ గారూ నమస్కారములు!

ఖారమల్ :- ఆర్యా! నమస్కారములు. నాయనా! ఖామా! ఇక్కడకు రెండు ఆసనములు తెప్పింపుము.

ఖామాశాహ :- చిత్తము తండ్రీ.

(లోనికిపోయి సేవకునిచే నాసనములు తెప్పించి వేయించును.)

ఖారమల్ :- ఆర్యా! కూర్చుండుడు. తామెచ్చటినుండి యరుదెంచు చున్నారో సెలవిండు.

రాజదూత :- మహోదయా! నే నిప్పుడు చిత్తూరు దుర్గము నుండి వచ్చుచున్నాను. మహారాణా ఉదయ సింహుడు తమను బిలచుకొని రమ్మని నన్నిచ్చటకు పంపియున్నారు. తమ కభ్యంతరము లేనిచో నేను తమవద్ద కరుదెంచిన రాజకార్యమును విన్నవింప గలను.

ఖారమల్ :- ఆర్యా! నిస్సంకోచముగ వచింపుడు. ఇక్కడ ననుమానింప దగిన వారెవ్వరును లేరు.

రాజదూత :- చిత్తోడు రాజ్య వైభవము సంతతము శత్రువులకు కన్ను గుట్టుట తమకు దెలియని విషయము గాదు. మున్ముందు శత్రువులు చిత్తూరు నాక్రమింప ప్రయత్నములు కావించు చున్నట్లు తెలియవచ్చు చున్నందున, రాణావారు తగు రక్షణ ప్రయత్నములు కావించు చున్నారు. రాజపుత్రస్థానమందలి సామంతరాజు లందఱకు వర్తమానములు పంపు చున్నారు. దుర్గము లన్నిటిని బాగు పఱచి శక్తివంతములను కావించి, దుర్గ రక్షణ మందప్రమత్తులై యుండుటకు సామంతులకు

రాణావారు తాఖీదులను పంపుచు ప్రస్తుతము రణవం భోరు దుర్గమునకు తగిన రక్షకులు లభింప నందున తమరి నా దుర్గాధికారిగ నియమించుటకు రాజధాని కాహ్వా నించు చున్నారు.

ఖారమల్ :- మిత్రమా! మహారాణావారి యౌదార్యమున కెంతయు కృతజ్ఞుడను. కాని యీ నగరము నందలి నా ప్రియ బంధు మిత్రుల వీడి యితర ప్రదేశముల కేగు టకు నా హృదయ మంగీకరించుట లేదు.

రాజదూత :- మహాభాగా! యీ వ్యామోహము స్వాభావి కము. చిరకాల స్నేహ బలమిట్టి బలవత్తర ప్రేమను కలిగించుట నిజమే కాని కర్తవ్య పరాయణులు, దేశో ద్ధారకు లగు తమబోటి మహనీయులు కార్యశీలురై మోహజాలమున మునుగక కర్తవ్యమును నిర్వహింప బూనుకొందురు.

ఖారమల్ :- ఆర్యా! మీ వచనములు నన్ను కర్తవ్య పరాయ ణుని గావించినవి.

ప్రియ బంధు మిత్ర జనముల
పయి స్నేహము కన్న సుగుణవంతుడు దేశ
ప్రియ మాతృ పాద సేవా
క్రియ ముఖ్యంబనుచు తలచు కేవల మెడదన్.(!)

అందునను మేవాడ రాణాగారి యాజ్ఞ మీరుట నావలన కానిపని. నేను త్వరలో కుటుంబ పరివారముతో

పక్షము రోజులలో రాజధాని కరుదెంచి యటనుండి రణదంభోరు రాగలను.

రాజదూత :— నేను వచ్చిన కార్యము సాఫల్యము కావించితిరి. నేను వెళ్లి రాజధానిలో తమకు వసతులు కల్పించుటకు, రణదంభోరున మీకు వసతులు కల్గించు ప్రయత్నములు గావింతును. సెలవు.

( వి ష్క్ర మి ం చు ను )

[తె ర ప్రా లు ను.]



# ఖా మా శా

## ( ద్వితీయాంకము — మొదటి దృశ్యము )

స్థలము—అలవరునందలి భోమానాహటా

గృహప్రాంగణము. సమయము—సంధ్యాకాలము.

(ఒక ప్రక్క అలంకృతయగు అలకాసుందరి వీణనుగైకొని అశోక వృక్షము క్రింద కూర్చుండి వీణతంత్రుల మీటుచు పాడుచుండును.)

( తెర యెత్తుదురు )

పాట — అనుబంధము 2.

(భోమానాహటా ప్రవేశించుట చూచి అలకాసుందరి గానము నాపి లేచి యెదురేగును.)

భోమానాహటా :— ప్రాణేశ్వరీ! నేను వచ్చుట చూచి నీవు పాడుట విరమించితివేమి? నీ గానామృతమును గ్రోలు భాగ్యము నాకులేదా?

అలకాసుందరి :— నాథా! తమకుగాక మరెవరికున్నది? తమ మనస్సును రంజింప జేయగలుగునంతటి సంగీత విద్యా కౌశల్యము నాకులేదు. కాలక్షేపమునకు మాత్రమే వీణాగాన మొనరించు కొనుచుంటిని.

భోమానాహటా :— (కొంచెము కుతూహలముతో) నీ వీణా గానము నీకు నైసర్గికాభ్యాసము కదా! కాలక్షేపమున కనుచుంటివి. మీ కన్నతల్లి మనోరమ యింటలేదా!

అలకాసుందరి :— లేదు. తన చెలికత్తెలతో ఊయలలూగుటకు మన పూలతోటకేగినది. వచ్చువేళయు దాటినది. ఇప్పటికి వచ్చుచునే యుండును. (ప్రక్కకుచూచి) ఇదుగో ! అనుకొను చుండగనే అమ్మాయి వచ్చినది.

( మ నో ర మ ప్ర వే శి ం చు ను )

భోమానాహటా :— అమ్మాయీ ! నీవెక్కడ నుండి వచ్చుచున్నావు ? ఇంతజాగైన దేమి ?

మనోరమ :- తండ్రీ ! బృందావనమున పూల తూగుటుయ్యాల లూగుచు ప్రొద్దుపోయిన విషయము సైతము గమనింప జాలకపోతిని.

భోమానాహటా :— తల్లీ! నేటి డోలికోత్సవమంత మనోరంజకముగనున్నదా?

మనోరమ :- తండ్రీ ! నిస్సందేహముగ మనోరంజకముగ నున్నది.

పూలతీగల తూగుటుయ్యాలలందు
పంతములుపట్టి యూగంగ పాదసమితి
మిన్నుకేగ నప్సరసలమీద కయ్యె
మునకు కాల్సాచులాగున తనరినాము. (1)

ఇంకను నెన్నోవిధముల పూలతోటలో నాటలాడి కాలయాపనము కావించి యానంద మనుభవించితిమి.

భోమానాహటా :- అవగతమైనది తల్లీ ! అందుకే నీవింత బడలియున్నావు. లోనికేగి దుస్తులు మార్చుకొని విశ్రమింపుము. మేమిచ్చట కొంచెము సమయము కూర్చుందుము.

మనోరమ :- చిత్తము తండ్రీ !

(అని విశ్రమించును)

అలకాసుందరి :- నాథా ! ఇప్పుడు మనోరమ వివాహయోగ్య వయస్కురాలైనది. ఆమె తనూలావణ్యము వికసించినది. ఇక వివాహము కావించు టుచితము.

భోమానాహటా :- ప్రాణేశ్వరీ ! నీయాలోచనము తగియున్నది. ఇట్టివిషయములందు గృహస్థుల కిల్లాండ్రు మంత్రులవలె నుపయోగింతురుకదా ! ఐనను మనతల్లికి వరుని వెదుకవలసిన శ్రమపడపనిలేదు. అమ్మాయి పుట్టుకకుముందే వరుడు నిర్ణయింపబడియున్నాడుకదా ! కనుక ఇప్పుడు తొందరపడవలసిన యావశ్యకత యేమున్నది?

అలకాసుందరి :- అందుకనియే నేను తొందర చేయుచున్నాను. కన్యాదానము పదునాలుగేండ్లకు ముందుగనే జరిగినది. దానమిచ్చిన సొమ్మును మనయింట నెక్కువకాలముంచుకొనుట తగదు.

దాన మిచ్చినదానిని తన సమీప
మందునుంచుకొని గృహస్థు డారటపడు
నిల్లడంబుంచుకొను దానినెప్పుడు యజ
మానికడజేర్ప తహతహ బూనునటుల. (2)

భోమానాహటా :- ప్రాణేశ్వరీ ! నీవు చెప్పినకారణము యుక్తియుక్తముగ నున్నది. అట్లయినచో రేపటివేళయందే లగ్నపత్రిక లిఖించుటకు కులగురువుల నాహ్వానించి సుముహూర్తము నిశ్చయింపజేసెదను.

అలకాసుందరి :- త్వరలో ముహూర్త మేర్పాటు కావింప జేయుడు. శుభముహూర్తము లీయేడు చాలకొద్దిగ నున్నవట! మరల నేడాదివరకు సుముహూర్తములు లేవనుచున్నారు. కాన మీరు జాగుసేయక తొందరపడుట మంచిది.

భోమానాహటా :- అబ్బా! పదేపదే చెప్పినదే చెప్పి విసివించెద వేమి? అమ్మాయి పెండ్లివిషయమై యాతురతయంతయు నాకులేనట్లు నీకున్నట్లు నటించెదవేమే వగలాడీ! యీయేడు తప్పక అమ్మాయి వివాహము కావించెదనని నీ సోగకన్నులమీద ప్రమాణముచేసి చెప్పుచున్నాను. కాదన్నచో నీ కపోలముల చుంబించి పలుకుమందువా!

అలకాసుందరి :- చాలు చాలు; మీ సరసాలు! పెండ్లి కెదిగిన కన్నె తండ్రులయ్యు మీరు పదారేండ్ల పెండ్లికొడుకులగు చున్నారే? ఓహో! మీ యీ యుల్లాసమునకు కారణ మిప్పుడు తెలిసికొంటిని. సరే! నేడు క్రొత్త సంవత్సరపు తొలిదినముగదా! మీకీసంవత్సరము కన్యాదాన ఫలము ప్రాప్తింపజేయ భగవంతుని ప్రార్థించుచున్నాను.

భోమానాహటా :- (మధ్యలోనే మాటనందుకొని) చిత్తను చిత్తము. సమయమునకు తాము తమ నూతన వత్సర బహుమానము విషయము ధ్వనింపజేయుచున్నారే! నేను తమ విషయము మఱచిపోలేదు. ఆ విషయము తెల్పుటకే నేను వచ్చితిని. నీవు అమ్మాయి పెండ్లి విష

యము ప్రస్తావించినందున నేను వచ్చినపని మఱచితిని. నీకీ యుగాదికి అమూల్యమగు వీణారాజమును కానుకగా సమర్పించుకొనుచున్నాను. లోనికి రమ్ము చూపింతును.

అలకాసుందరి :- మీ అవ్యాజానురాగమున కభినందనములు తెలసితిరి. స్నానముచేసి భోజనముచేయుదురుగానిరండు.

(ఇరువురు నిష్క్రమింతురు)

[తెర వ్రాలును]

## [ రెండవ దృశ్యము ]

స్థలము— చిత్తోడుదుర్గమందలి ఒకయుద్యానవనము

సమయము— మదనత్రయోదశినాటి సంధ్యాసమయము

(ఉద్యానవనమందలి మన్మథుని మందిరము. మందిరమునకెడమ ప్రక్కన చామంతి పూదండ శిరోగ్రభాగమున ధరించి వీరా మన్మథ విగ్రహము నెదుట మోకరించి కరములు ముకుళించియుండ తెర యెత్తుదురు.)

వీరా :- మదనా! సౌందర్యసదనా! నీప్రభావ మేమని సన్నుతింపగలను ?

సగమాడుదయ్యెను మగువను నెత్తిపై
నెక్కించుకొనెను మహేశ్వరుండు
మురవైరి సుదతిని నురమందు ధరియించె
తన నాల్క సతి దాచుకొనెను బ్రహ్మ

ఇంద్రు డంగనగోరి యేహ్యాంబు నొందెను
శాణలిఖితుడాయె చానకు రవి
చందురుండు కళంక మొందెను కాంతకై
మును లచ్చరల దాసజనములైరి
ఒకటి రెండు జేయుచుండు ధానుష్కులు
జగమునందు గలరు మగలమగడ
రెంటి నొకటిజేయు దంటవిలాకాడవు
కరుణబ్రోవు మయ్యా! కామదేవ! (1)

నేటి పర్వదినమున సర్వులు తమతమ ప్రార్థనలతో నీ దయగల చూపులుకోరి కాచుకొనియున్నారు. ఈ నీ చరణదాసి పరమ ప్రార్థనమును సైతము నెరవేర్ప గోరుచున్నాను. నీపాదము లాశ్రయించిన నా కోరిక దీర్పుము. సూనశరా! నా మానసిక వాంఛితము నిదే స్పష్టపఱచుచుంటిని — (నాలుగువైపుల సందేహాముతోజూచుచు) పంచబాణా! చిత్తోద్భవ మహాప్రాణా ఉదయసింహుడు తన సంపూర్ణానురాగమును నా కర్పించి నాకోరికలెట్టివైనను వినుటయే తడవుగ మన్నించి జీవితాంతము వరకు నాతోగలసి మెలసి యుండునట్లు కావింప గోరుచున్నాను.

(లతాగృహమునుండి యాకస్మికముగ నుదయసింహుడు ప్రవేశించును)

ఉదయసింహుడు :— ప్రాణేశ్వరీ! నీయంగీకారముగోరి తపము కావించుచున్న ఈదాసునికై నీవింతగా ప్రార్థనలు కావించు బేలవైతివేల?

(వీరా మౌనము బూనును)

ఉదయసింహుడు :— ప్రేయసీ ! లోకమునకు నేను చిత్తోడు రాణానయ్యు నీకు దాసానదాసుడను! నన్ననుమానింప కుము. నాప్రేమ సర్వస్వము నీపదసన్నిధినుండి నీప్రేమ భిక్ష నర్థించుచున్నాను.

వీరా :— (సందేహముతో)మిమ్ము నమ్ముటెట్లు? నన్నుబ్బించుటకు మీరీ కపటప్రేమ నభినయించుచున్నారు. వాస్తవముగ మీరు నన్ను ప్రేమించుచున్నచో మీ దర్శన భాగ్యమే నాకు కఱవు గావింతురా?

ఉదయసింహుడు :— హృదయేశ్వరి! నీయీ యారోపణము నిరాధారమైనది సుమీ! నీ సౌందర్యము నాకన్నులకు కట్టినట్లుండుటవలననే నేను నిన్ను వెదకుకొనుచు నిక్కడకు వచ్చితిని. నీకంటె ముందుగ నీదర్శనముకోరి యిటకు వచ్చి లతాగృహమున పొంచియుండి, నీవు మదనదేవుని యెదుట కావించుచున్న ప్రార్థనమును విని ధన్యుడనైతిని.

వీరా :— తమరు మాటిమాటికిట్లు బొంకెదరేల? మీరిచ్చటకు వచ్చుట నాకొరకు కాదు. రాజ్యకార్యములవలన విసివిన మీమనస్సు నానందపరచుకొనుట కుద్యానవనమునకు విహారార్థముగ నరుదెంచియున్నారు. మీకు నిజముగ నేను జ్ఞప్తిలోనైన నున్నచో నన్నిట్లు విరహవార్థిలో ముంచి పంచబాణచండాలుని కప్పగించి జాలి మాలి

చూచుచుందురా? మీరు మీ మంత్రాలోచనలుతప్ప మీకు నాబోటి యభాగ్యురాలు జ్ఞప్తియుండునా? వలపును నోరార వెల్లడించుకొననీని ఈ యాడుపుట్టువుకన్న నడవిలో మ్రానుగపుట్టుటయే మంచిదనిపించుచున్నది.(గద్గదికతతో) నేను నాప్రేమ సర్వస్వము తమకప్పగించుచున్నాను. నన్ను పాలముంచినను నీటముంచినను మీదే భారము! (అని రాణా పాదముల చెంతపడబోవ ఉదయసింహు డాతురతతో కౌగిటబట్టి పై చెరగుతో విసురు చుండును.)

ఉదయసింహుడు :— ప్రేయసీ! ధన్యుడను! ఏమీ ఇంకను నీవు పారవశ్య మభినయించు చున్నావా? రమ్ము! ఈ శిలా వేదికపై గూర్చుందము. (పోయి శిలావేదికపై నిరువు రాసీనులగుదురు.) ప్రాణేశ్వరీ! నేను మంత్రాలోచన లలో తలచు పాల్గొను చుండుట నిజమే కాని - ఆ మాత్రమున నిన్ను మఱచిపోతినని కలనేని తలంప బోకుము. ఐనను-నేటి రాజకీయ పరిస్థితులు చిత్తూరు దుర్గమునకు ప్రతికూలముగ నున్నవి.

యవన ధరాతలేంద్రుడగు నక్బరు చిత్తురుకోట కొమ్ముపై
యవనుల రాజ్య చిహ్నమగు నర్ధశశాంకుని కేతనంబునుꣳ
బవరమొనర్చి, తా నెగురవైవగ నుత్సుకుడాయె; వాని మా
నవు లెదిరింప జాలరను నమ్మికగల్గెను నామనస్సునన్. (2)

ఐనను మంత్రి సామంతాదుల బలవంతముపై నామ మాత్రముగ మంత్రాలోచన సభలకు పోవుట తప్పని

సరి యగుచున్నది. ఎపుడో యక్బరు దండెత్తునని రక్షణ వ్యవస్థను సంఘటితపరుప బూనుట నా బాధ్యత యని నన్ను వేపుకొని తినుచున్నారు.

వీరా :— తామనవసరముగ లేనిపోని శంకలు తెచ్చి పెట్టుకొను వారిచే భయపెట్ట బడుచున్నారు. ఎపుడో ఏదో మునిగి పోవునని చేతిలోని సౌఖ్యము లనుభవింప కుండుట తమ వంటి వివేకుల లక్షణము కాదు. మహారాణా యయ్యును మీ రీ నిరంతర వ్యాకులము నొందుట సిగ్గుచేటు. మీరు రాజ్యభారమును మంత్రి సామంతులపై నుంచి యౌవన భోగములు నాతో కలసి మెలసి యనుభవించి 'యానందో బ్రహ్మ' యన్న వేదసూక్తిని సార్ధకపరుపుడు. నా సౌందర్య విలాసములతో, గాన నృత్యములతో మిమ్మానంద స్వర్గధామమున నమరేంద్రుని కావించెదను.

ఉదయసింహుడు :— ప్రియా ! నాకు కనువిప్పు కలిగించితివి. ఇది మొదలు మంత్రాలోచనల సభలకు పోవుట మాను కొని, నీతో రతి మన్మథుల ప్రణయకలహ మంత్రాలోచనలు కావింతును. నీ కనుదోయి కంజలించుచు నీ ప్రేమామృతమానుచు కాలము గడుపుదును. ఇక మన భోగ విలాసముల కంతరాయము కలుగనీయను.

వీరా :— తమ యీ నిర్ణయమునకు నే నేకీభవించుచున్నాను. మిమ్ము ఏ ఆపదలు చుట్టుముట్టనీక నా ప్రాణము లడ్డు

వైచి మిమ్ము కాపాడుకొందును. మీ పై నులుము ప్రమాద మేఘములను పవన రూపిణినై నిర్మూలింతును. నా కంటి కాటుక, వలపు కస్తురిబొట్టు తోడుగ బాస జేయుచున్నాను.

ఉదయసింహుడు :— వీరురాలా ! జోహార్లు ! నీ కోమల హృదయ మందూరు వీరభావమును చూచి విస్మయ చకితుడనగుచున్నాను. ఆజన్మాంతము మన మదన కేళికల కెట్టి విఘ్నము రానీయను ! ఆ మదన భగవానుని పాదసాక్షిగ, నీ యధరామృతమాని బాసచేసెదను (అని అధరమానబోవ, వీరా ముఖము ప్రక్కకు త్రిప్పి తప్పించుకొనును.)

వీరా :— ప్రాణేశ్వరా ! ఇంత తమకమేల? నేను మీచేతిలోని దానను గానా ! ఈ మదన త్రయోదశి సాక్షిగ నసం గుని వర ప్రసాదము మనకు లభించునుగాక ! అదుగో ! అప్పుడే సూర్యాస్తమయమైనది. శకుంత సంతానములు గూండ్లకరుగుచున్నవి. సూర్యుడు వారుణీదిశాంగనా పరిగ్రహణార్థము రక్తుడై యేగుచున్నాడు. మనము కూడ రాజప్రాసాద శయనాగారమున కరిగి హంస తూలికాశయ్యపై నానందడోలికల నుయ్యాలలూగి ఈ మదనత్రయోదశిని సార్థక పరతుముగాక ! రండు !

(ఒకరొకరు భుజములపై చేతులువైచుకొని నిష్క్రమింతురు)

[ తెర వ్రాలును. ]

## ( మూ డ వ  దృ శ్య ము )

స్థలము - రణదంభోరునందలి భారమల్ శాహా భవనము.

సమయము - మధ్యాహ్నము.

(రాటముమీద నూలువడకుచున్న మోహినీదేవి సమీపమందలి పదునారేండ్ల తారాచందుతో మాటలాడు చుండగ తెరయెత్తుదురు.)

తారాచందు :— అమ్మా! నీవిక్కడ కూర్చుండి నూలువడకు చున్నావా? నాన్నగారు నీ కొరకెంత సేపటినుండియో నిరీక్షించు చున్నారు.

మోహినీదేవి :— మీనాన్నగారికి నాతోనంత అవసరమగుపని యేమి కలిగినది?

తారాచందు :— ఆ విషయము నాకు సరిగా తెలియదు. కాని వారి చేతిలో నేదోయొక లేఖయున్నది! వారు చేతిలో లేఖపట్టుకొని నీవెక్కడున్నావోయని విచారించుచు వెదకుచున్నారు?

మోహినీదేవి :— (స్వగతముగ) ఆఁ తెలిసినది! భామాశా వివాహ విషయమై నాతో సంప్రదించుటకు యోచించు చున్నారేమో? (ప్రకాశముగ) నాయనా! మీ నాన్నగా రెక్కడున్నారో చూడుము? నే నిప్పుడే దారము సర్ది వచ్చుచున్నాను.

తారాచందు :— (గది గుమ్మమువరకు వెళ్లి) అమ్మా! నాన్న గారీదిక్కునకే వచ్చుచున్నారు.

(భారమల్ ప్రవేశించును.)

భారమల్ :— మోహినీ! నీవేమిచేయు చున్నావు? నిన్ను వలవేసి పట్టునప్పటికే పండ్లు పూండ్లు గడచునట్లున్న వే! ఇంకను నీవు నిద్రపోవు చున్నావేమోయని యను కున్నాను. కాని నీవీ విశ్రాంతి సమయమును సైత మూరక పోనీయకున్నావే? ఈ రాటము చూచినచో నీకు నిద్రాహారములు పని లేనట్లున్న దే?

మోహినీదేవి :— మీకు రాజకార్యము లున్నచో గాలి పీల్చుట కైన మనస్సు వచ్చునా? సరి— ఇక మీరు చెప్పదలచిన దేదో చెప్పుడు. ఈలేఖ ఎక్కడనుండి వచ్చినది? బంధు మిత్రు లెల్లరు క్షేమమేనా?

భారమల్ :— ఏమున్నది? వియ్యంకులు వివాహముహూర్తము నిర్ణయించి పంపినారు. ఇదుగో ఈలేఖ చదువుకొని నీయభిప్రాయము తెలియ జేయుము. (అని లేఖ నందించును)

మోహినీదేవి :— (లేఖ చదువుకొని) ఇంకేమి! 'శుభస్యశీఘ్రమ్' ఇందు నాసమ్మతి నడుగవలసిన యవసరమేల మీకుతోచి నది? మన యంగీకారమును నేడే కన్యాదాతలకు వర్త మానమంపుడు!

భారమల్ :— నా అభిప్రాయము సైతము అదియే! కాని - మహారాణా ఉదయసింహుడు విలాసిని వీరాతో విలాస

జీవనమున కలవడి దానికి దాసానుదాసుడై రాజ్య కార్యము లందుదాసీనత చూపుచున్నాడు! ఇట్టి క్లిష్ట పరిస్థితులలో మొగలు సైన్యము చిత్తూరుకోట నెప్పుడైన నాక్రమించ వచ్చును. శాంతివాతావరణమున కావింప వలసిన వివాహా మీ సంకట పరిస్థితులలో కావించుట నాకు మనస్కరించుటలేదు. ఐనను ప్రస్తుతము యుద్ధములు లేవు కాన నీపెండ్లి యిప్పుడే ముగించుట శ్రేయస్కరమని తలచుచున్నాను. పైగా- భామాశాహా యుక్తవయస్కుడైనాడు. ఆతనితో నీవిషయమున సంప్రదించుట యుచితమనిపించుచున్నది.

మోహినీదేవి :— తమ రాజకీయ వాతావరణములు పెండ్లి పేరంటములకును అడ్డమగుచున్నవే? పైగా చిరకాలముగ నీసంసారమును దిద్దుకొని వచ్చుచున్న నాకు ప్రస్తుతము విశ్రాంతి ముఖ్యమనిపించుచున్నది. అందువలన భామా వివాహమై కోడలింటికి వచ్చినచో నాబాధ్యత కొంత తగ్గగలదు! ఐనను- దక్షిణావర్త శంఖము స్వీకరించు నప్పుడు తోచని భామా సంప్రదింపు మీకు ప్రస్తుతము గుర్తువచ్చుట న్యాయమేకదా!

భారమల్ :— (జ్ఞప్తినభినయించి) ఈ వ్యంగ్య సంభాషణ నీకు ఆజన్మ సిద్ధమేకదా! భోమానాహాటా గారికి సుముహూర్తమునకు తరలివచ్చుచున్నామని నేడే లేఖ వ్రాసెదను.

మోహినీదేవి :— కావలసిన సామగ్రులు సన్నాహ పరచుడు ! ముహూర్తము మిక్కిలి సమీపములోనున్నది. ఏది మరచి పోయినను అనవసరముగ నిష్ఠురములు పడవలసి వచ్చును.

భారమల్ :— దేవీ ! నీవీవిషయమున సందేహము మానుము ! ఐశ్వర్యమునకు సాధ్యము కానిదేమున్నది ? వివాహ మునకు చక్కని ప్రయత్నములు కావింతము ! సరిసరి— నేను శస్త్రాగారమున కొకమారు పోయివచ్చెదను.

( అని నిష్క్రమించును. తెరవ్రాలును )

## ( నా ల్గ వ దృ శ్య ము )

స్థలము — చిత్తోడునందలి రాజభవనము

(విలాసిని మీరా అలంకరించిన శయ్యపై ఏకాంతముగ కూర్చుండి యుండగ తెరయెత్తుదురు.)

మీరా :— (స్వగతముగ) నేను, నారూపసంపద, నా గాన మాధు ర్యము ధన్యములు ! మహారాణా ! నాకు దాసుడై పోయినాడు ! నా యాకర్షణ మెంత తప్పించుకొన రానిదో నాకిప్పుడు తెలియ వచ్చుచున్నది !

ప్రజల హితమ్ముకన్న, తన రాజ్యము కన్నను, నన్ను మిన్నగా
నిజముగ తా, తలంచుచును నిత్యవినీతులు, పౌర ఖేదముల్
ఋజుమతులౌ నమాత్యు లొనరించుచునున్న హితోపదేశముల్
గజిబిజిగాగనెంచి తమకమ్మున నాసముఖమ్ము జేరెడిన్. (1)

ఏమీ! రాణావారు నా యుదాసీనత క్షణమేని యోర్వలేక తల్లడిల్లిపోదురు! నా మెప్పుకోరి సర్వస్వము పరిత్యజింప సిద్ధపడుచున్నారు. నేడేమీ! ఇంత ప్రొద్దు పోయినను రాకున్నారే (ద్వారము వరకుపోయి) ఏదే నవసరకార్యము తటస్థించినదేమో (కొంచెమాగి) ఏదో పదధ్వని యగుచున్నది! బహుశః — వారేయై యుందురేమో ?

( ఉదయసింహుడు ప్రవేశించును )

వీరా :— (ఎదురేగి) సుస్వాగతము ప్రాణవల్లభా! నేడింత యాలస్యమైనదేమి? నేనెంత కాలమునుండి కన్నులు కాయలు కాచునట్లు వేచియున్నానో! ఎఱుగుదురా?

ఉదయసింహుడు :— ప్రాణేశ్వరీ! నేటి యాలస్యమునకు విచార పడుచు నికముందెన్నడేనియు నిట్టి యపరాధము కావింపనని నీకందోయి సాక్షిగ ప్రమాణము చేయు చున్నాను.

వీరా :— ఇంతకు మీయాలస్యమునకు హేతువు చెప్పరైతిరికదా!

ఉదయసింహుడు :— ఏమున్నది? పాత పాటే! మంత్రి సామం తాదులు అవసర సమావేశమునకు నన్ను కాళ్లు గడ్డము పట్టుకొని బ్రతిమలాడి కొని పోయినారు. నీ యెడ విరక్తి వహించి రాజ్య కార్యములందు లీనము కమ్మనిరి. కాని, వారికి తగినట్లు బుద్ధి జెప్పితిని.

వీరా :— ఏమన్నారు ? నన్నే వదలి వేయుమనిరా ? రౌతు మెత్తనైన గుఱ్ఱము మూడుకాళ్లతో నడువదా ? ఇంతకు మీరిచ్చిన చనువు వారినిట్లు చేసినది.

ఉదయసింహుడు :— కాదు ప్రేయసీ ! నేను వారితో 'నీ పేరెత్త రాద'ని, నా యాన మీరిన నాడు ఉద్యోగములు వదలుకొని పొమ్మంటిని. వారి నవమానించి ఆలోచనా సభ అల్లరిపాలు చేసి నీ కడకరుదెంచితిని.

వీరా :— ఈనాటి తమ వీరకృత్యము తమ గౌరవమున కెంతయో వన్నె తెచ్చుచున్నది. మీరు మహారాణావారు కాన మంత్రి సామంతాదులు తమ సేవకులు ! వారు మీ యాన శిరసావహించి తీరవలయును గాని తమ యభీష్టమునకు ప్రతికూలముగ పలుకరాదు. అట్లెవరైన ఎప్పుడైన పలికినచో మీరు క్షమింపరాదు. ఇది రాజనీతి!

ఉదయసింహుడు :- ఇక ఆగొడవ పోనిమ్ము ! ఇంకను కాలము వ్యర్థపరతువేల ? నా మనస్సున కాహ్లాదము కూర్చుట కొక పాట పాడుము. నేను పరమానందమున పారవశ్యమొందెదను.

వీరా :— (వీణ సరిజేయుచు) ఆరాధ్య దేవత సంకల్పమున కీదాసి ప్రాతికూల్యము కావింపగలదా ?

పాట. అనుబంధము — 3.

ఉదయసింహుడు :— ధన్యుడను ప్రేయసీ ! ఈ గీతమునందలి ప్రేమభావ మతిసుందరమైనది. గీతమును వినుటచే నా హృదయము ప్రేమోన్మాది యైనది.

వీరా :— ఇది తమకు నాకాన్క ! సరి- దుర్గ రక్షణవ్యవస్థ చక్కగనున్నదా ?

ఉదయసింహుడు :— మరల నా గోడవలేల తెచ్చిపెట్టెదవు ? ఈ సమయమున నీ ప్రశ్న నింకెవరైన నడిగియున్నచో వారి ప్రాణములు తీయించి యుండెడివాడను. నీవు కనుక నాకు ఆగ్రహము కలుగకున్నది. ఆఁ నీవను కొన్నట్లు చక్కగనే యుండవచ్చును. నేను ఆ పర్యవేక్షణ మాని చాలకాలమైనది. సేవకులు మాత్రము కట్టుదిట్ట ములు బాగున్నవనియే యనుచున్నారు.

వీరా :— మీరు ప్రత్యేకముగ పోయి కావింపవలసిన వ్యవస్థ లేమి కలవు ? మంత్రిమండలి శాసించుచుండును. దుర్గాధి కారులు వాని నాచరించుచుందురు. వారిపై పర్య వేక్షణలు, బాధ్యతలు మంత్రులవేకదా !

ఉదయసింహుడు :— దుర్గ రక్షణాధికారులెల్లరు మిక్కిలి జాగ రూకతతో నున్నట్లున్నారు. కాని- రణదంభోరు దుర్గ రక్షకుడు శాహాభారమల్ తన కుమారుడు భామాశాహ వివాహమున కాల్వార్ వెళ్లి యున్నాడు.

వీరా :— (మధ్యలోనే అందుకొని) అయినచో నేడాదుర్గమునకు రక్షకులే లేరా ! అతడచ్చట పెండ్లికై యెన్నా ళ్లుండును ?

ఉదయసింహుడు :— వారు రేపుదయమునకే రాగలమన్నారు. వారు తప్పక మాట మేరకు సకాలముననే దుర్గమునకు పోగలరు ! ఇది నా దృఢ విశ్వాసము !

వీరా :— తమ విశ్వాస మెన్నటికిని వృథ కాదు. వారి రాజభక్తి, దేశభక్తి యనుపమానమని నేనును వినియున్నాను. వారి కుమారులు భామాశా కూడ మిక్కిలి సమర్థులట కదా !

ఉదయసింహుడు :— నీవు విన్నది యథార్థము. భామాశాహ ఈ చిఱుత ప్రాయమందే అసాధారణ వ్యక్తిగ గోచరించుచున్నాడు. అతడనేక మహాకృత్యముల కావించియున్నాడు.

వీరా :— అట్లైన అతని వీరకృత్యములను కొద్దిగ వినిపింపుడు.

ఉదయసింహుడు :— ప్రేయసీ ! ఇది అదను కాదు. ఇంకొకమారు వినుపింతును. నీ మనోహర గానము విన్నది మొదలు నీలో నైక్యమై పోవలయునని యారాట పడుచున్నాను. నా మనస్సు కావించు రమణీయ కల్పనలకు శాశ్వత రూపము ప్రసాదింపుము.

వీరా :— మీ వాంఛితము నెరవేరుటకు మనోజ్ఞమగు శయ్యాగృహమే కదా సరియైన ప్రదేశము. హంసతూలికా తల్పము సైతము తమ రాకకై ఎదురు చూచుచున్నది.

ఉదయసింహుడు :— హృదయేశ్వరీ ! పద.

( ఇరువురు ఒకరొకరి కౌగిళ్లలో నడచి పోవుదురు. )

[ తె ర వ్రా లు ను. ]

# ( ఐ ద వ దృ శ్య ము )

స్థలము—రణదంభోరునందలి భారమల్ భవనము.

సమయము—రాత్రి.

(శయనాగారమున మనోరమ ఖామాశాహ కొరకు నిరీక్షించుచుండును. ఖామాశాహ ప్రవేశించుచుండగా తెరయెత్తుదురు)

మనోరమ :— (లేచి నిలువబడి) నాథా! వచ్చితిరా? ప్రస్తుత కార్యాధిక్యము వలన తమరు శయనించుట ఆలస్యమగుచున్నది.

ఖామాశాహ :— ప్రేయసీ! ఏమిచేయుదును? మన వివాహమైనది మొదలు రాజకీయ పరిస్థితులు క్లిష్టములైనవి. చిత్తూరు రణసీమయందు నిత్యనూత్నమగు దృశ్యములు కనుపించుచు దుర్గరక్షణయందు మిక్కిలి శ్రద్ధకలిగించుచున్నవి. తండ్రిగారి కీపరిస్థితులలో నా సహాకార మెంతేని యావశ్యకము! ఇందువలన నీతో నొకనాడేని నిశ్చింతగా సరసాలాపము లాడ నోచుకోజాలనైతిని.

మనోరమ :— ఇందులో మీదోషమేమున్నది? ప్రస్తుతము ప్రేమ విహారముల కదనుగాదు. దేశ సంరక్షణకై ప్రజలు దేశభక్తి నావేశింపజేసికొని ఐహికము లందుదాసీనులుగావలయును. ఇదియే ప్రస్తుతము మనమవలంబింప వలసిన ధర్మనిష్ఠ! ప్రస్తుతము రాజకీయ విశేషముల నానతిండు.

ఖామాశాహా :— ఏమున్నది? ఈనవయౌవనమునందు నీకుదయిం
చిన వివేకముగూడ రాణాకున్నచో నీక్లిష్ట పరిస్థితులు
కల్గెడివి కావు!

దేశము పారతంత్ర్యమున దిమ్మెరవోయెను; రాజు సాని యా
వేశము నౌదలన్నిలిపి, తేకువమాలి, విరోధిబద్ధుడై
వైశిక కాంత చాతురిని బంధనమున్ విడనాడి దానికిన్
దాసుడనన్ ప్రశంసలిడ, దానిని జంపిరి తుచ్ఛ సైనికుల్. (1)

మనోరమ :— ఉరుకురిమి మంగలముమీదఁ బడినట్లు వీరాధి
వీరులిందరు విలాసిని వీరాను చంపిరా? విరికివారై
విలాసములలో మునిగి అబలలకు సైతమవమానము కలి
గించు భీరుడగు రాణా నేల పదభ్రష్టుని కావింపక
పోతిరి? మీరు రాణాను శత్రువుల కప్పగింప తన యుక్తి
శక్తులతో విడిపింప జేసిన వీరాకు ఘోరమరణమా? నిజ
ముగ స్త్రీజాతి కిది లజ్జాకరము! తాను ప్రేమించిన
వాని నాపదనుండి కాపాడి, వానివారిచే తానే దుర్మరణ
మందిన వీరా త్యాగము ప్రశంసనీయము.

ఖామాశాహా :— నీవన్నది నిజమే కాని— ఆమెయైనను అతనిని
రాజ్యతంత్రములందు పాల్గొన ప్రబోధింప జేసినచో
నామెయు, దేశము సుఖపడెడిది.

మనోరమ :— మీరన్నది నిజమే! కాని— ఆమె త్యాగము వక్ర
మార్గమున నడచి యామె కట్టిదుర్మరణము కలిగించి
నది! రాణా క్షంతవ్యుడు కాడు. శత్రువులకోడి సాని

దానివలన విముక్తినొంది ఏముఖము పెట్టుకొని లజ్జిల్లకున్నాడు ?

భామాశాహ :— ఆతని కేకోశమందేని లజ్జయున్నదున్నచో మృత్యువునే రణమున వరించి యుండెడివాడు! వీరా మరణమునకు నావేశపరులగు కొందరు సామంతులు కారణమని నాకిప్పుడే తెలియవచ్చినది! రాణా బంధ విముక్తికై ఆమె ప్రదర్శించిన రణకౌశలము ప్రశంస నీయము. భావిచరిత్రకారు లామె నామాక్షరములు స్వర్ణాక్షరములతో చరిత్రలో లిఖింపగలరు.

మనోరమ :— వీరా దుర్మరణమేని, త్యాగమేని రాణాను ప్రబోధింపజాలక పోయెనా?

భామాశాహ :— భీరు శిరోమణి రాణా మృతకల్పుడై చేష్టలుడిగి పరధ్యానముగ నున్నాడు. నేటి మంత్రాలోచన సభయందు విలాస స్వప్నలోకముల విహరించు చుండుట జూడ నాతనికి జన్మమునకు వివేకోదయము కాదని తెలియుచున్నది.

మనోరమ :— దీని నెల్ల పరిశీలించినచో నచిరకాలముననే రాజ్యము యవనుల పాలుకాక తప్పదనియు, బప్పా రావల్, రాణా సాంగాల పవిత్రస్థానమగు చిత్తూరు శ్మశానము కాకతప్పదనియు తోచుచున్నది.

భామాశాహ :— నీయూహ నిజము కావచ్చుననుటకు సందేహము లేదు. రాణా అవివేకమునకు పిరికితనమునకు

సొంతము లేహ్యాపడుచున్నారు. ప్రజలలో రాజభక్తి నశించినది. సామంతులలోని యనైక్యత రాజ్యనాశనము నకు నాంది ప్రస్తావన కాగలదు.

మనోరమ :— (విస్మయముతో) చిత్తోడుభూమి రణదేవత మారణ తాండవమునకు రంగస్థలమగునా ? ఉదయ సింహుడు భావితరము వారిచే, నీతరము వారిచే నిట్లవ మానము నొంది హైన్యత నొందవలసినదేనా ?

ఒక్కొక వీర సైనికుని యొక్కొక నెత్తురుబొట్టు లోకమం
దొక్కొక యగ్ని శైలమను నూహను గూర్చుచు శాత్రవ
న్యక్క్రియ నాచరింప దొకొ ? ప్రాణములఙ విడనాడుదాక స
మ్యక్క్రియ బోరువారలకు హారతి పట్టరె వీరులెల్లరున్. (2)

భామాశాహ :— ఇంకెంతో కాల మోపికబట్ట పనిలేదు. యవన వాహిని తరలి వచ్చుచున్నదని చారులు విన్నవించు చున్నారు. ఉదయసింహుడోడి చిత్తూరు భస్మముచేసి, పూర్వీకుల యశస్సుల మలినపరచి దిక్కుమాలిన చావు చచ్చితీరును.

అధికారం బసమర్థ మానవులకే హస్తంగతంబైనచో
విధినిన్దూరుట వెఱ్ఱి; తాము చెడుచున్ వీరల్ జగం బెల్లెడన్
బధిరం బెక్కువ చూపు తక్కువగ సంప్రాప్తించి దుర్గర్వులై
అధికారాంతముదాక నాశనము సేయంబూనెదర్ సర్వముఙ (3)

ఎందులకీ అరణ్యారోదనము! విధియే సర్వము నిర్ణ యింపగలదు! (కోటగంటల చప్పుడువిని) మనోరమా!

వింటివా! దుర్గమందలి గంటలమ్రోత యర్ధరాత్రిని సూచించుచున్నది. ఇక విశ్రమింతము రమ్ము.

మనోరమ :— నాథా! అటులనే కావింతము.

(ఇ రు వు రు ని ష్ర మిం తు రు.)

[ తె ర వ్రా లు ను. ]

## ( ఆ ర వ దృ శ్య ము )

స్థలము—చిత్తోడు దుర్గము. సమయము—సూర్యాస్తమయము

**(చింతాకులస్వాంతుడై ఏకాంతవాసమున మహారాణా ఉదయ సింహుడు ప్రవేశించుచుండ తెరయెత్తుదురు.)**

ఉదయసింహుడు :— (నిట్టూర్చుచు, స్వగతముగ) ఆహా! మొగలు పాదుషా బంధిఖానా నాకెప్పటికిని తప్పదా? మరల మొగలు సైనికులు తరలి వచ్చుచున్నారా? నాకు ఇనుపసంకెళ్ళు తగులక తప్పదా?

పారతంత్ర్యము నొంది నేబ్రతుకజాల
నీతికోవిదులన్నట్లు నీతిమాలి
జగతి నపవాదమొంది శాశ్వతముగాను
బ్రతుకగల రోతకన్న మరణమే మేలు? (1)

కాదు కాదు- నేనేల వ్యర్థముగ సుఖముల వదలి రణరంగమున మరణింప వలయును? ఇప్పుడు నేను ప్రాణ రక్షణోపాయము నాలోచింప వలసియున్నది. ఏలనన నాకేసామంతరాజపుత్రుడేనియు ' తోడ్పడ

కున్నాడు! తొందరలో తగిన ప్రతీకార మాలోచింప వలయును. నేను పంపిన గూఢచారుడింకను రాలేదేమి?

(గూఢచారుడు ప్రవేశించును)

ఉదయసింహుడు :- సమాచారమేమో తొందరగా చెప్పుము.

గూఢచారుడు :- (నమస్కరించి) మహారాణా! యవన సామ్రాట్టు అక్బరు పాదుషా చిత్తోడు దుర్గసమీపమును చేరి సేనావాహినిని రాజమార్గమున కిరుప్రక్కల విడియజేసి యున్నారు.

ఉదయసింహుడు :- (మధ్యలోనందుకొని కోపముతో) వెళ్లిపో! నాకడనుండి పారిపొమ్ము. ఇట్టి భయంకర దుర్వార్తను వినిపించి నన్ను భయపెట్టకుము.

(గూఢచారి భయముతో నిష్క్రమించును)

ఉదయసింహుడు :- (దీర్ఘముగ నిట్టూర్చి) ఇక నేను యవనుల బందీనగుట కెక్కువ వ్యవధిలేదు. మొగలుల ఫిరంగిగుండ్లు కెదురునిలచి పోరుశక్తి నాకు లేదు. 'ఇప్పుడాత్మరక్షణ మెట్లు కావించు కొందును? (కొద్దిగ ఆలోచించి) కోటను వీడి పారిపోవుటయే యుత్తమమార్గము. నాయింటి నుండి నేనే దొంగవలె పారిపోవలసిన దుస్థితి నాకు పట్టినది. ఏసామంతుని కంటబడినను ప్రాణములపై నాశలు వదలు కొనకతప్పదు. ఇదిగో! నాకీ సమయమనుకూల ముగనున్నది. ఈ అంధకారము నా హృదయమువలె శూన్యమైయున్నది. అలసించిన వెన్నెలవచ్చి కొంప ముంచును.

రాజ్యమును వీడి, నా మహారాణి పదవి
వదలి, దొంగపోలిక నక్కి, ప్రాణములను
పిడికిటన్ బట్టుకొని, గుండె దడదడమన
పారిపోయెద జగమెల్ల దూరుగాక! (2)

(అనుచు నిష్క్రమించును)

[తెర వ్రాలును]

## ( ఏ డ వ  దృ శ్య ము )

స్థలము—చిత్తూరు దుర్గము. సమయము — ప్రాతఃకాలము

(అస్త్రశస్త్రములతో సామంతరాజులు ప్రవేశించియుండ తెర ఎత్తుదురు.)

మొదటి సామంతుడు:—, మన దౌర్భాగ్యవశమున మనకీ పారు బోతు పిరికిరాణా దొరకినాడు. నట్టేటిలో పుట్టిముంచి ప్రాణభయముతో పారిపోయినాడు. ఓ ఏకలింగస్వామీ! చిత్తోడు రతణాభారమిప్పు డెవ్వరు శిరమున ధరించి భరింతురు ?

రెండవ సామంతుడు:—మిత్రమా! ఏల యింత యధైర్య ముందెదవు ? వీరమాత మేవాడజనని రత్నగర్భము వట్టి పోలేదు. సమయము చిక్కినచో సామాన్య రాజపుత్రుడు సైతమీమహాయజ్ఞమున సమిధయై యాత్మార్పణము కావింపగలడు !

అంధకారము నెదిరింప నలవిగాక
సూర్యు డస్తాద్రిమాటున జొచ్చినపుడు
చిమ్మచీకట్లు వాపి దీపమ్ము నాల్గు
దెసలయందును కాంతుల నొసగుగాదె ? (1)

ఆ విధముగ రాణా పలాయనమంత్రము పఠించుట తోడనే సామాన్య రాజపుత్రులమగు మనమే యవనుల దరిమి పై చెదము.

మూడవ సామంతుడు:—నిజము మిత్రమా ! నీవన్నట్లు మేవాడ పేరులోనే యట్టి సమ్మోహనశక్తి గలదు. మనమే కాదు ! రాజస్థానమందలి భిన్న భిన్న జానపద రాజపుత్ర గణము సన్నద్ధులై యీ యుద్యమమందు పాల్గొనుటకు రానున్నారు.

నాల్గవ సామంతుడు:—అప్పుడే వీరాధివీరుడు సహిదాసు చందావత సేనావారమును గైకొని చిత్తోడు ప్రధాన సూర్యద్వార రక్షణకు బూనుకొనియున్నాడు !

ఐదవ సామంతుడు:—మదోరియాపతి రావతుమాందా గంగావత సేనల గైకొని రణభూమి చేరినారు.

మొదటి సామంతుడు:— (సంతోషముతో) బిజ్‌లీ పరమార్, మాదీపాలాపతికూడ రానున్నారట !

రెండవ సామంతుడు:— షాలోరుపతి శోనమ దేకారావు, ఈశ్వర దాసు రాఠౌరు, కర్మచందు కఛవాహా మరియు గ్వాలియరు తువరరావు ప్రభృతులుకూడ వచ్చియున్నారు.

మూడవ సామంతుడు:—(ప్రసన్న వదనముతో) చాలును ! మన కిక విజయమందు సందేహాము లేదు. యవనుల పాద స్పర్శచే మన మేవాడమాత నపవిత్రను కానీయరాదు. అట్టి దుస్థితి సంభవించుట కనులార చూచుటకన్న తుది

నెత్తురుబొట్టున్నంతవరకు ప్రాణములపై నాసమాలి పోరుదము.

నాల్గవ సామంతుడు:—ఇక బయలుదేరుదము! మనమందర మీ మహోద్యమమున ప్రాణార్పణము కావించుటకుముందు మాతృభూమికి కడసారి నమస్కారము లాచరింతము.

(ఒరనుండి ఖడ్గములుదీసి అందరుచ్చైస్స్వరముతో)

పాట - అనుబంధము-4

(పాటపాడుచు నిష్క్రమింతురు.)

[ తె ర ప్రా లు ను . ]

( ఎ ని మి ద వ దృ శ్య ము )

స్థలము-రణదంభోరు దుర్గము; సమయము-మధ్యాహ్నము.

(భారమల్, భామాశాహ, తారాచంద్ కూర్చుండి యుండ తెర యెత్తుదురు.)

భారమల్ :— నాయనా! భామా! చూచితివా? ఈమారు మొగల్ వీరుల, రాజపుత్రుల యుద్ధము నవలోకించు చున్నావా?

భామాశాహ :— తండ్రీ! హర్ష విస్మయములతో నవలోకించు చున్నాను. బిదనోడు రాజా జయమల్, కైల్వాడ రాజా పదునాలుగేండ్ల వాడైనను చూపిన శౌర్యమున కచ్చెరు వొందితిని.

తారాచంద్ :— ముఖ్యముగ నాయుభయ వీరుల బల పరాక్రమము లసాధారణము లైనవి.

యుగ యుగమ్ముల వరకును యువజనాళి
వారి నామాక్షరములు జపంబు సలుపు
నట్టి సంతతి కులకాంత లభిలషించి
కీర్తి గానమొనర్తురు గృహములందు. (1)

భారమల్ :— తారాచంద్రా ! నీ బాలవాక్కు బ్రహ్మవాక్కగుగాక ! వాస్తవముగ నాయుభయ వీరులతో సాటి రాగల వారుభయ సైన్యములందును లేరు. వేలాది రాజపుత్రుల రక్తదానమున సైతము విజయలక్ష్మి మనకు ప్రసన్నురాలు కాలేదు. స్వర్గ సదృశమగు చిత్తూరు నేడు భూత ప్రేతములకు తాండవస్థానమైనది. ధర్మమునకాస్థానమగు మన మాతృదేశము అధర్మవర్తనులచే ఛిన్నాభిన్నమై యాక్రోశించు చున్నది.

భామాశాహ :— నిస్సంశయముగ నచ్చటి పరిస్థితు లతిదారుణముగనున్నవి. అక్బరు దుర్గాద్వారము, చతుర్భుజాదేవి మందిర దీపవృక్షము, సింహద్వారము తనవెంట గొనిపోయినాడు ! దీని కక్బరు శిల్పకళాసక్తియే కారణమైయుండును. కాని- అక్బరు ఆగ్రహమునకు గురియైన శిథిల చిత్తూరు దుర్గము పూర్వ వైభవ మెప్పుడందుకొనగలదు.

తారాచంద్ :— ఇపుడా పునరుద్ధరణ విషయమై కలలుగనియు ప్రయోజనము లేదు. 'కంచెయే చేనుమేసిన గలదె

దిక్కు'ను నట్లు దేశోద్ధరణకు దీక్ష దాల్పవలసిన రాణా పలాయనముచేసిన నికనీభార మెవరు ధరించి భరింపగలరు?

భారమల్ :— నేటిరాణావలన నీమహాకార్యము కాకపోయినను భావిమహారాణాలైన తమపూర్వుల ప్రియ రాజధాని రక్షణకు కంకణము కట్టుకొందురేమో ?

(ఇంతలో సేవకుడు ప్రవేశించి భారమల్‌గారి కొక లేఖనిచ్చి వెడలును. భారమల్‌జీ దానిని చదువుకొందురు.)

భామాశాహ :— తండ్రీ ! ఈ లేఖ యెక్కడనుండి వచ్చినది ?

భారమల్ :— మహారాణా వారీ లేఖను పంపినారు.

భామాశాహ :— (విస్మయముతో) వారిపు డెచ్చటనున్నారు ? వారి పరిస్థితులను తెల్పవలసినది.

భారమల్ :— వారి నివాసము ప్రశ్నింపకుము. ఇక్కడనుండి పోయి రాజాపిల్లి వనమందు, శితోటమను ప్రదేశమం దిడుమలు పడుచు నూత్న నగరము నిర్మింప యత్నించు చున్నారు.

భామాశాహ :— పూర్వులనుండి పరంపరగ వచ్చుచున్న చిత్తూరును శ్మశానముచేసి క్రొత్తనగరము నిర్మింపజూచు రాణా వివేకము నేమనగలము ? ఇంతకు లేఖయందలి సందేశమేమి ?

భారమల్ :— వారు నన్నానగరమున కాహ్వానించిరి. నేనిప్పుడచ్చట కేగవలయును.

తారాచంద్ :— తామా పిరికివానిని గలసికొనుట నాకు లజ్జా హేతు వగుచున్నది !

ఖారమల్ :— నాయనా ! ఇందెవరును చింతింపవలసిన పనిలేదు. మన మాతని పిరికితనమును ద్వేషింపవలయును గాని యాతని నేల ద్వేషింపవలయును ?

తారాచంద్ :— ఈ యకార్యమువలన తమ యాదర్శజీవిత మునకు కళంకము కలుగదా ?

ఖారమల్ :— నాయనా ! తారాచంద్రా ! నీకు ప్రపంచాను భవము తక్కువయు, యువకరక్తమునగుటచే నీ కాద ర్శములే గోచరించుచున్నవి. మనస్సులోని యాదర్శ ములకు, వాని యాచరణలకు నెంత భేదము తప్పనిసరి యగుచున్నదో నీవెరుగ జాలకున్నావు ! దేశకాల పరి స్థితు లాదర్శమును సమన్వయ పరచుచుండును. ఆ సమ న్వయమే దేశోపకారకము. లేనిచో మనపరిస్థితి నేలవిడచి సాముచేయువాని స్థితియగును !

ఖామాశాహ :— (తారాచంద్రునితో) పూజ్యులగు జనకులు సర్వజ్ఞులు ! మనము వారి నొరవడి నుంచుకొనవలయును.

ఖారమల్ :— నేనిపుడే బయలుదేరి రేపు మహారాణాగారిని దర్శింప వలసియున్నది. కావున నేనా ప్రయత్నములో నుండెదను.

(అందరు నవిష్క్రమింతురు)

[తెర వ్రాలును.]

## (తొమ్మిదవ దృశ్యము)

### స్థలము—నూతనముగ నిర్మింపబడిన యుదయపురము.

### సమయము — సాయంసంధ్య.

(ఉదయసాగర సమీపమున వచారుచేయుచు ఉదయసింహుడు, ఖారమల్ ప్రవేశింప తెరయెత్తుదురు)

ఉదయసింహుడు :— ఖారమల్ జీ ! బహుశః మీకు జ్ఞాపకముండి యుండునని కొందును. మా పూర్వుడు బప్పారావల్ చిత్తూరును జయించుటకు ముందిచ్చటనే అజ్ఞాతవాసము కడపినాడు!

ఖారమల్ :— మహారాణా ! ఆ విషయము మరువగలనా ? ఆ ప్రత్యేక కారణము వలననే తమకీ ప్రదేశము ఉత్సాహము నొసగుచున్నది. మాబోంట్లకిది యాత్రాప్రదేశము కాదగినది ! హారావళి పర్వతములతో గూడుకొన్న యీప్రదేశము, ఈ నగరము దర్శనీయముగ నున్నది. పర్వత శిఖరములందలి రాజభవనము సుందరతరముగ నున్నది. ఈ నిర్జన ప్రదేశమింత మహానగరము కాగలదని యెవ్వరెరుగుదురు?

ఉదయసింహుడు :— పలువురు నాగరకులిందు తమ తమ భవనముల నిర్మింపజేసికొన్నారు. ఈ పర్వత మధ్యమము నందలి యుదయసాగరము నాకీర్తిని శాశ్వతము కావింపగలదు. ఏకలింగేశ్వరుని యనుగ్రహము వలన

నాకోరిక ఫలించినది. దీనిని చిత్తూరుకు బదులుగ రాజధాని కావించు కొన్నాను. రేపటి సమావేశమందు సామంతులు, నాగరకులు పాల్గొన నున్నారు. అందీ నూతన వ్యవస్థను గూర్చి వివరింప దలచితిని.

భారమల్ :— మహారాణా! తమ యాలోచన బాగున్నది. నే నేమేని జేయవలసి యున్నచో నాజ్ఞాపింపుడు.

ఉదయసింహుడు :— ఇప్పుడు మీరు చేయదగిన దేమియులేదు. ఇది పరామర్శ మాత్రమే! విషయములు రేపు సభాభవనమున ముచ్చటింతము. ఆప్రక్క ప్రదేశము మనోహారముగ నున్నది. మనము ఏకాంత ప్రదేశమున కరిగి సంభాషించుకొందము.

భారమల్ :— చిత్తము!

(నిష్క్రమింతురు)

[తెరపడును.]

( పదవదృశ్యము )

స్థలము—ఉదయపుర సభాభవనము; సమయము-ఉదయము.

(సభామధ్యమున సింహాసనము. సింహాసనము సమీపమున బారులు దీర్చి సామంతులు)

( తెరయెత్తుదురు. )

మొదటి సామంతుడు:—మన మహారాణా వారింత స్వల్పవ్యవధిలో నింత చక్కని పట్టణ మేర్పరచిరే!

రెండవ సామంతుడు:— ఇందుకు నీయాశ్చర్య మెందుకు? మహా రాణా రణశూరుడో కాదో కాని పేదకాదుగదా !

మూడవ సామంతుడు:—ఇం కేమున్నది. మరల అక్బరు ఆక్రమించు వరకు మనకిది రాజధాని. రెండవ చిత్తూరు !

నాల్గవ సామంతుడు:—ఈనాటి సమావేశము నూతన రాజ్యవ్యవస్థ కొరకనుకొందును.

ఐదవ సామంతుడు:—నిజమే ! రాజ్యములేని రాజు శోభించునా?

మొదటి సామంతుడు :— సరి— ఇప్పుడు ముఖ్యమంత్రు లెవ్వరు ? పెద్దలందరు రణదుర్గకు బలియైనారుకదా !

రెండవ సామంతుడు :— ఈ మంత్రిపదవి ఈ సమావేశమున తేలునేమో ? (వినుట నభినయించి) అదుగో ! మహారాణా వారు వచ్చుచున్నట్లున్నారు ! నిశ్శబ్దముగ నుండుడు !

(అందరు నిశ్శబ్దముగనుందురు. భారమల్ వెంటరా మహారాణా ప్రవేశించి సింహాసన మలంకరించును)

ఉదయసింహుడు :— (లేచి) సామంతులారా ! పౌరులారా ! చిత్తోడు దుర్గము చేజారిపోవుటచే నేనీ నగరమును నా పేర 'ఉదయపురము' అను పేరుంచి నిర్మింపజేసితిని. ఇక ముందుతరములవారికి, నేటివారి కిదియే రాజధాని! నాకు కుడిభుజముగనుండి రాజ్యతంత్రము నిర్వహించుటకు శాహాభారమల్ గారిని మహామంత్రులుగా నియమించుచున్నాను ! వారిప్పుడే ప్రమాణ స్వీకారము కావింతురు !

భారమల్ :— (లేచి) మహారాణా ! సామంతులారా ! పౌరులారా ! నేను నాయిష్టదైవము సాక్షిగా మేవాడోద్ధరణకు సర్వశక్తులు వినియోగింతునని ప్రమాణము కావించుచున్నాను. నాకన్న అనుభవశాలురు, సమర్థులు పెక్కురున్నను నన్నే ఈపదవికి నియమించిన రాణా వారికి, బలపరిచిన మీకు నా కృతజ్ఞతాపూర్వక నమస్కారము లర్పించుచున్నాను.

(సభికులు కరతాళధ్వనులు కావింతురు)

ఉదయసింహుడు :— శాహా భారమల్ గారు నామాట తీసివేయనందుకు కృతజ్ఞుడను. మా ముందుతరముల వారికి వీరి వారసులు మంత్రులుగా నుండగలరని యాశించుచున్నాను. భారమల్ జీ ! ఇవే ! రాజముద్రికలు గ్రహింపుడు.

(భారమల్ రాజముద్రికలు గ్రహింప సభ్యులు జయజయ అందురు)

[ తెర వ్రాలును. ]



# ఖా మా శా

## ( తృతీయాంకము — మొదటి దృశ్యము )

### స్థ ల ము — శ్మ శా న ము

(తెరలోనుండి శవము కాలుచున్న మరమర ధ్వనులు వినిపించు చుండును. మెల్లమెల్లగా సామంతులు మాట్లాడుకొనుచుండ తెర ఎత్తుదురు.)

మొదటి సామంతుడు :- మహారాణా వారేశరీరముమీది మోహమున క్షాత్రధర్మమును పరిహసించిరో యా శరీర మీనాడు చితియందగ్నిచే భస్మమై పోవుచున్నది. వారి విలాసములు, విలాసినులు, భోగసాధనము లొక్కటేని వెంటగొనిపోగలిగిరా ?

రెండవ సామంతుడు:- మహారాణా సుక్షత్రియవంశ మందు దయించియు ధర్మము నిర్వర్తింపజాలక పోయిరి. చివర కవసానమందును అధర్మమునకొక చిహ్నము నుంచి మరణించిరి.

మూడవ సామంతుడు :- వాస్తవముగ మహారాణా వంశపారం పర్యముగవచ్చు పద్ధతి పరిత్యజించి జ్యేష్ఠుడు, గుణవం తుడు, పౌరుషవంతుడు, దేశ సేవాపరాయణుడగు ప్రతాపుని కాదని, అన్నిటను ప్రతాపునకు వ్యతిరేకియగు

జగమల్లుని రాజును కావింపుమనుట క్షమింపరాని విష
యము.

నాలుగవ సామంతుడు :— రాణా నాటిన గృహకలహ బీజము చిలవలు పలవలై మహావృక్షమైనది. ప్రతాపసింహుని మేనమామ ఝూలౌరారావు ప్రతాపుని పట్టాభిషేకము నకు ప్రయత్నములు చేయుచున్నాడు.

ఐదవ సామంతుడు:— వారి ప్రయత్నముచిత మైనదే ! మరియు ప్రధాన సామంతుడు చందావతకృష్ణ కూడ వారి ప్రయ త్నముల బలపరచుచున్నాడు.

మొదటి సామంతుడు :— ఐనను రాణా మరణశాసనమును తిరస్కరించుట సాహసమే నే!

రెండవ సామంతుడు :— సామంతరాజు సలుంబ్రా కృష్ణుడందుకు సమర్థుడు.

మూడవ సామంతుడు :— జగమల్లును సమర్థించు సామంతు డొక్కడైన నున్నాడా ?

నాలుగవ సామంతుడు :— అందరము ప్రతాపసింహుని పట్టాభి షేకము చూడ నువ్విళ్లూరుచున్నాము.

ఐదవ సామంతుడు :- ప్రతాపుని గుణసంపద యాతని యందెల్లర కాదరము కల్గించుచున్నది.

మొదటి సామంతుడు :- (చితివైపు చూచుచు) రాణా శవము సంపూర్ణముగ దగ్ధమైనది. మన మరుగుదము.

రెండవ సామంతుడు :— తొందరగా మనము సభకేగి జగమల్లు నిరాకరణము, ప్రతాపుని పట్టాభిషేకము కనులపండుపుగ చూచెదము రండు.

( వి శ్ర మిం తు రు )

[తె ర వ్రా లు ను.]

## ( రెం డ వ దృ శ్య ము )

### స్థలము—ఉదయపుర సభాభవనము

(సింహాసనాసీనుడై రాణా ప్రతాపుడు, అతనికిరువైపుల భామాశాహ, తారాచందులు, తదితర సభాసదు లాసీనులైయుండగా తెర యెత్తుదురు.)

ప్రతాపసింహుడు :— సామంతులారా ! మేవాడ పౌరులారా ! ఏకలింగేశ్వరుని దయవలన మీయందరి యనురాగము వలన నాకీ రాణా పదవి లభించినది. నేను మిమ్ము శాసించుటకుగాక సేవించుటకీ కిరీటమును ధరించితిని. మీ యాశీర్వాదము వలన దేశసేవ చేయగలనని నమ్ముచున్నాను.

భామాశాహ :— మహారాణా ! తమయందు సామంతులకు, ప్రజలకు సడలని దృఢవిశ్వాసమున్నది. ఈ పవిత్రోద్యమమందు మేమందరము శక్తివంచన లేకుండ తోడ్పడగలమని ప్రజల పక్షమున, సామంతుల పక్షమున మనవి చేయుచున్నాను.

ప్రతాపసింహుడు :— మహాశయా ! తమ తోడ్పాటువలన నేను దేశమాతకు స్వాతంత్ర్యము కలిగింప పాటుబడుదును.

ఈ భాగ్యమునకు నిజమునకు నీ రాణా పదవియేమి ? స్వర్గాధిపత్యము లభించిన దానికన్న నధికముగ సంతోషించుచున్నాను. మరి— భామాశాహాగారూ ! తాము మారాజ్యమున మంత్రులై మమ్ము కాపాడి దేశసేవ చేయ నభిలషించుచున్నాను.

భామాశాహ :— మహారాణా ! నామీద మీరింత భారము మోపుదురను కొనలేదు. సేతు నిర్మాణమున నుడుతవలె నుపకరింపదలచు నాకు నీలుని పాత్ర నిప్పించుచున్నారు. మీవంటి వీర కేసరికి మంత్రియగుట నిజమునకు నా యదృష్ట విశేషము ! కాని దుర్బలములగు నా భుజములంత భారము మోయజాలవు ప్రభూ !

ప్రతాపసింహుడు :— అనూరుడు సూర్యుని రథసారథియైన రీతిగ మీరీకార్యము నిర్వహింతురుగాక.

భామాశాహ :— మీ ఉపమానము బాగున్నది కాని అనూరుడు చిరకాలాభ్యాసవశమున సూర్యుని రథమును తోలుచున్నాడు. మరి నాదో క్రొత్తబిచ్చగానితనము కాదా?

ప్రతాపసింహుడు :— మీకును ఇది వంశపరంపరాగతమేకదా ! మీ తండ్రి మా తండ్రికి మంత్రికదా ! ఇవిగో, రాజముద్రికలు స్వీకరించి మీ సోదరుడు తారాచందుగారిని గౌడవాడ కధికారిగా నియమింపుడు.

తారాచందు, భామాశాహాలు :— మహాప్రసాదము ప్రభూ ! మా సర్వస్వము వ్యయించి దేశసేవ గావింతుము. సెలవు !

(అం ద రు ని ష్ర మిం తు రు)

[ తె ర వ్రా లు ను. ]

( మూ డ వ దృ శ్య ము )

స్థలము — గౌడవాడ; సమయము — సంధ్యాకాలము

(చావడిలో శయ్యపై గూర్చుండి తారాచందు, ఎదుట సైనూరాం నిల్వబడియుండ తెరయెత్తుదురు.)

తారాచంద్ :— సైనూరాం! నేనిచ్చట స్థిరముగ నివసించుటకు రాణా అనుమతి లభించుటవలన స్వేచ్ఛగ, హాయిగ, సుఖముగ బ్రతుకగలుగు చున్నాను.

సైనూరాం :— ప్రభూ! ఉదయపురమున మీకేమి నిర్బంధ మున్నది? అన్నగారేమైన నడ్డువచ్చుచుందురా?

తారాచంద్ :— అన్నగారి ధార్మికజీవనముముందు నా విలాస జీవితము నాయంతట నేనే బలవంతముగ నిగ్రహించు కొన్నాను. నాకు మనస్ఫూర్తిగ వైరాగ్యజీవనము నచ్చనందున నాకది కారాగార సమానమైనది.

సైనూరాం :— ప్రభూ! అన్నగారికి సాహిత్యము, సంగీతము మొదలగు లలిత కళలందాసక్తి లేదా?

తారాచంద్ :— నీవన్నది నిజమే! వారి కిహవిషయములకన్న పరలోక విషయములందు ప్రీతియమితము. సుఖజీవనము కన్న సామాన్యజీవనము నపేక్షింతురు. వారి కర్తవ్య పాలన దీక్షముందు వారికేదియు పట్టదు. మోహ మలి నముకాని ప్రేమ, పసిపిల్ల ముఖములోని యమాయికత వంటి స్వచ్ఛంద హృదయము, కోయిలగొంతులోని సంగీ

తము, ఇతిహాస పురాణములలోని సాహిత్యము, ప్రకృతి సృషిలోని శిల్పము వారికి మిగుల నభిమానపాత్రము. వారి సర్వస్వము భగవంతుని పూజలకు, పరోపకారము లకు, దేశసేవకు వినియోగింతురు. ఏకొంచెము విరామము దొరకినను ధార్మిక గ్రంథపఠనము కావించుచుందురు.

నైనూరాం :- మీరు దానికి పూర్తిగా వ్యతిరేకులైనారేమి ?

తారాచంద్ :- పూర్వము నేనును అన్నగారివలెనే మెలగుచుంటిని. కాని- యౌవనమున నాలో నాభావము నశించి శృంగార జీవితము నందాసక్తి హెచ్చినది. అదియునుగాక, బాల్యమున విద్యాభ్యాసము, యౌవనమున శృంగార జీవనము, వార్ధక్యమున వైరాగ్య జీవనము క్రమపరిణామమని నా విశ్వాసము !

నైనూరాం :— తమ విశ్వాసము అర్షధర్మమే ! ఇది సాధారణులు ప్రవేశించు సాధనమార్గము ! తమ సోదరునివంటి యోగభ్రష్టులు కేవలము కర్మశేషమువలన జన్మించువారుకావున వారు బాల్యము నుండియు తీవ్రసాధన మొనరించి జీవన్ముక్తులగుదురు.

ఇక మీరు మనోరంజనమునందు ప్రేమ గలవారగుటచే నిచ్చట నైశ్వర్యమువలన గలుగు సకల భోగము లనుభవించుచున్నారు. ఇచ్చటి కోటీశ్వరులకు కూడ మీ భోగము లందరానివైయున్నవి. ఆరుగురు ప్రసిద్ధ గాయకురాండ్రు మీ కడనుండుట సామాన్యమా !

తారాచంద్ :- అప్పుచేసినదైన పప్పుకూడు తినవలయును. సంపదలు కలకాలము నిలచునా ? ఉన్నన్నాళ్లనుభవింప వలయును. ఇక — ఈ ప్రసంగము చాలించి గాయకురాంద్రను పిలిపింపుము !

నైనూరాం :- (నేపథ్యమున అందెలరవళి విని) తమ సంకల్ప మాత్రముననే గాయకురాండ్రరుదెంచుచున్నారు.

(వాద్యములతో గాయకురాండ్రు ప్రవేశింతురు)

తారాచంద్ :— నైనూరాం ! నాకొక చక్కనిపాటను వినిపింప జేయుము !

నైనూరాం :- (ప్రముఖ గాయకురాలితో) కేతకీ ! ఏదైన నుత్తమ గేయము గానముగావించి ప్రభువుల మనస్సున కుల్లాసము కల్గింపుము !

(గాయకురాండ్రు వాద్యములు మ్రోగించుచు పాటపాడుదురు.)

పాట. అనుబంధము — 5.

తారాచంద్ :— నైనూరాం! ఈ గేయము చక్కనిదై శృంగార భావము నుద్రేకింప జేయుచున్నది.

నైనూరాం :— తమ యాజ్ఞయైనచో నింకొక పాటపాడి వినిపింతురు.

తారాచంద్ :— ఈ సంగీతగోష్ఠి నేటికి చాలును. నీవిక వెళ్లుము. నేను అంతఃపురమునకరిగి ప్రేయసీమణులతో విహరింతును.

( అందరు విశ్రమింతురు. తెరపడును. )

## (నా ల్గ వ దృ శ్య ము)

### స్థానము — కుంభల్‌మియర్ దుర్గము;
### సమయము — మధ్యాహ్నము.

(రాణా ప్రతాపసింహుడు, భామాశాహ కూర్చుండియుండ తెర యెత్తుదురు.)

ప్రతాపసింహుడు :— మంత్రీశ్వరా! సూర్యుడు తీక్ష్ణస్వభావమును, అగ్ని ఉష్ణస్వభావమును, తారలు ప్రకాశము వీడకున్నను క్షత్రియులుమాత్రము నిస్తేజులై యున్నారు.

భామాశాహ :— రాణాజీ! నిజమునకు నిస్తేజులు క్షత్రియులు కారు. వారు క్షత్రియేతరులు! క్షత్రియులెన్నడు నిస్తేజులు కారు. తమలోని వీరాంశము ప్రళయమందైన నశించునా ?

ప్రతాపసింహుడు:— మంత్రిపుంగవా! మీరన్నదియు యథార్థమే!

పరుల నాశ్రయించు నరకీటకంబులు
క్షత్రియపదమున కపాత్రులు సుమి!
హేమ భూషణంబు లెన్నిదాల్చిన గ్రామ
సింహ మెన్నడేని సింగమగునె ? (1)

భామాశాహ :— యవనదాసులతో సంబంధ బాంధవ్యముల విచ్ఛేదము కావించుకొన్న తమనోట నీమాటలు వెల్వడుట విచిత్రముకాదు.

ప్రతాపసింహుడు :— సంబంధ విచ్ఛేదమొక గొప్పవిషయమా! అట్టి తుచ్ఛుల పేరువిన్న సచేలస్నానము చేయవలెను.

భామాశాహ :— ప్రభూ ! ఇది స్వాభావికము ! ఇది తేజస్వుల సహజ లక్షణము.

విశ్వరాజ్య రమను విడనాడి మార్తాండు
డపర శిఖరి జేర నరుగుగాని
గురుకళంకియైన హరిణాంకు మోమును
గాంచ నిష్టపడడుగా నరేంద్ర ! (2)

(ద్వారపాలకుడు ప్రవేశించును.)

ద్వారపాలకుడు :— మహారాజా ! మానసింహుని సేవకుడు దర్శన మపేక్షించుచున్నాడు !

ప్రతాపసింహుడు :— వానిని ప్రవేశింప జేయుము.

(ద్వారపాలకుడు నిష్క్రమించును.)

ప్రతాపసింహుడు :— భామాశాహాజీ ! మానసింహునిదూత యాకస్మికముగ వచ్చుటకు కారణ మేమైయుండును ?

భామాశాహ :— రాజేంద్రా ! కుటిలుల దుష్టయోచనము లెట్లూహింపగలము ! వారి యోచనలు స్వార్థపూరిత ములుగదా !

ప్రతాపసింహుడు :— మానసింహునకు నావలన కలుగు ప్రయోజన మేమిగలదు ?

భామాశాహ :— పాముకేమి ప్రయోజనము కలుగునని కాటు వేయుచున్నది! ఆ పతితుడు మీవంటి పవిత్రుల నపవిత్ర పరచు తలపుతో వ్యూహము పన్నియుండును. (పద ధ్వని విని) అడుగో! దూత ప్రవేశించుచున్నాడు! మనము సావధానముగ విషయపరిశీలన మొనరింతము !

(దూత ప్రవేశించును.)

దూత :— మేవాడపతీ ! మహారాజా మానసింహుడు నన్ను తమవద్దకు పంపియున్నాడు.

ఛామాశాహా :— ఇది ద్వారపాలకుడే చెప్పియున్నాడు. ఇంతకు సందేశమేమో తెల్పుము !

దూత :—(ఛామాశాహాకు లేఖనందించి) ఇందులో నాయాగమన ప్రయోజనము కలదు !

ఛామాశాహా :— మీరు అతిథిగృహమున భుజించి విశ్రమింపుడు. మీకు ప్రత్యుత్తరము పంపింతుము.

(దూత విష్క్రమించును.)

ఛామాశాహా :— రాణాజీ ! ఇదుగో ! యవనదాసుడగు మాన సింహుని లేఖ పరికింపుడు !

ప్రతాపసింహుడు :—(కోపముతో) ఈలేఖ నాకేల? దీని నగ్నిలో భస్మము కావింపుడు !

ఛామాశాహా :— (మెల్లగా) ఇది చదివినంతమాత్రమున మనకు గలిగిన నష్టమేమి? ఇందలి విషయము పరికించుట దోషము కాదుగదా ! నా మనవి చిత్తగింపుడు !

ప్రతాపసింహుడు :— మీయిష్టమే కానిండు ! దురభిమానియగు మానసింహునిలేఖ నేను పఠింపను. మీరే చదువుడు. తప్పనిసరిగా వినెదను !

ఛామాశాహా :— ఈ విషపానము నాకు తప్పదా ప్రభూ ! కానిండు తమ యాజ్ఞ పాలింతును.

(అని లేఖను జదువును.)

మహారాణా !

సోలాపురమున లభించిన విజయ విషయము తమకు సంతసము కలిగించియుండును. నేను ఢిల్లీకిచేరుటకు ముందు తమను కలసికొన నుద్దేశ్యముకలదు. తమ అతిథిగ నన్ను జూడ ప్రార్థన.

—మానసింహుడు.

ప్రతాపసింహుడు :—(క్రోధముతో) ఖామాశాహాజీ ! కులకళంకి మానసింహుని దౌష్ట్యము చూచితిరా ! వాడు మన సత్కార మాశించుచున్నాడు.

ఆల కొమ్ములందు పాలం బిండినగాని
అగ్ని జొచ్చి తాప మణచుకొనిన
నిష్కళంకినైన నేనా కులద్రోహి
వంకజూడ, గౌరవం బొనర్ప. (3)

ఖామాశాహ:—స్వాభిమానపరాయణా! తమ యీ యాగ్రహము నిష్కారణముకాదు. సకారణమైనదే ! ఇట్టి సమయము లందు ప్రత్యేకస్వాభిమాని యాత్మ యిట్లే ఘోషించును! కాని— యీ నిర్ణయమునకు ముందు మానసింహు డతిథిగ రానున్నాడను విషయము మరువరాదు.

ప్రతాపసింహుడు :— (కొంచెము శాంతించి) తమ యీసూచన మహత్తరమైనది. అతిథి సత్కారము ఆర్యధర్మము. అతిథిని సత్కరించుటమాని నాపూర్వుల కీర్తిని కళంక పరుపను. కాని— ఈ సందర్భమున నీయతిథిసత్కారమునకు, స్వాభిమాన సంరక్షణమునకు సమన్వయ మెట్లు పొసగును ?

భామాశాహా :— (కొంచెమాలోచించి) మీరు మానసింహునకు స్వాగతాదిసత్కారములు స్వయముగ గావింపక మరొకరి నందుకు నియోగించిన మీ అభిమానరక్షణము, అతిథి సత్కారము జరుగును.

ప్రతాపసింహుడు :— మంత్రిచంద్రమా ! మీ సమయస్ఫూర్తికి ధన్యవాదములు. ఇది నాకును లెస్సగ తోచుచున్నది.

భామాశాహా :— కాని— ఈ కార్య మెవరు నిర్వహింపగలరు? ఎవరు నిర్వహించిన ఉచితముగ నుండును ?

ప్రతాపసింహుడు :— నా దృష్టిలో నిందుకు మీకన్న సమర్థులు కన్పింపరు. మీరు మహామంత్రులు కావున రాబోవు అతిథి అంతస్తుకు తగియున్నారు. అదియునుగాక మీ కార్యచాతుర్యము నేడు వన్నె కెక్కగలదు ?

భామాశాహా :— దయాసాగరా ! ఇది తమ యౌదార్యమేకాని నా గొప్పతనముకాదు. నేను నిమిత్తమాత్రుడను. మీ యాజ్ఞ పాలించుటయే నా కర్తవ్యము.

ప్రతాపసింహుడు :— మీ వినయము, మీ గొప్పతనమునకు వన్నె పెట్టుచున్నది. మీరింద కంగీకరించి నా భారము తీర్చి వైచితిరి. మీరు తోచినట్లు స్వాగత సన్నాహములు కావింతురుగాక !

భామాశాహా :— మీరీ విషయమై నిశ్చింతగ నుండుడు. సకల సన్నాహములు కావింతును. భోజనాదివిషయములందు అతిథికి తగిన సన్నాహములు కూర్తును కాని......
(మధ్యలో నాగును)

ప్రతాపసింహుడు:— ఆఁ ఏమి మధ్యలో నాగిపోయినారు? పూర్తి గానిండు !

ఖామాశాహ:— ఏమియు లేదు. అతిథిబంతిలో కూర్చుండి భుజించు వా రెవ్వరు ?

ప్రతాపసింహుడు :— నిజమే ! ఇది ముఖ్యముగ నాలోచింప వలసిన విషయము ! యువరాజు అమరసింహుడందుకు తగడా ?

ఖామాశాహ :— వారికన్న యోగ్యు లెవరున్నారు ? ఈ ప్రయత్నములలో నాకు వారి తోడ్పాటు ముఖ్యము ! అందువలన నేను వారిని కలసికొని సన్నాహము లొనర్ప వలసియున్నది.

ప్రతాపసింహుడు :— తప్పక కలసికొని మా యమరుని మీకు తోడుగా నుంచుకొనుడు.

(ఖామాశాహ, ప్రతాపుడు నిష్క్రమింతురు.)

[ తె ర వ్రా లు ను. ]

## ( ఐ ద వ దృ శ్య ము )

స్థలము-ఉదయసాగరతీరము; సమయము-సాయంకాలము.

(ఖామాశాహ, అమరసింహుడు కూర్చుండియుండ తెరయెత్తుదురు.)

ఖామాశాహ :— యువరాజా ! మానసింహుని విడిది కీభవన మనుకూలముగ నున్నదా ?

అమరసింహుడు :— ఈ ప్రదేశము ప్రకృతి రామణీయకతతో నొప్పారుచున్నది. తమ కార్యనిర్వహణ దక్షత ప్రశంస నీయము !

భామాశాహ :— నా నిర్వహణ దక్షతలోని ప్రత్యేకతయేమియు లేదు. అతిథి కీమాత్రపు వసతు లేర్పరచుటయు ఘనతయేనా ?

అమరసింహుడు:—ఇంకను మనమేమి సమకూర్చవలసి యున్నది?

భామాశాహ :— ప్రభాతవేళకు పూర్ణకుంభములతో నతిథికి స్వాగతమిచ్చుటకు కామినులు సిద్ధపడవలయును. అప్పటి కీమార్గమంతయు పన్నీరు కలయంపి చల్లించి ఆస్థాన వాద్యవిద్వాంసుల సిద్ధపరుపవలెను. రాజోద్యాన మాలా కారుడు సుగంధయుక్త పుష్పహారము సిద్ధపరచియుండ వలయును.

అమరసింహుడు :— ఈ నాలుగు పనులేనా ? ఇవి నేను నిర్వహింతును. మీరిక నిశ్చింతగనుండుడు.

భామాశాహ :— తమదయవలన నా కార్యభారము తగ్గినది. ధన్యవాదములు. మరి- భోజన సదుపాయములో ?

అమరసింహుడు :— నిజమే ! ఈ సంగతి నాకు గుర్తేలేదుసుమా! అతిథికి శాకాహారమా ? మాంసాహారమా ?

భామాశాహ :— అతిథి యే యాహారము కోరినను మనము శాకాహారమే సిద్ధపరతుము. ఇది మన సంప్రదాయము.

అమరసింహుడు :— అహింసావలంబకులు, జైనతీర్థంకర సదృశు లగు తాము శాకాహారముగాక మాంసము వండింతురా? పైగా— ఇది సులభసాధ్యము !

భామాశాహ :— యువరాజా ! సులభము, శ్రమయనికాదు మనము చూడవలసినది ! మన సిద్ధాంతము మానరాదు.

అమరసింహుడు :— మీకు, తండ్రిగారికి సిద్ధాంతములందున్న మమత ప్రాణములందును లేదు. మన సంభాషణ ప్రస్తుత విషయముదాటి చాల దూరము పోయినదే !

భామాశాహ :— నేను మన సంభాషణమును యథాస్థానము చేర్చెదనులెండు. అతిథికి శాకాహారములను మధురతరముగ పచనము చేయవలయునని యాదేశింపవలయును.

అమరసింహుడు :— వంటవాని కీవిషయము నేను తెల్పుదును లెండు.

భామాశాహ :— మీరావిషయమున తప్పక శ్రద్ధ గైకొనుడు. రాణావారు బంతిలో భోజనము చేయలేదని మండిపడు మానసింహుని దురాగ్రహామునకుతోడు శాకపాకములు బాగులేనిచో రభస జరిగితీరును.

అమరసింహుడు :— మీరు చక్కగ నాలోచించి సెలవిచ్చితిరి. మానసింహు డసలే కోతి ! అక్బరు ఆశ్రయమను కల్లు త్రావినాడు. రాణా బహిష్కారముచేసెనను పిచ్చిబట్టియున్నాడు. పైగా దాదాజీ బంతిలో కూర్చుండకుండుట తేలుకుట్టినట్లుండును. కూరలు బాగులేకున్న నిప్పుత్రొక్కినట్లు చిందులు త్రొక్కగలడు. పైగా నతనికి ప్రియతమములగు మకారత్రయము (మదిర, మానిని, మాంసము) లేకుండుటయు కలసివచ్చినది. ఇంకేమి సన్నాహాపరతుము ?

భామాశాహ:—వస్తుభాండారమున నున్నవట్లుంచి పైగా ఋతుధర్మానుసారము లభించు పండ్ల నన్నిటిని సేకరింపవల

యును. పనిలో పని—భోజనమునకు, సువర్ణపాత్రయు, శాకాదికములకు రజితపాత్రలు, ఫలములుంచుటకు నగిషీ చేయబడిన వెండిబుట్ట కావలయును.

అమరసింహుడు :— అన్నిటిని రేపటియుదయమునకు నేను సిద్ధపరతును మనము కొంచెము ముందుగా రేపుదయము ఇక్కడకు చేరుకొనుట మంచిదికదా !

ఖామాశాహ :— ఔనౌను ! ఇక మనము పోవుదము రండు.

(ఇరువురు నిష్క్రమింతురు )

[ తె ర ప్రా లు ను. ]

## ( ఆ ర వ దృ శ్య ము )

స్థానము — ఉదయ సాగరము.

సమయము — సూర్యోదయానంతరము

(తోరణములతో నలంకరింప బడిన విడిది గృహము. శిరమున మంగళ కలశములతో ముత్తైదువలు, వాద్య విద్వాంసులు, కొలది సైన్యము, రాజ్య పదాధికారి, ఖామాశాహ, అమరసింహుడు ప్రవేశించి యుండ తెర యెత్తుదురు.)

ఖామాశాహ :— యువరాజా ! ఆగమన సమయ మతిక్రమించి నను మానసింహుడింకను రాలేదేమి ?

అమరసింహుడు :— మంత్రివర్యా ! అనుకొన్న దానికన్న కొంచె మాలస్యము జరిగి యుండవచ్చును. అదుగో !

దూత యిటే వచ్చుచున్నాడు. ఇక మానసింహుని రాక కట్టే వ్యవధి యుండబోదు!

( దూత ప్రవేశించును. )

దూత :— (సవినయముగా) మహారాజా! మానసింహుల వారరుదెంచుచున్నారు.

(మెల్లమెల్లగా వాద్య విద్వాంసులు స్వాగత గీతము లాలాపించుచుండ మానసింహుడు వచ్చును.)

ఝామాశాహ :— యువరాజా! మీరీ పుష్పహారము వారి మెడలో వేయుడు.

అమరసింహుడు :— (పుష్పహారము వేయుచు) ఏకలింగేశ్వరా! తమ కభినందనములు.

మానసింహుడు :— (ప్రసన్నతతో) యువరాజా! ధన్యవాదములు! కుశలమేకదా! (నలువైపుల పరికించి) దాదాజీ గారి దర్శనము కాలేదే?

ఝామాశాహ :— వారు మిమ్ము కలిసికొన జాలనందుకు నా ముఖతః తమ విచారము వెలిబుచ్చుచున్నారు. దయ చేయుడు, కొంచెము విశ్రమించి మార్గాయాసము బాపుకొనుడు. మిగిలిన విషయములు నిదానముగ మాట్లాడుకొందము.

మానసింహుడు :— తమ యిష్టానుసారమే కానిండు! నాకు సైత మిప్పుడు విశ్రాంతి యవసరమై యున్నది.

ఖామాశాహ :— తమరీ మృదుశయ్యపై విశ్రమింపుడు. ఈ ప్రదేశమున చల్లనిగాలి కొల్లగ రాగలదు !

మానసింహుడు :— ఈ ప్రదేశము మంద మలయానిలముతో గూడి యుండుటేగాక ఈ పర్వత ప్రాంతమందలి ఈ భవనము ప్రకృతి రమణీయముగ నున్నది. సరే ! మీరు నా కొరకు శ్రమ గైకొనకుడు !

ఖామాశాహ :— (ఆసీనులైనవారితో) మనమిక పోవుట మంచిది. మహారాజావారు విశ్రమింతురు. యువరాజా! మనము కూడ పోవుదము రండు.

( అందరు నిష్క్రమింతురు. )

మానసింహుడు :— (స్వగతముగ) ఆహా ! ఈ మందిరమెంత సుందరముగ నలంకరించిరి? మేవాడ మహారాణా వలన ఘన సన్మాన మందుదునని నేను కలలోనైన తలచి యుండలేను. ఈనాటి సంరంభము చూడ రాణావారు పూర్తిగ అక్బరు సామంతు డగుటకు నిశ్చయించుకొన్న ట్లున్నది. లేకున్న నాపై నింత ప్రత్యేక శ్రద్ధ గైకొని ఖజానాలోని ధనమిట్లు మంచినీళ్లప్రాయముగ ఖర్చు చేసి యుండడు. ఈ స్వాగత సన్నాహములు నా యభీష్టసిద్ధి భవనమునకు స్వర్ణసోపానములు.

సంపద లంతరించుట భృశంబుగ నాపదలెల్ల నిండి భూ
కంపములౌచు నూహలను కట్టడముల్ పెకలించివేయుటల్
లంపులమారి దైవము గళంబెగనెత్తి విషాద గీతికల్
సొంపుగ పాడుచుండుటయుచూచి ప్రతాపుడు నాకులొంగెడిన్.(1)

( నేపథ్యమున సంగీతము ప్రారంభమగును )

## పాట — అనుబంధము — 6.

మానసింహుడు :— (స్వగతముగ) ఏమి ఈ పాటధ్వనితోబాటు నా సుఖ స్వప్నములు గూడ కరగి పోవుచున్నవి. ఇది నా అభిమానమునకు గొడ్డలిపెట్టు ! (కొంచెమాగి) కానిమ్ము ! ఈ గీతము నన్ను ప్రబోధించినది. ఈ స్వాగతము, ఈ విడిది నా అవమాన నాటకమునకు నాందీ ప్రస్తావనలై ఈ గేయము ప్రథమాంకమైనది. ఈ అవమానము గరళకంఠునివలె గొంతులో దాచెదను. కాని— ఈ యవమాన విషయము వీరిని బూది గావింపక పోదు. ఇచ్చటి ఆహార విహారాదులే కాక ఉచ్ఛ్వాస, నిశ్వాసములు సైతము విష మిళితములై యున్నవి. రాణా నా అభ్యర్థనను ఘోరముగ తిరస్కరించి తీరును. మానసింహుడీ తాటాకు మంటలకు వెఱచువాడు కాడు. ఇక్కడివారు అక్బరు పాదుషాను గూడ నింతకన్న నధికముగ సన్మానింపబోరు. నన్నవమానించుచున్న వీరు వీరి మరణ శాసనమును లిఖించుకొను చున్నారు. (అమరసింహునితో భామాశాహ వచ్చుచుండుట చూచి) అదుగో ! వీరాధివీరులు వచ్చుచున్నారు. కపట మభినయింతును గాక, (ప్రసన్నతతో) రమ్ము కుమారా ! రండు మహామంత్రీ ! మీ యుత్సాహము, కార్య దక్షత ప్రశంసనీయము. నాకు మీ రొనర్చిన ఈ కృత్యము చిరస్మరణీయము ! మంత్రీ ! తమ కార్య దక్షత, సాహసము

నాకు నచ్చినవి. తమ యుదారత, శ్రమ, సౌజన్యము వన్నెకెక్కు రోజులు రాకపోవు.

ఖామాశాహ :— మహారాజా ! అంతపొగడికలు నా కెందుకు లెండు. ఈ అల్పున కంత యదృష్టమెందుకు ? నేను మహారాణా యాజ్ఞ నిర్వర్తించిన వాడను కాని స్వతంత్రించిన వాడనుకాను. అదుగో ! మాటల సందడిలో బడి మరచితిని. (అమరసింహునితో) యువరాజా ! మహారాజులుంగారికి భోజనవేళ యతిక్రమించుచున్న దని గుర్తుచేయుడు.

మానసింహుడు :— మరల యువరాజున కంత శ్రమయేల ! నేనే వచ్చుచున్నాను. నడువుడు.

( అందరు నిష్క్రమించుదురు. )

[ తెర వ్రాలును. ]

## ( ఏడవ దృశ్యము )

(అమరసింహుడు, ఖామాశా, మానసింహుడు ప్రవేశించియుండ తెరయెత్తుదురు.)

ఖామాశాహ :— మహారాజా ! ఉచితాసన మలంకరింప ప్రార్థన.

మానసింహుడు :— మహారాణా వారిని రానిండు. తొందరేమి కలదు?

ఖామాశాహ :— తమ రాసనమలంకరింపుడు.

(మానసింహు డుచితాసనమున గూర్చుండును. పాలు, శాకాహార ములు, మధుర పదార్థములు రజితపాత్రలతో నింపుకొని బంగరు పాత్రలో దీసికొనివత్తురు)

మానసింహుడు :— (రెండు నిముసములు రాణా కొఱకెదురు చూచి) మంత్రిశేఖరా ! స్వర్ణపాత్రలలోని భోజన పదార్థములు చల్లనారు చున్నవి. కాని— రాణా వారింత వరకు రాలేదేమి ? వారు రానందున నీవిందు శోభాహీనముగ నున్నది. వారితో బంతిలో కూర్చుండి భుజించు వాంఛ మిక్కుటముగ నున్నది.

భామాశాహ :— మహారాజా ! రాణావారికనారోగ్యముగ నున్నందున రాలేకున్నారు. తమ బదులుగ యువరాజు అమరసింహుని మీ సహపంక్తికి పంపియున్నారు.

మానసింహుడు :— (కొంచెము కోపముతో) ఇతనితో నాకేల ? రాణా లేనిలోటు వారిరాక వలననే తీరును.

అమరసింహుడు :— మహారాజా ! నేను త్రికరణ శుద్ధిగ తమ కాతిథ్యమిచ్చుచున్నాను. దాదాజీగారు (తండ్రిగారు) రాలేదను కించ వదలి భుజింపుడు.

మానసింహుడు :— నేను మీ కూటికి మొగమువాచి రాలేదు. రాణాగారి గౌరవము కోరివచ్చితిని. వారు రానినాడు నాకీ మధురపదార్థములు విషతుల్యములే !

భామాశాహ :— (వినయముతో) మీ కిట్లాగ్రహింపనేల ? రాణాకు యువరాణాకు భేదమేమికలదు ? ఉదయ భానుడు తరుణ భానునివలె చీకట్లు పోద్రోలజాలడా ?

మానసింహుడు :— మీరన్నది నిజమే కాని — మధ్యాహ్న సూర్యునివంటి తేజస్వి కాజాలడు !

భామాశాహ :— ఇంతకు రాణాగారి కనారోగ్యముగ నున్నది కదా ! వారెట్లు వచ్చి భుజింపగలరు !

మానసింహుడు :— ఇది నిజమగు ననారోగ్యము కాదు. ఇది మతోన్మాద జనితమైనది. నా పంక్తిలో కూర్చుండి భుజించిన నాతని కులగౌరవము కళంక మగును. ఇది నిజమైన కారణము. బుద్ధి కుశలుడవగు నో మంత్రీ ! యీ అసలు కారణము తెల్పక బహు కారణములేల తెల్పెదవు ? కావున నేను కోరు సహాపంక్తి భోజన గౌరవము యువరాణా కాదు. ఆ హిందూ కేసరి, మేవాడ నిష్కళంక కులచంద్రుడు రాణావారే కావింపవలయును. అంతవరకీ మానసింహుడు అన్నము మెతుకేనియు ముట్టడు.

భామాశాహ :— మహారాజా ! మేము మనవిచేయు కారణము కాదని మీ రితర కారణము లూహించిన మేమేమి మనవి చేయగలము. మీరు దయయుంచి భుజింపుడు.

మానసింహుడు :— (కోపముతో) మహామంత్రీ ! మండెడు మంటపై నేయి పోయకుడు ! నేడు మీరు నా కొనరించిన యవమానము నా శునకము గూడ సహింపజాలదు. నా ప్రత్యాణువు భగ్గుమని మండిపోవుచున్నది. ఇది ఆతిథ్యము కాదు. అవమానము. నేనింతదూరము పని

కట్టుకొని వచ్చుటిందుకేనా ? ఉపేక్షను సైరించుట నా స్వభావమునకే విరుద్ధము. కాని - నే నన్న దేవతను తిరస్కరింపను. ఈ రెండు మెతుకులు శిరమందుంచుకొందును. (అట్లే చేయును) ఇదే నా ప్రతిజ్ఞ మీ రాలకింపుడు.

రాణా శిరోబాధ రామబాణమువంటి
ఔషధంబున దీర్ప నరుగువాడ !
మొగలు కత్తులచేత తెగిన మీ కుత్తుకల్
మేవాడ ధరణికి సేవజేయు
ఈనాటి రాణాకు ఈ నా పదంబులే
శరణుజొచ్చు నవస్థ సలుపువాడ !
తన శిరోబాధ భూతమై తనను బట్టి
పిండి వేయగ నెన్నాళ్లు మొండికెత్తు ?
యీ ప్రతాపుడు దైన్యంబు మిగిలిపోవ
నన్ను సేవింప బూను దినంబు వచ్చు. (1)

(తొందరగ తెర త్రోసికొని రాణా ప్రతాపసింహుడు ప్రవేశించును.)

ప్రతాపసింహుడు :— (కుడిచేతిని తిరస్కారముగ నెత్తి) అక్బరు దాసుడవగు నో శునకమా! నీ యుత్తరకుమార ప్రతిజ్ఞలు ముగిసినవా ? సింహము గుహలో నిద్రించుచున్నదని తలచి యేల మొఱిగెదవు ? మేవాడకేసరి సిద్ధాంతములు నీకు పిరికివాని కారుకూతలైనవా ? అట్లు నీవు తలచి యిసుక రేణువులనుండి నూనె పిండెదవా ? తురుష్క సేవకుడా ! నీతో సహపంక్తి భోజనము కావించి నా నిష్కళంక వంశము కళంక పరచుకొమ్మం

దువా ? నీ గాలి సోకిన ప్రదేశము సైతము వర్జింప వల యును. నీ కాకలియైనచో నెదుటి పాత్రలలోని తిండి తిని పొమ్ము ! మీకు నాకు మొగలు బాంధవ్యముతో నెన్నడో రక్త సంబంధములు తెగిపోయినవి.

యుద్ధము యుద్ధమంచును మహోగ్రముగా వచియించు నీ యసం
బద్ధపు కారుకూతలకు బాపురె బెగ్గిలువాడు కల్గునే ?
క్రుద్ధుడవేని యుద్ధమునకున్ తగు కాలము నిర్ణయింపు మీ
పద్ధతి లెస్స కాదనుచు వ్యర్థము సేసెదవేల కాలమున్. (2)

మానసింహుడు :— ప్రతాపా ! చాలు చాలు నోరు మూసి కొనుము. ఈ భోజన గృహమేల రణభూమి కావింతువు. అతిథినైన నేను పోరరాదని సైరించితిని. నీ యమ్ములపొదిలో బాణములు లేవా? వాగ్బాణము లేల సంధింతువు ?

వీరునకున్ వివాద మనిపించునె గౌరవమంచు ? కత్తితో
నీ రణకండు వీగెదను నీవును నాలుక తీట తీరగా
సైరణదక్కి వాగకుము స్వచ్ఛపరాక్రమ ముల్లసిలగా
మారణహోమమున్ సలుపుమా! చురకత్తిని బిగ్గబట్టుమా! (3)

ప్రతాపసింహుడు :— వహవా! గ్రామసింహామా! గర్జనలు చాలింపుము. నా యతిథివి కాకున్నచో నేడు నీవు యముని దర్శించి యుండెడివాడవు ! ఛీ నీముఖము చూచిన పాపము తటస్థించును.

మానసింహుడు :— నేను దూరమాలోచించి సెలవు గైకొను చున్నాను. ఇంకొకమారు అతిథిగా గాక మీ పాలిటి

యమదూతగా వచ్చి నీ కారుకూతలకు నీచే క్షమాపణ చెప్పించెదను.

ఒక సైనికుడు :— పో పొమ్ము! చేతగాని బీరములేల పలికెదవు? నీకు మృత్యుదేవీ పరిష్వంగము లభింపనున్నది. నీకు తోడు నీ చెల్లెలి తురకమగడు అక్బరును, నీ తురక మేనల్లుడు సలీమును తోడు తెచ్చుకొనుము.

మానసింహుడు :— ధూర్త ప్రతాపా! అతిథినగు నన్ను నీ సామాన్య సైనికుని చేతను అవమానము చేయింతువా? దీని ప్రతిఫలము ముట్టచెప్పెదనుగాక! మేవాడ సింహాసనముపై పిడుగు పడనున్నది. ఈ గొడుగులను బటి కాచుకొందువుగాక! సెలవు!

(అని దురుసుగా వెళ్లిపోవును.)

ప్రతాపసింహుడు :— తప్పించుకొని పోయినాడు! పిరికిపంద పారిపోయినాడు. నా గృహ మపవిత్ర పరచి మానసింహ ప్రేతము నడచిపోయినది. ఖామాశాహాజీ! ఈ ప్రదేశము త్రవ్వించి గంగాజలముచే ప్రక్షాళింపజేయుడు. మీరు సచేల స్నానముచేసి యజ్ఞోపవీతముల మార్చుకొనుడు. ఈ పాత్రలను ధూళిగావింపుడు. నేను లేగలతోగూడిన గోవుల విప్రులకు దానముచేసి ఏకలింగేశ్వరు నారాధించి ప్రాయశ్చిత్తము కావించుకొందును. సామంతులారా! తొందరపడుడు. రణదుర్గ మేవాడపై విహరించు ముహూర్తము సమీపించుచున్నది. మీరెల్లరు సిద్ధ

పడుడు. మేవాడ నవమానించు తుచ్ఛులకు బుద్ధిచెప్పుడు. మాతృభూమికి ప్రాణములతో నివాళి నొసగ సిద్ధపడుడు.

సామంతులు :— మేవాడ గౌరవ రక్షణకు మా తుది నెత్తురు బొట్టున్నంతవరకు పోరెదము. మీరు అనుమతించుచో ఢిల్లీ సింహాసనము కూకటివ్రేళ్లతో బెళ్లగింతుము. మా పరాక్రమములు స్వర్గమునుండి వీక్షించి రాణా సాంగల్, బప్పారావల్ ప్రభృతు లానందింతురు గాక !

ప్రతాపసింహుడు :— ధన్యవాదములు సామంతులారా ! మీ వాక్యములు ప్రశంసనీయములు. నేటి ఈ దుస్సంఘటనచే నాకు మీకు చీకాకుగనున్నది. పోయి విశ్రమింపుడు. నే నేకలింగేశ్వరుని దర్శింతును.

( అందరు నిష్క్రమింతురు. )

[ తెర వ్రాలును. ]

# ఖా మా శా

## ( చతుర్థాంకము — మొదటి దృశ్యము )

స్థలము — ఖామాశాహ భవనము;
సమయము —— మధ్యాహ్నానంతరము

(ఖామాశాహ మనోరమలు ప్రవేశించియుండ తెరఎత్తుదురు)

మనోరమ :— నాథా ! తాము మహారాణావారి కడనుండివచ్చి ఒక గడియయైన విశ్రాంతి గైకొనక మరల నెచ్చటికో పోవుటకు దలచుచున్నారే ? మరల నేదైన నవసర కార్యము తటస్థించినదా? ఏమో దీర్ఘముగ నాలోచించుచున్నట్లున్నారు ? అవునుకాని— మానసింహుని రభస యేమైన ఫలితమునకు వచ్చినదా ?

ఖామాశాహ :— ప్రాణేశ్వరీ ! సమస్య జటిలము కానున్నది. మానసింహుని పుణ్యమున మేవాడ రణక్షేత్రము కానున్నది.

మనోరమ :— ఓహో ! ఆనాడు జరిగిన రసాభాసమును బట్టి యీస్థితి తప్పక తటస్థించునని నమ్ముచునే యున్నాను. ఢిల్లీవార్తలేమైన క్రొత్తగ దెలిసినవా?

ఖామాశాహ :— ఆఁ తెలిసినవి! మానసింహుడు ఢిల్లీచేరులోపునే నేనొక గూఢచారుని పంపితిని. అత డరుదెంచెను.

మనోరమ :— అచ్చటి సంఘటనముల వివరముగ సెలవిండు. వినుటకు తహతహ పడుచున్నాను.

భామాశాహ :— మానసింహుడు ఢిల్లీ చేరునప్పటికి సోలాపుర విజయోత్సవములు ప్రారంభించిరట ! మానసింహుని స్వయముగ నభినందించుట కక్బరు ప్రత్యేక సమావేశ మేర్పరచినాడట. మానసింహుని విషాదగంభీర వదనము చూచి యక్బరే దరిజేరుటకు జంకెనట ! రాజనర్తకు రాండ్ర కాలిగజ్జలు, వైణికుల అంగుళులు మ్రోగబోయి యాగినవట ! అక్బరెంతో బ్రతిమాలగ నితడు తన వ్యథ చెప్పినాడట!

మనోరమ :— ఒంటెలపెండ్లికి గాడిదలు పాటలు పాడినవట ! ఉక్బరెట్లోదార్చె నీమహానుభావుని?

భామాశాహ :— మానసింహుడు తన నీచ ప్రవర్తనకు లజ్జింపక కన్నీళ్ళతో రంకుమగ డొసరించిన అవమానము సొంతమగనితో చెప్పుకున్నట్లు దీనముగ నివేదింప నక్బరు రోషకషాయితుడై పచ్చని మేవాడను శ్మశానముకావింప సైన్యముతో, శాక్తసింహునితో, సలీముతో హల్దీఘాటున కీతనిని పంపినాడట !

మనోరమ :- యవనులకు రాజపుత్రులకేగాక రాజపుత్రుల కన్యోన్యము పోరు జరుగునా? ఐనను మానసింహుడు వచ్చుటలో వింతలేదు. శాక్తుడెట్లు వచ్చుచున్నాడు ? ఇంతకు మీ సన్నాహము లెట్లున్నవి?

భామాశాహ :— శాక్తు ప్రకృతి కది సహజమే ? ఇప్పుడే హారావళి శిఖరములపై రాజపుత్రలోకము సమావేశము కానున్నది. నా కొరకెదురు చూడకుము. నేను బహుశః ప్రొద్దుపోయి వచ్చెదనేమో.

( నిష్క్రమించుదురు. తెరవ్రాలును. )

## ( రెండవ దృశ్యము )

### స్థానము - హారావళి శిఖర పరిసరప్రాంతము
### సమయము - సూర్యాస్తమయ వేళానంతరము

(స్వచ్ఛ మలయవాయువు. ఆకసమున చుక్కలమధ్య చందమామ. అక్కడక్కడ మిణుగురు పుర్వులు. రాణా ఆలోచనా పరిషత్తు. సాలం కృతశిలావేదికపై రాణా, సమీపమున భామాశాహ, ఎదుట కేసరిపతాక; ఒకవంక సామంతులు, రసపుత్రులు, మరొకవంక భిల్లురుండ తెరయెత్తుదురు.)

భామాశాహ :— (లేచినిలువబడి) మేవాడ వీరులారా! అవమానితుడగు వీరసింహు డపారసేనతో దండెత్తి వచ్చుచున్నాడని చారులు తెల్పిరి. కర్తవ్య నిర్ణయమున కీసభ రాణాగారేర్పరచిరి. సముచితనిర్ణయ మొనరింప ప్రార్థన.

ప్రతాపసింహుడు :- అసహాయ శూరులారా! మానసింహుడు దండెత్తిన యీపరిస్థితిలో మేవాడ రక్షణ కేయేచర్యలు గైకొనవలెనో పరిషత్తు నిర్ణయింప వలసియున్నది. తమ తమ సలహాలొసగ ప్రార్థన.

భామాశాహ :— రాజా! ప్రమాదమేఘ విచ్ఛిన్నతకు మేవాడ భాస్కరులు మీరుండ మాకు కొదువేమున్నది. ఐనను మనము, మన పక్షమువారు, సానుభూతి గలవారగు రాజులను సేనలతో తోడ్పడ కోరవలయును.

ప్రతాపసింహుడు:-ఈ రణయాత్ర యందెవ్వరెవ్వరు మనకుసహాకరింతురో యోచింపుడు. ఐనను ఇది ఒకరింటి పని కాదు.

అసలిది రణముకాదు. తీర్థయాత్ర! దేవుని పెండ్లికి పది మంది పెత్తనమన్నట్లు మేవాడ స్వాతంత్ర్య రక్షణలో ప్రతిరసపుత్రునకు బాధ్యతయున్నది. దీని కెవ్వరెవ్వరి నాహ్వానింప వలయునో తెలియజేయుడు. కార్యసిద్ధి క్షణములమీద కావలసియున్నది.

భామాశాహా :— మహారాణా! గ్వాలియర్ రాజు రాజా రామ శాహా, మాలుంద్రా సర్దారు కళ్యాణసింహాజీ మొదలగు వారినెల్లర నాహ్వానించు మాత్రముననే బయలుదేరి రాగలరు. నేను రేపుదయ మందరి నాహ్వానింతును.

ప్రతాపసింహుడు :— మంచిది. అట్లే కావింపుడు. నా యుద్యమమునకు మూలస్తంభములైన సామంతులారా! మేవాడ రక్షణభారము నేడు మీభుజములపై బడినది. ఈ సదవకాశము సదుపయోగపరచి మాతృ దేశోద్ధరణము కావించి క్షత్రియు లనిపించుకొనవలయును. రణమున వీరవిహారము కావించి మాతృస్తన్యములకు గౌరవము కల్పింపుడు. తుదినెత్తురుబొట్టున్నంతవరకు పోరుదురని విశ్వసించు చున్నాను.

సామంతుడు :— మేవాడ భాగ్యవిధాతా! మీరీవిషయము మాకింతగా జెప్పవలయునా? దేశోద్ధరణ మహాయజ్ఞమున సర్వస్వత్యాగమొనరింప జూచు మమ్ము విశ్వసింపరా? మేవాడ స్వాతంత్ర్య రక్షణకై యూపిరున్నంత వరకు పోరితీరుదుమే కాని పిరికిపందలమై జాతికి, నాయకునకు, పెద్దలకు తలవంపులు తేము.

ప్రతాపసింహుడు :— సామంతశేఖరా ! మీ ధీరోదాత్త వాక్యము లానందపరచినవి. మాటలను మించిన పోటరులు మీరు.

భిల్లనాయకుడు :— మహారాణా ! ఇక మావిషయము వినుడు. మా జాతిలో కుట్ర, కల్మషము లేదు. పసిపిల్లవాడు మొదలు ముసలివాని వరకు నీదీక్షలో బలియగుటకు నిర్ణయించుకొన్నారు!

పడమటి దిక్కునం దహిమభానుడు తా నుదయించుగాక! తాఁ
గడలి జలమ్ము లింకి యొకగర్తము నైనను నౌను గాక! తా
వడవడగా వణంకి హిమవంతము సంతసమీగు గాక! భి
ల్లుడొక డొకప్పుడేని యెదలో దలపోయడు ద్రోహచింతలన్.(1)

ప్రతాపసింహుడు :— నాకు మీరు కావించగల సహాయ మితరు లెవ్వరు కావించ లేరని నా సుదృఢ విశ్వాసము. మీ సుదృఢసంకల్పమునకు నా ధన్యవాదములు. (భామాశాహాతో) మీరు సామాన్య ప్రజలందరు సైన్యములో జేరునట్లు రాజాజ్ఞగా దేశమందంతటను జాటింపుడు. సకల సన్నాహములతో తరలి రావలసినదని మీసోదరుడు తారాచందుగారికి వర్తమానము పంపింపుడు.

భామాశాహా :- రాణాజీ ! రేపీపాటి కెందరు యువకులు సేనలో చేరుదురో మీరే చూచెదరుగాక ! వీరతేజోనిధు లగు నవయువకుల యుత్సాహము మీ రెరుగనిది కాదు. మాతమ్మునకు నిదివరకే వర్తమానము పంపియున్నాను. రేపు సూర్యోదయమునకు ముందుగనే యాతడిచ్చటకు రాగలడు.

ప్రతాపసింహుడు :- మంచిది. చాలరాత్రిగడచినది. నేటికీసభను చాలింతము.

భామాశాహా :- (సభాసదులతో) తమరంద రిప్పుడరుగవచ్చును.

( అ ం ద రు ను ని ష్క్ర మిం తు రు. )

[తె ర వ్రా లు ను.]

## ( మూ డ వ దృ శ్య ము )

స్థలము—భామాశాహ భవనము; సమయము—మధ్యాహ్నము

(భవనము ముఖద్వారములోని భాగమున ఇరువైపుల స్వస్తిక చిహ్నము. మధ్యలో చక్కని అక్షరములతో 'అహింసా పరమోధర్మః' అని వ్రాసియుండును. ఎదురుగ జైన తీర్థంకరులగు శ్రీ శాంతినాథుల చిత్రము. భామాశా, తారాచంద్రులు గూర్చుండియుండ తెరయెత్తుదురు.)

భామాశాహా :— సోదరా! మేవాడ రణదుర్గ విలయ తాండవమునకు రంగస్థలము కానున్నది. ఈ యుద్ధమున పాల్గొనుటకు నిన్ను పిలువనంపితిని. ఈ వీరరస ప్రధానభూమికకు మహారాణా ప్రతాపసింహుడు నాయకుడు! మన మిందు పాల్గొని మన మన పాత్రలు చక్కగ నెరవేర్ప వలసియున్నది.

తారాచంద్ :— స్వాతంత్ర్య దేవతా ప్రధానార్చకుడగు రాణావారి ననుసరింప వలసినదే కాని....

భామాశాహా :— ఏమా కాని- ఆ పిదపనేమి? వివరముగ తెలియజేయుము. నీ సందియముల దీర్తును.

తారాచంద్ :— సందేహమేమున్నది. కాని- అన్నయ్యా! మనమింతవర కహింసావలంబకులము కదా! నేడు మనము రణక్షేత్రమున విరోధిసైన్యమును పంటచేను కోసినట్లూచకోత కోయవలయునే? అప్పుడు మన యహింసాధర్మము హింసాధర్మము కాదా? మనము ధర్మ చ్యుతులము కాకుండగలమా?

భామాశాహ :— ఇది ధర్మయుద్ధమేకాని యధర్మయుద్ధము కాదు. ఇందు పాల్గొన్న మనము ధర్మచ్యుతులము కాము! ధర్మకేసరియగు నహింసాధర్మము ధర్మరక్షణకు కావించు హింస యహింసయని నిర్వచించుచుండ గొఱ్ఱెలమందలవంటి సామాన్యధర్మము లనుసరించి సామాన్యునివలె సంశయ మొందెదవేల?

తారాచంద్ :— శత్రువుల హింసించుట యహింసయైనచో లోక మున నహింసకాని దేదియుండును?

భామాశాహ :— ముక్కుమూసికొని యడవులలో తపించు మునులు సహితము హింస కావింపక తప్పించుకొన జాలకున్నారు. నీ దృష్టి ప్రకారము పరిశీలించిన నహింస లోకమందేరికిని సాధ్యముకాదు. ఆతతాయిని వధించుట దోషముకాదు. ఇది గృహస్థ ధర్మము. గృహస్థు న్యాయరక్షణకు పాటుపడవలెను. నీ కింకను సందేహము తీరనిచో జైనాచార్యులు సోమదేవులిట్లు సెలవిచ్చి యున్నారు.

యః శస్త్ర వృత్తి స్సమరే రిపుస్స్యాత్
యః కంటకోవా నిజమండలస్య
అస్త్రాణి తస్యైవ నృపాః క్షిపన్తి
నదీనకీనా నశుభాశయేషు॥

— (యశస్తిలక్)

అనగా రాజు శత్రువులమీద, దేశద్రోహులమీద బాణముల ప్రసరింప జేయవలయునేకాని దీనులందు సజ్జనులందు కాదు. కాన మనము దేశ రక్షణకు యవనుల నిర్జించుట ధర్మవ్యతిరిక్తముకాదు. ఆత్మరక్షణకు చేయు హింస యహింసయేయని పెద్దల యభిప్రాయము.

తారాచంద్ :— సోదరా! సోమదేవాచార్యుల సూక్తులు మంచివేకాని ఆచార్యులుసైతము మానవ మాత్రులే కదా! సర్వజ్ఞులు కానివారి వాక్యములు మనకు ప్రమాణములా! తీర్థంకరులేమైన నీ విషయమున తమ అభిప్రాయములను సెలవిచ్చియున్న మనము విశ్వసింప వచ్చును.

భామాశాహ :— తీర్థంకరు లుపదేశింపలేదు కాని కొంతవర కీవిధముగ నాచరించియే యున్నారు. నీ సమీపమున గల గోడపై వ్రేలుచున్న చిత్రఫలకము కాంచితివా? అందు పదునారవ తీర్థంకరులగు శ్రీ శాంతినాధుల రూపము కలదు. వారు రాజ్యాధికారము నిర్వహించు సమయమున దిగ్విజయము కావించి శత్రుల చీల్చి చెండాడిరని సామంతభద్రుడిట్లు సెలవిచ్చియున్నాడు.

చక్రేణ యః శత్రు భయంకరేణ
జిత్వా నృపో సర్వనరేంద్ర చక్రమ్
సమాధి చక్రేణ పునర్జిగాయ
మహోదయో దుర్జయ మోహ చక్రమ్॥

—(బృహత్స్వయంభూస్తోత్రమ్)

శత్రు భయంకర సైన్యముచే రాజులగెల్చి మహోదయుడగు శాంతినాధుడు సమాధిచే నరిషడ్వర్గమును జయించెననిరి. ఇందువలన జన్మచే నహింసావాదులైన మహానుభావులు గృహస్థాశ్రమమున న్యాయధర్మ సంరక్షణార్థము హింస కావించవచ్చునని వచించుట మనము ప్రమాణముగా గైకొనవచ్చును. నీ కిప్పుడు అహింసావాదము చక్కగ బోధపడినదని విశ్వసించుచున్నాను.

తారాచంద్ :— సోదరా ! తెలిసినది కాని పూర్తిగ సందేహము తీరలేదు. గృహస్థులు హింస కావించు నధికారము కలిగియున్నచో వారి కహింసా పాలనా నియమమేల ?

ఖామాశాహ :— నీవాదము మరల మొదటికే వచ్చుచున్నది. నీ వీ చర్చలలో పాల్గొనని కారణమున చేడిట్లనుచున్నావు.

తారాచంద్ :— మీ రన్నట్లు నా యనుభవము లోపమువలననే నాకీ సందేహము తీరకున్నది. నేడు దీనిగూర్చి తర్క వితర్కములు పెంచుకొన పనిలేదు. సర్వస్వహానికరమగు మహా ప్రమాదము మిన్నువిరిగి మీదబడనున్నది. ఆ ప్రమాద విముక్తికై మన మహింసా ధర్మము త్యజించినను దోషముకాదు.

భామాశాహ :— నాయనా ! మన మహింసా ధర్మము త్యజింప బనిలేదు. గృహస్థులకు సంకల్పి, విరోధి, ఆరంభి యని యహింస ముప్విధములు. గృహస్థులు సంకల్పిని త్యజింప వలెను. మనది ధర్మయుద్ధము !

తారాచంద్ :— మంచిది. అహింస కనేకార్థములు కలవు. దేశ, ధర్మ, సంస్కృతుల రక్షణకు దీక్ష వహించిన వీరుడు శత్రువుల చంపినను అహింసాధర్మపాలకు డనియే శాస్త్రము చెప్పుచున్నది. ఇదియే అహింసయొక్క ఔదార్యము ! తెలియనివారు అహింసను దుర్బలుల యొక్క దీనులయొక్క సొత్తనుకొందురు. నిజమైన అహింసావాది మహావీరునివంటివాడు ! యీ నాటికి నాకు జ్ఞానము కల్గినది.

భామాశాహ :— నాయనా ! నాకానందము కలిగినది. ఈ నీ ప్రసంగము ప్రశంసనీయము. బాహ్య శత్రువుల జయించిన వాడు తప్పక యంతశ్శత్రువుల గెలువగలడు. ఇక రణ సన్నాహములు కావింపుము.

తారాచంద్ :— సోదరా ! సన్నాహముల కేమి ! ఈ నిముసమే నా బొందిలో ప్రాణములుండు వరకు మేవాడ రక్షణకు వెనుతీయక పోరుదునని మీ పాదముల సాక్షిగ ప్రమాణము చేయుచున్నాను.

భామాశాహ :— (కౌగలించుకొని) నాయనా ! పరమానంద ముగనున్నది. చిరంజీవ ! సుఖీభవ !

( ఇరువురు నిష్క్రమింతురు. )

[ తెర వ్రాలును. ]

## (నా ల్గ వ దృ శ్య ము)

స్థలము—భామాశాహ శయనాగారము.

సమయము—రాత్రి మూడవజాము.

(యుద్ధము ప్రారంభించు నాటికి ముందటిదినము రాత్రి. పాన్పు మీద భామాశాహ కూర్చుండియుండ, ప్రక్క మనోరమ నిలచియుండ తెరయెత్తుదురు.)

భామాశాహ :— మనోహారి! మానసింహుని దుస్సాహసము చూచితివా ? మాతృ పృథ్వీ రజోలేశము నుదుట సిందూరముగా ధరింపదగిన మానసింహుడు యవనరాజునకు కావలికుక్కయై మాతృభూమి నాక్రమింప వచ్చుచున్నాడు!

మనోరమ :— నాథా! ఆతని మూర్ఖత నాకు విస్మయము కల్గించుచున్నది. వాని సేనావిన్యాసము తెల్పుడు.

భామాశాహ :— ఖమనారుదాటి రక్తతలయ్యాయొద్ద నాతని సేన విడిసియున్నది. సూర్యోదయమగుటతోడనే యిరువాగులపోరు ఘోరముకాగలదు. ఈయుద్ధ సంరంభముల వలన నిక నీయోగక్షేమము లారయు నవకాశమే నాకు లభింపకున్నది.

మనోరమ :— మీరిందులకు విచారింప బనిలేదు. మాతృ దేశోద్ధరణము మన ప్రధాన కర్తవ్యము!

భామాశాహ :— ప్రియా! పట్టుమని పదినాళ్ళయినను నేను నిన్ను సుఖపెట్టియుండలేదు. ఇక ముఖముచూచు నదృ

ష్టముకూడ కరవగును కాబోలు. నావంటి దౌర్భాగ్యున కిల్లాలి వైతివి. రాజకీయములను సుడిగుండములలో దేశనౌకను రక్షించు బాధ్యత నాకు మరిదేని కవకాశము కల్గించుటలేదు,

మనోరమ :— మీ యీ దీన దుర్బల వాక్యములు సన్నవమాన పరచుచున్నవి.

యోగ్యులరైన మీరలిటు యోచనమాని వచించినారొ దౌ
ర్భాగ్యమటంచు దేనినది భాగ్యములక్ బరమోత్తమంబు నా
భాగ్యము దేవనాయకుని భార్యకునైన దుర్లభంబు సౌ
భాగ్యముగా దలంచెదను ప్రాణసఖా ! యిటులాడబోకుడీ! (1)

భామాశాహ :— ఇందుగల సౌభాగ్యమేమి ?

మనోరమ :— తమవంటి మాతృదేశోద్ధారకునకు, కర్మయోగికి, ధార్మిక జీవనునకు నిల్లాలై సేవించి తరించుట మహాసౌభాగ్యముకదా! ప్రభూ! ఉత్తమురాలికింతకన్న నేమి వాంఛితముండును ?

భామాశాహ :— ప్రాణేశ్వరీ ! నీ మధురాలాపములు నాబాధ నుపశమింపజేసినవి. నీప్రేరణమున నా యుత్సాహము బహుధా వృద్ధిచెందినది. ఇక నాకు రణరంగమున బాధాకరమైనదేదియు లేదు. నీ ప్రసన్నవదనము శుభాశయములే నాకు యుద్ధమున విజయ కారకములు ! ఇక ప్రయాణమున కనుమతింతువా ?

మనోరమ :— ప్రాణేశ్వరా ! మీర లిట్టైహిక బంధములగు, భార్యా, ధన, భోగములపై మమతవదలి కర్తవ్యపాల

నకై హార్షాతిరేకమున రణభూమికి బయలుదేరుడు. భగవాన్ పార్శ్వనాథుడు, ఏకలింగేశ్వరుడు మేవాడ నుద్ధరించి మిమ్ము రక్షింతురుగాక ! మీ పౌరుష బలసంప దలు లోకవిశ్రుతములై విజయలక్ష్మిని వరింతురుగాక ! మీ ప్రసన్న దేదీప్యమాన ముఖారవిందను దర్శించు భాగ్యము నాకచిరకాలమున కలుగును.

భామాశాహ :— మనోరమా ! నీయభీష్టము నాదేవత లను గ్రహించుదురుగాక ! ప్రాగ్దిశాగర్భమునుండి ప్రభాకరు డుదయించు ముహూర్తము సమీపించుచున్నది. లెమ్ము. నా శస్త్రాస్త్రము లందించుము. రాణాకన్న ముందుగ నేను హోల్దీఘాట్ చేరవలసియున్నది.

(మనోరమ లేచి అస్త్రశస్త్రములు ధనుస్సు గొనివచ్చి యిచ్చును. భామాశాహకు నొసగుచు, ఈ క్రింది పద్యములు పఠించును.)

అమృతంబు గొనితేర నరిగెడు గరుడికి
మాత వినతగూర్చు మంగళంబు
అదితి నిశాచర హరణంబునకు నేగు
మఘవున కొసగిన మంగళంబు
త్రైవిక్రమంబు నుపక్రమింపగబోవు
నంగజుపితకైన మంగళంబు
పగవారి పయిబోవు పరశురామునకును
మాత రేణుకగూర్చు మంగళంబు
మాతృ దేశోద్ధరణ కేగు మాన్యజనుల
కెట్టి మంగళ మిల్లాంధ్రడు నిత్తు రట్టి
మంగళము, గెల్పు సిరియు నొసంగి బ్రోచు
పార్శ్వనాథుడు మిమ్ము మీవారి నెపుడు. (2)

మంగళము జనుల కొసగగ
మంగళ సూత్రంబు సర్వమంగళ వలెనే
మంగళముగోరి నమ్మితి
మంగళ మనిమొనను మీకు మరిమరి గలుగుగా. (3)

(హారతినిచ్చి విజయతిలకము నుదుట నలంకరించి పాదములపై బడి మ్రొక్కును.)

భామాశాహ:— ప్రియా! నే ననిమొనకు బయలుదేరుచున్నాను.

మనోరమ :— నాధా! శుభముగపోయి జయముగ తిరిగిరండు. మీరు విజయలక్ష్మీ సమేతులై వచ్చినవెంటనే యిష్టదైవము అగు మీకు రత్నదీపములతో నీరాజన మొసగి మీచరణ రజోలేశము నుదుట తిలకముగ నలంకరించుకొను నదృష్టము భగవానుడు నాకు ప్రసాదించుగాక! తమకు పరిచర్య కావించు నదృష్టమునకు నా శరీరము పులకరించుచున్నది. మన మిరువురము జినాలయమునకేగి భగవంతు దర్శించి వత్తము!

భామాశాహ :— ప్రియురాలా! అట్లేయగుగాక!

(ఇరువురు నిష్క్రమింతురు.)

[తెర వ్రాలును.]

## ( ఐదవ దృశ్యము )

స్థలము — హారావళి పర్వతములందలి యొక శిఖరము;
సమయము — ఉదయము.

(నశించుచున్న కటిక చీకట్లు. తూర్పున నుదయారుణ కాంతులు. చైతకాశ్వ మధిష్ఠించిన రాణా ప్రతాపుడు. వెనువెంట నుత్తమాశ్వ

మారోహించిన భామాశాహ. "మహారాణా ప్రతాపుకీ జై! మేవాడ పుణ్యభూమికీ జై!" అని సామంతులు విజయ ధ్వనులు కావించుచుండ తెరయెత్తుదురు. )

ప్రతాపసింహుడు :— మహామంత్రీ! ఈ దిశ కనిపించు యవన సేన స్వల్పముగనున్నదే? నిజముగ నది స్వల్ప సేనయా? లేక కొన్ని శ్రేణులుగ విభజింపబడిన సేనలో నొక భాగమా? వారి వ్యూహ మెట్టిదో?

భామాశాహ :— మహారాణా! నేనింతకు ముందే శత్రువుల వ్యూహ విధాన మెఱింగి రమ్మని గూఢచారునొకని పంపించితిని. అతడిప్పటికి వచ్చుచుండును. (ముందునకు చూచి) అడుగో! వచ్చుచున్నాడు.

( గూఢచారి ప్రవేశించును )

ప్రతాపసింహుడు :— గూఢచారీ! వేగముగ మొగలుసైన్య శిబిరములందలి విశేషములు తెల్పుము? వారి సైన్యబల మెంత? వారే యే స్థానము లందెట్లు విడిసియున్నారు?

గూఢచారి :— మహారాజా! మహా మంత్రి యాజ్ఞగొని నే నేగి వచ్చితిని. యవనసైన్యము దాదాపు లక్షవరకుండును. వారు కొన్ని కొన్ని విభాగములుగ విభజింపబడి యున్నారు.

ప్రతాపసింహుడు :— మహామంత్రీ! మానసింహుని కుతంత్రము గాంచితివా?

భామాశాహ:— ఇందనుమానమేమున్నది. శత్రుసేన స్వల్పమని తలచి మనము సమర ప్రదేశమునకు వత్తుమను నాశతో నాతడట్లొనరించి యుండును.

ప్రతాపసింహుడు :— వాని దురాశ మన సేనముందు అడియాస కానున్నదని వాడెఱుగలేకున్నాడు. మంత్రివర్యా! వాని యెత్తునకు మన పైయెత్తేమి ?

భామాశాహ :— ఏమున్నది! మనమీ శిఖరమునుండి క్రిందకు దిగకుండ శత్రువుల నశింపజేయవలయును.

ప్రతాపసింహుడు :— నాకును తోచినదిదియే ? మనము యుద్ధ శిక్షణ లేనివారమని మానసింహుని దుర్భ్రమ కాబోలు? ఈ మారతని భ్రాంతి వీడిపోవునుగాక! మన కేసరి పతాక మెగుర వేయుదము.

(ఒక సైనికుడు జండాను పట్టుకొనియుండ చుట్టు వీరులు చేరి పాట పాడుదురు.)

పాట. అనుబంధము — 7.

(యుద్ధవాద్యముల ధ్వని వినిపించుచుండును.)

భామాశాహ :— వీరసైనికులారా! ఇక యుద్ధము ప్రారంభము కానున్నది. మనము త్యాగభావముతో దేశమాతను స్మరించుకొంటిమి. అందరొక్కుమ్మడినేగి శత్రుమారణ మొనరింపుడు. ఇందజాగ్రత్తకు అవకాశములేదు. ప్రాణ ప్రదమైన కేసరి పతాకమును, మన నాయకుడైన రాణాను

మన ప్రాణముల తృణప్రాయముగ వెచ్చించి రక్షించుకొనవలసియున్నది.

ప్రాణంబుల్ వెలవోసి గెల్చుటయొ ? వీరస్వర్గమున్ గాంచుటో ?
రాణం గూర్చునటంచు నెంచి మదిలో ! రంపిల్లగాబోకుడీ ;
రాణావారల నాయకత్వమున సంగ్రామంబు కావించి ని
స్త్రాణం జెందిన దేశమాతకును స్వాతంత్ర్యంబు కాపాడుడీ !

**(సైనికులు కత్తులు తళ తళ లాడించుచు మహారాణాకు వందనము కావించి ముందునకు సాగిపోవుచుందురు. ఫిరంగుల మ్రోతలు, గుఱ్ఱముల డెక్కల సవ్వడులు యుద్ధారంభమును దెలియజేయును.)**

[ తెర వ్రాలును. ]

---

# ఖా మా శా

## (పంచమాంకము – మొదటి దృశ్యము)

స్థలము—కుంభల్‌మియరు దుర్గమందలి యొక సరోవరము.

సమయము—కార్తీకమాసమందలి ఉదయసంధ్యాకాలము

(సరోవర తీరమున చిన్నచిన్న గుట్టలు. లేమావి చెట్లపై కోకిలారావములు. సరోవర జలములలో విహరించు జలపక్షులు. తీరమున తిరుగుచున్న పశువులు. ఆరావళి పర్వతముపై మనోహరమగు సూర్యోదయ రమణీయ ప్రకృతి దృశ్యములు. ప్రకృతి రామణీయకమును పరిశీలించుచు ఖామాశాహ యొకప్రక్కనుండియు, దండ కమండలముల ధరించిన జైనసాధువు మరియొక ప్రక్కనుండి ప్రవేశించుచుండ తెర యెత్తుదురు.)

ఖామాశాహ :— శాంతిరూప సాధుపుంగవులకు నమస్కారములు. తమ చరణరజముచే నేనగరము పవిత్రము కానున్నది ?

సాధువు :— ధర్మాభివృద్ధిరస్తు ! శ్రావకా ! నేను కుంభల్‌మియరు దుర్గమున కరుగుచున్నాను.

ఖామాశాహ :—గురుదేవా ! ప్రస్తుతము మేవాడ రాజ్యము శత్రువుల అత్యాచారములకు గురియై రణదేవతా విహారభూమియైయున్నది. ప్రజలు ధన ప్రాణము లర్పించి దేశమును కాపాడుకొన వలసియున్నది.

సాధువు :— ధన ప్రాణముల పరిత్యజించి రక్షించుకొను నవసరము మాయామోహితులగు గృహస్థులకు సంప్రాప్తిం

చును. సర్వసంగ పరిత్యాగులగు మావంటి వారలకు సం
ప్రాప్తింపదు.

ధన ధాన్యంబుల వస్తు వాహనములజ దారల్ కుమారుల్ సుతల్
జననీ సోదరులాది బంధువుల సంసారంబునున్ వీడినన్
మనుజుల్ వీడరు జీవితాశ నదియున్ మారాడకే వీడు మ
మ్మును బంధింపగ జాలదెట్టిదియు నోపుణ్యాత్మ ! భావింపుమా !

కాన, మేము స్వతంత్రులము. మాకు నిశ్చింత కలుగని
ప్రదేశమే లేదు.

భామాశాహ :— యథార్థము తపోనిధీ ! మాకు ధనము,
ప్రాణము, త్యాగముచేయగల తమూసంపత్తి దుర్లభము !

మా కాంతర్యము నందనంతమగు సంసారపు దాపత్త్రయం
బేకాగ్రంబుగ నిల్చి మానసమునం దేపారి దావానల
ప్రాకారంబయి వ్యాకులత్వమును సంపాదించి గార్హస్థ్యమున్
చీకాకుం బొనరించి చింతలను గాసింబెట్టు సాధూత్తమా! (2)

సాధువు :— (భామాశాహను దీక్షగ జూచుచు) భామాశా !
నేడు నీ నోటివెంట నింతటి నిస్పృహాపూరిత వాక్య
ములు వెలువడుచున్నవేమి ? మేవాడరాజ్య చక్రమును
యుక్తిశక్తులతో పరిభ్రమింపజేయు మహామంత్రీశ్వరా !
జైన ధర్మావలంబకుడవే ? ఇట్టి సమయమున నీ నిరాశ
యుచితమా ? అగ్ని చల్లారెనా ? సముద్రము లింకెనా?
క్లేశనాశకమగు నుత్సాహమును పెంపొందించుకొని
దేశము నుద్ధరింపుము !

భామాశాహ :— ఏమిచేయుదు కృపాకరా ! దేశము, ధర్మము నశించుచుండ చేతగానివానివలె జూడలేకున్నాను ! నా నిరాశాభూతము నన్నే గ్రసించుచుండ నశక్తుడనైన నేనీ దేశము నెట్లుద్ధరింపగలను ?

సాధువు :— భామా ! అభ్యుదయ వృక్షమునకు నిస్పృహ చీడ పురుగు. ఇది అంతయు నీ హృదయ దౌర్బల్యమే ? ఈ క్లైబ్యము పోవనిదే నీవు విజయశీలుడవు కాజాలవు ! నీ యాత్మయందలి అనంతశక్తిని ప్రజ్వలింప జేయనిదే నీవు దేశ, ధర్మ, సమాజాత్మలకు కళ్యాణము కలిగింప జాలవు!

భామాశాహ :— అకారణబంధూ ! దేశ, ధర్మ, సమాజాత్మలకు కళ్యాణము కల్గించుటవంటి మహత్తర కార్యములు తమ వంటి యాత్మశక్తి సంపన్నులకు సాధ్యములు కానిచో నావంటి నిరాశా దగ్ధజీవికి సాధ్యమా ! ప్రభూ !

సాధువు :— నాయనా ! నీవు జ్ఞానివి. వీరపురుష శ్రేష్ఠుడవు ! ఆత్మశక్తినిగుర్తించ కున్నన్నాళ్లు నీ నోట నిట్టిమాటలే వినవలసియుండును. ఏనాడాత్మశక్తి ప్రజ్వలింప జేసి కొందువో నాడు నీవీ మేవాడనేకాక ప్రపంచమునే యుద్ధరింపగలవు ! సాహాసమను సూర్యకాంతితో నిరాశాంధకారము పటాపంచలు కావించి కర్మవీరుడవుకమ్ము!

(అశ్వారోహియై రాణా ప్రతాపసింహుడు ప్రవేశించును.)

ప్రతాపసింహుడు:— (అశ్వమునుండి దిగి) సాధుపుంగవులకు నమస్కారములు. మహానుభావా! ఈ పవిత్రోపదేశామృత

మును గ్రోలి ధన్యుడనైతిని. ఈ చెట్లమాటునుండి వచ్చుచు నీ యదృష్టము నందుకొంటిని. జ్ఞానానంద మయ స్వరూపా ! మీ కివే నా అభివందనములు !

శక్తియను గంగ, తేజమన్ జమున, సాహ
సంబను సరస్వతి యను త్రయంబు కూడి
యుద్భవించె త్రివేణి నా యుల్లమందు
నీదు నుపదేశమను సుధా స్వాదనమున ! (3)

భామాశాహ :— గురుచంద్రమా ! తమ దివ్యవాక్కులు మాలో నణగారిన యుత్సాహ శక్తుల నుద్దీపింపజేసినవి. ధన్యులము !

సాధువు :— (రాణాను జూచుచు) మహారాణా ! మీరు, మీ మంత్రులు కావించిన త్యాగము స్తవనీయము సుమీ !

భామాశాహ :—క్షమానిధీ ! ప్రేమతత్వము గోపనీయముకాదు! మేవాడ యందుదయించిన మనమీభారము వహించక తప్పదు.

రాణా :— ఏమీ ! జైనాచార్యులు సైతము యుద్ధమును సమర్థించుచున్నారే !

సాధువు :— నాయనా ! మేవాడ జనని పాలుత్రావి, గాలి పీల్చి, అన్నపానములతో మన ప్రత్యణువు పునీతమైనది. హింసకాని దేదియు లేదు. ధర్మరక్షణకు గావించు రణము అహింసయే ! అమాయకులగు ప్రజల బాధింపక దోపిడులు కావింపకుండుట ధర్మముకాదా ! పార్శ్వనాథుడు మీకు జయము కూర్చునుగాక !

ఖామాశాహ :— ధన్యులము స్వామీ ! మీరొనర్చిన కర్తవ్యబోధ మమ్ముత్సాహవంతుల గావించినది. అభివాదనములు. సెలవొసంగుడు.

( అందరు నిష్క్రమింతురు. )

[ తెర వ్రాలును. ]

## ( రెండవ దృశ్యము )

స్థలము — బాబండి; సమయము — సూర్యోదయము.

(రాణా ప్రతాపసింహుడు, ఖామాశాహ ప్రవేశింప తెర యెత్తుదురు.)

ప్రతాపసింహుడు :—ఖామాశాహాజీ ! ఈ యుద్ధమున మనకు అపార నష్టము కల్గినది. పదునాల్గువేల రసపుత్రులు, ప్రాణ ప్రియులగు సర్దారులు, మూర్తీభవించిన స్వామి భక్తియో యనదగిన చైతకాశ్వము, గ్వాలియరు రాజు రామశా కుమారుడు ఖండేరావు రణదుర్గకు బలియైనను గెలుపు ఉళక్కియైపోయెను !

ఖామాశాహ :— మహారాణా ! యథార్థము సెలవిచ్చితిరి ! ఈ నిరుత్సాహము, మనోవ్యాకులత ఇంత టంతట తీరునా! జైనాచార్యుల యుపదేశమే మనకీనా డవశ్యమనుసరింప తగినది.

ప్రతాపసింహుడు :— మంత్రీంద్రా ! వారి యుపదేశమే మనకీ యుత్సాహమునైన ప్రసాదించినది. ఇప్పుడు మనకర్తవ్య మేమి ?

భామాశాహ :— మహారాజా ! ఈనాటి పరిస్థితి యిట్లున్నది. మనకు శత్రువుల భయము కొంత యుపశమించినది.

యుద్ధము పేరివౌనదుల యుద్ధతి తగ్గెను ! వానకారు స
న్నద్ధమునొందె! చచ్చిన జనంబుల మేనులు క్రుళ్లి వ్యాధు ల
త్యుద్ధతిజూప శత్రువుల కోపిక తగ్గి రణంబు పేరునే
బద్ధవిరోధినిన్బలెను భావన సేయుచునుండి రో నృపా! (1)

కావున మన మీ యనుకూల కాలముననే సైన్యసమీకరణము కావించుకొన వలసియున్నది.

ప్రతాపసింహుడు :— మీరు చెప్పినదంతయు బాగుగనేయున్నది. సైన్య సమీకరణము ధన ధాన్యములు, వస్తువాహనములు, వెండి బంగారములు లేని నేనెట్లు కావింపగలను? ఈ మిగిలిన కొద్దిసేన లేమిచేయగలవు ?

భామాశాహ :— ఈసమస్య జటిలమైయున్నది ? మీరేదేని యోచింపుడు. ఐనను మనకు ధనమెట్లు లభ్యము కాగలదు ? ధనము లేనిదే సైన్యము లెట్లుదొరకును ? సైన్యము లేనిదే మొగలుల నెట్లు పారద్రోలగలము ? ప్రతిజ్ఞలెట్లు తీరును?

ప్రతాపసింహుడు :— అదియేనయ్యా ! నా యాలోచనగూడ. మన కేరాజు సాయము చేయును? రాజపుత్ర రాజులందరు అక్బరు మోచేతినీటి కాశపడువారేకాని మనకు తోడ్పడువారు లేరు. మాళవ నృపాలుడేమైన నుపయోగపడునేమో ?

భామాశాహా :— మీ యోచన బాగుగనున్నది. ఆతనికేదో పాచికవేసి ధనమార్జింప వలయును. దానితో కొన్నాళ్లు మన యుద్యమము సాగగలదు.

ప్రతాపసింహుడు:— చెలికా! బెల్లము పెట్టుమన్న పెట్టునా? అత డూరక మనకు ధనమునిచ్చునా? ఏదో చక్రము వేయుడు.

భామాశాహా .— ఏదో నాతిప్పలు నేనుబడి డబ్బును సాధించు కొని వచ్చెదను. తారాచంద్రునితో కూడి పోయివచ్చెదను. సెలవిండు!

పతాపసింహుడు :— మంచిది. మీ యత్నము ఫలించుగాక ! వీరైనంత త్వరలో వత్తురుగాక !

(నిష్క్రమింతురు)

[తెరవ్రాలును.]

## (మూడవ దృశ్యము)

స్థలము-రాణా ప్రతాపసింహుని సభాభవనము

సమయము — సంధ్యావేళ

(మహారాణా ప్రతాపసింహుడు కొలువుతీరి యుండగ తెర యెత్తుదురు.)

ప్రతాపసింహుడు :— ప్రియ సామంతులారా! మహామంత్రి భామాశాహా రాజ్యకార్యార్థమై మాళవ ప్రాంతమున కేగియున్నారు. వారు వచ్చుటకు కొంత యాలస్యము కలుగవచ్చును. భామాశాహా, నా రాణా పదవితోబాటు,

నాకు మంత్రులై సహాకరించుచున్న మహానీయులు ! ఈనాడు క్లిష్ట పరిస్థితులవలన భామాశాహా తిరిగివచ్చు వరకు మరియొకరాభారము వహింపవలసి యున్నది. క్షణక్షణమునకు మారు పరిస్థితులకు తగిన మేధావిలేనిదే మనము నిర్విచారముగ నుండజాలము. కావున తగిన వానిని సూచింప గోరుచున్నాను.

మొదటి సామంతుడు :— మహారాణా ! మీ వంటి రాణా, భామాశాహావంటి మంత్రి కలికమునకైన కానరారు. భామాశాహా భారము వారే భరింప వలయును. చెవుల పిల్లి సింగము భారము మోయగలదా ?

ప్రతాపసింహుడు :— మీరన్నదియు నిజమే ! కాని యున్న వారిలోనే యుత్తము నెన్నుకొందము.

రెండవ సామంతుడు :— భామాశాహా మాళవమునుండి తిరిగి వచ్చువరకు రామాసాహిణీని నియోగించుట మంచిది కదా ?

ప్రతాపసింహుడు :— మీనిర్ణయ ముచితమైనది. ద్వారపాలకా ! యిటు రమ్ము. (ద్వారపాలకుడు ప్రవేశించును.) నీవేగి రామాసాహిణీగారి నిటకు మాయాజ్ఞయని చెప్పి వేగమే కొనిరమ్ము.

ద్వారపాలకుడు :— చిత్తము !

(ద్వారపాలకుడు పోయిన పిదప రామాసాహిణీ ప్రవేశించి నమస్కరించును.)

ప్రతాపసింహుడు :— రామాసాహిణీగారూ ! మీరీప్రక్క నాసీనులుకండు.

రామాసాహిణీ :— చిత్తము. (కూర్చుండి) దేవరవారు నన్ను పిలిపించిన విషయము సెలవిత్తురుగాక !

ప్రతాపసింహుడు :— అత్యవసరకార్యము కలిగి మిమ్ము పిలిపించితిమి. మహామంత్రి రాజ్యకార్య నిర్వహణకై మాళవ దేశ మేగిరికదా ! వారు వచ్చువరకు మీరు వారి కార్యభారము నిర్వహింప గోరుచున్నాను.

రామాసాహిణీ :— (విస్మయముతో) మహాప్రభూ ! మహామంత్రి భామాశాహావారి స్థానము నావంటివాడు నిర్వహించుటయా ? సూర్యునిభారము తారకలు వహింపగలవా ?

ప్రతాపసింహుడు :— మీశక్తి మీ రెరుగరు. మీరంగీకరించి నాకు సహాయమంత్రులై కార్యనిర్వహణ మొనరింపుడు. మేవాడ రక్షణాభార మీనాటినుండి మీ భుజస్కంధములపై నిర్విచారముగ నుంచుచున్నాను.

రామాసాహిణీ :— మహారాణావారి యాజ్ఞ నెవ్వరుల్లంఘింపగలరు! నా సర్వశక్తుల కేంద్రీకరించుకొని తమసేవ కావింతునని శపథము కావించుచున్నాను. ఇక సెలవొసగుదురుగాక !

( అందరు నిష్క్రమింతురు. తెరవ్రాలును. )

## ( నాల్గవ దృశ్యము )

స్థలము — మాళవ ప్రాంతము; సమయము — ప్రభాతవేళ.

**(సమతల భూమిపై పెక్కు చిన్నచిన్న గుట్టలు; వనులమీద తిరుగుచున్న ప్రజలు; ఒకమిట్టపై భామాశాహా, తారాచంద్ లు కూర్చుండియుండ తెరయెత్తుదురు.)**

భామాశాహ :— తారాచంద్రా ! మేవాడ సంరక్షణ దీక్షతో మాతృభూమిని వదలి యింతదూర మరుదెంచితిమి. ఇది మన భవితవ్యమును పరీక్షించి చూచుకొను సమయము. దైవేచ్ఛ ఎట్లున్నదో ?

తారాచంద్ :— అన్నయ్యా ! ఇది మనయొక్క భవితవ్యమునే కాక మేవాడ భవిష్యత్తును సూచింపనున్నది.

భారము దైవమందు నిడి పౌరుషశక్తుల నుద్యమంబు సొం
పారగ నిర్వహించునెడ నయ్యది తప్పక నెగ్గితీరెడిన్
పౌరుషహీను లెప్పుడును పందతనంబున దైవమందు రీ
పౌరుష మెప్పుడేనయిన నమ్మగుచో మన లోటులేదటన్. (1)

భామాశాహ :— నీవన్నదియు నిజమే. ఐనను—

దైవము పౌరుషంబు విదితంబుగ భాగ్యరథంబు చక్రముల్
దైవము లేని పౌరుషము తప్పక వర్షములేని సేద్యమౌ
దైవము పౌరుషంబు దుగతా ఫలియింప దొరికించుకేని యా
భావము సాహసంబునకు ప్రాపయి కోర్కెలదీర్చు నెప్పుడున్.(2)

మాళవరాజు నెట్లు మంచిచేసికోవలెనో యోచించితివా?

తారాచంద్ :— దాసికేమిభాగ్యము. పరిస్థితుల దెల్పుచు దూతచేత లేఖపంపిన నాతడు తోడ్పడడా ?

భామాశాహ :— అదియశ్లేయగునేని మనమిటకు రానేల? ఇంత యోచన యేల ? నీవన్నట్లు సామమున నాతడు చక్కబడిన మంచిది. దండోపాయము చివర ప్రయోగింప వలయునుగదా ! లేఖావిషయముల నాలోచించుచుందును. నీవేగి సిరాబుడ్డి, లేఖని గొనితెమ్ము.

(తారాచంద్ సిరాబుడ్డి, లేఖిని గొనివచ్చును.)

ఖామాశాహ :— (సిరాబుడ్డిలో కలము ముంచుచు) నేను లేఖ వ్రాయులోన నీవొక చతురుడగు దూతను గొనిరమ్ము.

(తారాచంద్ పోవును. ఖామాశాహ ఉత్తరము వ్రాయుట ముగించును. దూతతో తారాచంద్ ప్రవేశము.)

ఖామాశాహ :— దూతా! దీనిని మాళవ రాజేంద్రున కొసగి కార్య సాఫల్యము కావించుకొని రమ్ము. ఆలసింపక పోయిరమ్ము.

దూత :— చిత్తము. సెలవు.

(అందరు నిష్క్రమింతురు)

[తెర వ్రాలును:]

## ( ఐదవ దృశ్యము )

స్థలము — మాళవరాజు సభాభవనము.

సమయము — మధ్యాహ్నము.

(మాళవరాజు కొలువుతీరియుండును. కోశాధికారి, మంత్రి మొదలగువారుండ తెరమెత్తుదురు.)

మాళవరాజు :— మంత్రి శేఖరా! ఈనాటి విశేషములేమి?

మంత్రి :— మహారాజా! మహారాణా ప్రతాపసింహుని మహామంత్రి ఖామాశాహగారు తమదూతచే నొక లేఖ పంపియున్నారు. ఇతర విశేషము లేమియు లేవు.

మాళవరాజు :— (ఆశ్చర్యముతో) ఇది అసామాన్య విషయము మంత్రీ! మహారాణా ప్రతాపసింహుని మహామంత్రి భామాశాగారు లేఖ పంపినారా? వారి రాకలో నేదో పరమార్థముండి యుండును.

యవనదళంబు దేశమును నాక్రమణం బొనరింప పూర్వ వై
భవము నశింపగా విమల పౌరుషకీర్తులు క్రుంగిపోవ మా
నవునకు జీవితాధిక మనందగునట్టి స్వతంత్ర మస్తమం
బవునెడ రాజ్యమున్ సచివుడాతడు వీడునె మందబుద్ధియై.

మంత్రి :— న్యాయావతారా! తమరీ విషయమునం దిప్పుడే నిర్ణయము కావింపనేల? భామాశాగారి దేశభక్తి, స్వామిభక్తి సామాన్యములు కావు. అతడు మావంటి వారల కాదర్శపురుషుడు. వారేదో మహత్తర కార్యమును పూనియే వచ్చియుందురు!

మాళవరాజు :— అమాయికులగు మీరాతనినేల స్తుతింతురు? ఎట్టివాడేని నిట్టి తరుణమున రాణాను వదలి వచ్చునా? అతడు దేశద్రోహియే కాదు, స్వామిద్రోహి! రాణాను నిర్ధనుడని తెలిసికొన్నారు. నట్టేట పుట్టిముంచి మనల నాశ్రయింప వచ్చియుందురు. లేదా మనవలన నింకొకరి నాశ్రయింప గోరుదురు.

మంత్రి :— ధర్మావతారా! మీరు వారి నిట్లవమానింపరాదు. వారి శరీరమందలి ప్రత్యణువు స్వామిభక్తితో తొణికిసలాడుచుండును. వారికీ మంత్రిపదవి యీనాటిది కాదు.

వారి తండ్రి భారమల్ జీ ఉదయసింహునకు మంత్రులైరి. వీరు ప్రతాపునకు మహామంత్రులై యున్నారు.

కామధేనువు పొదుగు దుగ్ధములయందు
గరళ మిళితంబులను శంకగాంచు నెవడు
వాడు భామశాహ మంత్రివరుని యందు
పిరికితనమును ద్రోహంబు తరచిచూచు! (2)

మాళవరాజు :— సరే! వారు మంచివారే కావచ్చును. కాని పరరాష్ట్రమంత్రి నొకకంట కనిపెట్టియుండుట రాజనీతి! వారి యాగమన మందలి యుద్దేశ్యము మీరు తెలిసికొనుడు. వారు మనకేదైన కీడు కావింప వచ్చియుందురని నే ననుమానించు చున్నాను. ముందా దూతను ప్రవేశ పరుప ద్వారపాలకున కాజ్ఞాపింపుడు!

మంత్రి :— చిత్తము! ఎవరక్కడ? ద్వారపాలకా! దూతను ప్రవేశపెట్టుము.

(లోనమండి చిత్తము అని వినిపించును. దూత ప్రవేశించును.)

దూత:— (రాజునకు నమస్కరించి) నేను మేవాడ మహా మంత్రి భామాశాహాగారి పనుపున లేఖ గైకొని వచ్చితిని. దీనిని మీరు చదువుకొని ప్రత్యుత్తర మొసగ ప్రార్థన! (అని లేఖ నొసగును.)

మంత్రి :— మీ రతిథిగృహమున విశ్రమింపుడు. మేము ప్రత్యుత్తరము పంపెదము.

దూత :— చిత్తము (అని నిష్క్రమించును.)

మాళవరాజు :— మంత్రీ ! లేఖ పఠింపుడు.

మంత్రి :— చిత్తము !

"మాళవ మహారాజా !

రాజపుత్ర నృపాళి తేజంబు గోల్పోయి
అక్బరు శునకంబు లగుచునుండ
రాణా ప్రతాపుండు రణరంగ మేరువు
స్వాతంత్ర్యమును వీటి పరుపబోక
పారతంత్ర్యము కన్న ప్రాణము ల్వదలుట
యుత్తమంబని యెంచి యున్నవాడు
మత ధర్మ సంస్కృతుల్ మన్నుపాలాయెను
శాంతి సౌభాగ్యముల్ సమసిపోయె
భారతీయుడనని తెల్ప గోరువాడు
సర్వవిధముల స్వాతంత్ర్య సమరమందు
పాలుగొనవలె; మీర లీపట్టునందు
ధనము నొసగిన చాలు సంతసము కలుగు. (3)

కృపణత్వంబున మీర లీధనము మాకీకున్న నా పైన నే
విపరీతంబులు పుట్టునో వచనముల్ వేయేల? యేదో విధిన్
నృపతీ! కార్యము తీర్చుకోగలము కానీ! నీదు రాజ్య ప్రజల్
తపియింపన్ కనులార జూడగలవా? ధర్మావతారుండవే! (4)

—ఖామాశాహ"

మాళవరాజు :— (క్రోధముతో) మంత్రీ ! చూచితివా మీ సత్పురుషుని రాయబార విషయము ! వాని యాగడమున కంతున్నదా? మనలను బెదరించి ధనమును కాజేయ జూచుచున్నాడు ! నేనాతనికి జంకి ధనమిత్తునా?

కులశైలంబులు గూలుగాక; జలధుల్ ఘూర్ణిల్లి లోకంబులఀ
తలక్రిందుల్ పొనరించుతఀ; శశి రవుల్ తారల్ ధరఀ రాలుతఀ;
అలికాక్షుం డిపు డెత్తివచ్చినను తానై యోడిపోవుఀ జుమీ!
తలనుఀ వంచి ధనంబు నిచ్చుకొని నే దాసుండ నంచందునే? (5)

మంత్రీ! వారి రాయబారితో వారికీవిధముగ చెప్పి పంపుము——

'తందానా' యన 'తాన' యంచనుచు నీతాటాకు చప్పుళ్లకున్
కుందే లించుకయేని జంకుగొనునే? కోపంబు లాటోపముల్
హిందూరాజ్య రమా ధురంధరుడు మా యీ మాళవేంద్రుండు తా
నెందుఀ సైచునె? మందెమేళములతో నేమేని సాధింతురే? (6)

ధనముపై నాసమాని, సంతసము వీడి
వచ్చినట్టులె తిరిగి పోవచ్చు మీరు
కాదుకాదన్న మిము బలాత్కారముగను
తుదకు సైనికుల్ గెంటివేయుదురు నిజమ్ము. (7)

మంత్రి:— మహారాజా! మీరేల యింత ఆవేశపడుదురు. ఆవేశము కార్యకారిగాదు. భామాశా అలతివాడుగాదు. ఆతనిముందు మనము, మనసేన అల్లలాడి పోగలము. అక్బరు సామ్రాట్టే ఆతని ధాకకు జోతలిడుచున్నాడు. బలముకన్న యుక్తి ప్రబలము. యుక్తితో నాటవికుడు తనకన్న బలశాలియగు సింహమును వధించుచున్నాడు.

మాళవరాజు:— మీరన్నది వాస్తవమే కాని దుష్టశిక్షణము రాజనీతి కాదా!

మంత్రి :— నేనామాట కాదంటినా ? మనకన్న బలవంతుల యందు దండోపాయము వ్యర్థము. భేదము లోకమున దుష్కీర్తి కలిగించును. కాని ఫలముమీద నమ్మకము లేదు. ఆపన్నుడు సామమున చక్కబడడు. కాన దానమే యిప్పటిన కర్తవ్యము! ఇప్పుడు మనమీదకు రాకుండు టకు రాణావారే కారణము. రాణావారిని మన మాదు కొన్నచో మన కక్షరు భీతిపోయి, రాణా సాయము కలు గును. స్వాతంత్ర్య రక్షణమునకు సాయపడుట ప్రతివాని విధ్యుక్త ధర్మము.

మాళవరాజు :— మీకను ఈ వెఱ్ఱికలిగినదేమి ? దుష్టునకు ధన మిచ్చి తలకొరివి తెచ్చుకొమ్మందురా ?

గొడ్డటన్ గొట్టదగు చెట్టుకొమ్మ మీద
పూలవానను కురిపించ బూనువాడు
దండసాధ్యునియందు సాంత్వనము చూపి
పలువురందున నపహాస్య భాజనుడగు. (8)

మంత్రి :— రాజేంద్రా ! ఆవేశము నటుబుంచి కర్తవ్యము యోచింపుడు. దండనీతి నుపయోగించి దేశమున శాంతి భద్రతలను కరువు కానీయకుడు. ప్రజాభిమా నమును గోల్పోకుడు !

శీతల జలంబు లెపుడు వర్షించు మేఘు
డెప్పుడేనియు శిలల తానీయ బోడు
భామశా కోరు ధనమిచ్చి ప్రజలయందు
మంచిపేరును మీర లార్జించుకొనుడు. (9)

మాళవరాజు :— మాకిది యభిమతముకాదు. ఇది బ్రాహ్మణ ధర్మము. కాని క్షత్రియ ధర్మముకాదు. ఇది వినుడు ?

క్రోధ తేజో దవానలాంకూరములను
ప్రత్యణువు నిండు మా శరీరంబులందు
పిరికి నెత్తురులే దరి చరణ ధరణి
పడి నశింపగ బూదికుప్పలము కాము. (10)

మంత్రి :— మీకింతకుముందే మనవి చేసియున్నాను. భామాశా మిమ్మవమానింప దలపలేదు. ఈ ధనమతని సొంతమునకు కోరుటలేదు. దేశ రక్షణకు కోరుచున్నాడు. అక్బరు మనకందరకు శత్రువు. మీ పౌరుష మతనిపై చూపి మన రాజ్యము కాపాడుకొనుడు. రాణా లేకున్న మన మెప్పుడో అక్బరుకు లొంగిపోయి యుందుము. ఇందు వలన మనకు శత్రుభయము నశించును. దేశోద్ధరణకు త్యాగముచేసిన కీర్తి లభించును.

మాళవరాజు :— మంత్రీశ్వరా ! మీ యోచన బాగున్నది. ఎంత ధనమిచ్చిన బాగుండును ?

మంత్రి :— ఇరువదైదు లక్షల రజతము, ఇరువదివేల స్వర్ణ మొసగుట సముచిత మనుకొందును.

మాళవరాజు :— మంత్రీశ్వరా ! మీ రా ధనము కొనిపోయి భామాశాగారి కొసగి రండు. (కోశాధికారితో) ఆర్యా! మీరు మంత్రిగారి కాధనము నిప్పింపుడు.

కోశాధికారి :— చిత్తము ! తమ యాజ్ఞ నెరవేర్చెదను.

మంత్రి :— మహారాజా! నాకు సెలవిప్పింపుడు! మెల్లగ ఖామా శాను మన పొలిమేర దాటించి రమ్మందురా?

మాళవరాజు :— నా యభిప్రాయము చక్కగ గమనించుచున్నారే! నిజముగ మరల నాతడు మనపై కెత్తి రాకుండ జూడుడు. మీ చాతుర్యము నాకు తెలిసినదే కదా! ఇక పోయిరండు!

( అందరు నిష్క్రమింతురు. )

[ తెర వ్రాలును. ]

( ఆరవ దృశ్యము )

స్థలము — మాళవరాజ్యము పొలిమేర.

సమయము — సాయంసంధ్య.

(ఖామాశాహ, తారాచంద్ కూర్చుండి యుండ తెరయెత్తుదురు.)

ఖామాశాహ :— తారాచంద్రా! మనకోరిక తీరినది. ఇంత సులభముగ మాళవరాజింత ధనమిచ్చునని నేను తలపలేదు.

తారాచంద్ :— అన్నయ్యా! నిజమునకాతని కింత సద్బుద్ధి లేదు. దీనికి సూత్రధారుడు వారి మంత్రిగారు!

ఖామాశాహ:— వారికి మన ధన్యవాదములు. కాని—ఈ ధనము మాత్రము మన కెన్నాళ్ళు రాగలదు. దీనితోడనే యక్బరు ఆటకట్టించగలమా? ఐనను ప్రాప్తంబగు లేశమేని పదివేలని తలచవలయునుగదా!

తారాచంద్ :— ప్రస్తుతము మనమింతకన్న చేయదగినదేమియు లేదు. ఇట్లే ఇతర రాజులు మనకు తోడ్పడు నెడల నక్కరేమి లెక్క ! బ్రహ్మదేవుని నైతము పరాభవింప జాలమా ?

భామాశాహ :— నిజమే ! మనకు సాయపడు వారెవరును తోచుటలేదు.

తారాచంద్ :— అన్నయ్యా ! మనము మాతృభూమిని వదలి వచ్చి చాలకాలమైనది. నా మనస్సు మేవాడకేగ నాతురత పడుచున్నది.

భామాశాహ :— ఔనౌను ! చక్కగ జ్ఞప్తికి తెచ్చితివి ! రాణా వారెట్లున్నారో ? రాజకీయ పరిస్థితు లెట్లు మారుచున్నవో తెలిసికొన తహతహ కలుగుచున్నది. వారిని జూడనిదే నా కానందము కలుగదు.

తారాచంద్ :— మీ కానందమెట్లు కలుగును? బాల్యము నుండియు మీరు కలసి మెలసి రాణావారితో పాలు నీరువలె స్నేహితులై యున్నవారు. కావున వారినివదలి మీరెట్లు సుఖింపగలరు? ఈ గడ్డుదినములలో, విపత్పరంపరలలో రాణావారు మిమ్ము నౌకగ నమ్మియున్నారు. మన కనులయెదుటనే వారి యుత్సాహశక్తులు క్రమ క్రమముగ తగ్గిపోవు చున్నవి. ఇప్పటికి మీ యెడబాటు వలన వారింకను తమశక్తిని కోల్పోయియుందురేమో?

భామాశాహ :— నాయనా ! అట్లనరాదు. మహాత్ముల కుపకరణములతో పనిలేదు. రాముని కుడుత సాయమువంటిది

రాణా వారికి నాతోడ్పాటు! ఈ క్లిష్టకాలమున మనము రాణావారికి తోడ్పడి వారి భారమును పంచుకొనవలసి యున్నది. మన ప్రయాణ సన్నాహాములు కావింపుము.

తారాచంద్ :— అన్నయ్యా! అట్లేయగుగాక! నేను పోయి ప్రయాణ సన్నాహాముల గావించి వత్తును.

భామాశాహా :— జయ మేవాడ జననీ! విజయీభవ! పార్శ్వనాథప్రభూ! ఏకలింగేశ్వరా! ఈ మహాత్కార్యమున మీ తోడ్పాటు కల్గింపరా? మా రాణావారికి విజయము కల్గింపుడు!

[తె ర ప్రా లు ను.]

( ఏ డ వ దృ శ్య ము )

స్థలము—మేవాడలోని చూలియా గ్రామము

(రాణా ప్రతాపుడు, రామాసాహిణీయుండ తెర యెత్తుదురు)

ప్రతాపసింహుడు :— ఆర్యా! భామాశావారు మాళవము నుండి యింతవరకు రాలేదు! కారణ మేమైయుండును?

రామాసాహిణీ :— రాణాజీ! వారు కార్య నిర్వహాణమందు అలస్యము జేసియుందురు!

ప్రతాపసింహుడు :— నిజమే! అదియునుగాక తిరిగి మొగలులు ముట్టడి ప్రారంభించి యుండవచ్చును. ఇప్పుడే గూఢచారి వచ్చి షాబాజ్ ఖాన్ మాళవ ప్రాంతముల కేగి యున్నా డన్నాడు!

రామాసాహిణీ :— అట్లైనచో భామాశాగారిని రక్షించుట యెట్లు ? ఐనను వారు వీరావతారులు !

ప్రతాపసింహుడు :— నిరంతర యుద్ధములవలన నా సర్వశక్తులు సన్నగిల్లినవి. సైన్య సమీకరణమునకా చిల్లిగవ్వయును నాచేత లేదు. ప్రాణముకన్న మిన్నయగు భామాశాను దక్కించుకొనలేని నా బ్రతుకేల ? దుఃఖమునకు పేదరికముగూడ తోడై నా పరిస్థితి దుర్భర మగుచున్నది.

రామాసాహిణీ:—మీరంత విచారింప బనిలేదు. భామాశా వారి కార్యచతురత, వారి సోదరుల విక్రమ సంపద తోడై వారిరువు రన్నదమ్ములు సురక్షితముగ వచ్చి తీరుదురు !

ప్రతాపసింహుడు :— ఏకలింగేశ్వరుని యనుగ్రహమువలన మీ దివ్య వాక్కులు సత్యములగునుగాక !

(ద్వారపాలకుడు ప్రవేశించును.)

ద్వారపాలకుడు :— మహారాణా ! మహామంత్రులు భామాశా వారు తారాచంద్రులతో మాళవమునుండి యిచ్చటకు మీ దర్శనమునకు వచ్చుచున్నారు !

ప్రతాపసింహుడు:— మేము వారి రాకకై నిరీక్షించుచున్నాము. నీవు వారిని లోనికి గొనిరమ్ము. పొమ్ము !

(ద్వారపాలకుడు పోయి భామాశాహ, తారాచంద్రుల ప్రవేశింప జేయును.)

ప్రతాపసింహుడు :— సోదరులకు నా ధన్యవాదములు ! ఇప్పుడే తమవిషయము ప్రస్తావించుకొనుచున్నాము. మిమ్ము నా యదృష్టవశమున తిరిగి చూడగల్గితిని. క్షేమమా ?

ఖామాశాహా :— మహారాజా ! తమ యనుగ్రహామున మా క్షేమములకు లోటు లేదు.

ప్రతాపసింహుడు :— మీరు కార్యమును సాధించుకొని వచ్చి యుందురనియే నా విశ్వాసము !

ఖామాశాహా :— మీ సంకల్పమున కన్యథా జరుగునా? మాళవ రాజు ఇరువదైదు లక్షల రజత నాణెములు, ఇరువదివేల స్వర్ణనాణెము లొసగియున్నారు. (మహారాణా సముఖమున ధనము సంచులు ఉంచును.)

ప్రతాపసింహుడు :— ధన్యవాదములు ! అదునుకు గురిసిన వాన వలె సమయమునకు మీసాయ మందినది. మీరేగి నప్పటి నుండియు మొగలులతో పోరు దుర్భరముగ సాగు చున్నది. ధన, జన, శక్తులు క్రుంగిపోయినవి. ఈ ధనము కొన్నాళ్లు మనకు రక్షణ మీయగలదు !

తారాచంద్ :— ఇటీవల ధన జన నష్టము తప్ప మరి యే యమంగళము జరుగలేదు గదా !

ప్రతాపసింహుడు :— మన వారందరు కుశలముగ నున్నారు. పరివారమును భిల్లు లేమరక కాపాడుచున్నారు. కార్య భారము వలన తఱచు కుటుంబమును కలసికొన జాలక పోవుచున్నాను.

ఖామాశాహా :— ఇక మేము వచ్చితిమికదా ! మీరు కార్య. భారము మా మీద నిలుపుడు.

ప్రతాపసింహుడు :— ఈ క్లిష్టపరిస్థితులలో మీరు తిరిగివచ్చువరకు మీ స్థానమందు రామాసాహిణీవారు మిక్కిలి తోడ్పడి యున్నారు. ఇక తాము తమపదవి స్వీకరింప ప్రార్థన.

భామాశాహ :— కృతజ్ఞుడను. (రామాసాహిణీతో) ఆర్యా ! నేను లేనికాలమందు నా బాధ్యత నెరవేర్చిన మీకు నా ధన్యవాదములు! మీకు శ్రమ కల్గించినందులకు మన్నింప గోరుచున్నాను !

రామాసాహిణీ :— మహా మంత్రీశ్వరా ! ఇది యెవరింటి కార్య మని నన్ను పొగడుచున్నారు ? దేశోద్ధరణ మహా కార్యమందు ప్రతివాడు పాల్గొనవలయును. కావున నీ నాటికి మీ దయవలన నే నంతోయింతో దేశమాత ఋణము తీర్చుకొన గల్గితిని. నాకీ యవకాశ మొసగిన మీకు నా ధన్యవాదములు !

రవి పరోక్షమందు రాణించి వెలుగిచ్చు
దీపమునకు రవియె తేజ మిచ్చు
అటులె మీదుశక్తి నాశ్రయించి యొకింత
తమదు భారము తలదాల్చినాడ ! (1)

ప్రతాపసింహుడు :— మీరింతటితో నీ ప్రసంగమును విడచి మన కందుబాటులోనున్న దుర్గముల స్వాధీన పరచుకొను విషయ మాలోచింపవలసి యున్నది.

భామాశాహ :— మొదట దేవేరి దుర్గ మాక్రమింతము గాక !

ప్రతాపసింహుడు:—నాకు తోచినది సైతమదియే ! ఈ సందర్భ మున మీరు నా కెంతేని తోడ్పడ వచ్చును !

భామాశాహా :— నాకు మాత్రము మీవెంట నుండుటకన్న కావలసిన దేమున్నది ?

తారాచంద్ :— నేనుకూడ మీవెంట రావలయునా ?

ప్రతాపసింహుడు :— నా వెంట మీ యన్నగారొకరు చాలును. మీరు కొంత సేనతో మాళవ ప్రాంతమున కరిగి మొగలు లటునుండి రాకుండ జూడుడు !

తారాచంద్ :— తమ యాజ్ఞ శిరసావహించుచున్నాను.

( అందరు నిష్క్రమింతురు. )

[ తెర వ్రాలును. ]

## ( ఎనిమిదవ దృశ్యము )

స్థలము— బసీ బహిర్భాగము; సమయము — సాయంసంధ్య.

(తెర యెత్తుదురు.)

(గుఱ్ఱమెక్కి తారాచంద్రుడు; వెనుక షాబాజ్‌ఖాన్ సైనికుడు కత్తితో బొడువబోవ తారాచంద్రుడు తప్పించుకొనుచుండును. ఇరువురి శరీరములందుండి రక్తము స్రవించుచుండును. తారాచంద్రుడు రోజుచు పోరి యవన సైనికుని తరిమికొట్టి మూర్ఛిల్లి క్రింద పడును. బసీరావు సాయిదాసు దేవదా ప్రవేశించి తారాచంద్రుని సేదదీర్ప ప్రయత్నించును. తారాచంద్రుడు కనులుదెరచి చూచి లేవబోయి కూలబడును.)

సాయిదాసు :— వీరకిశోరా ! అప్పుడే లేవజాలవు ! నిన్ను సురక్షిత ప్రాంతమునకు గొనిపోయెదను.

తారాచంద్ :— ఆపద్బాంధవా ! తమ రెవ్వరు ? నన్నీ పరిస్థితిలో కాపాడుచున్న మీకు ధన్యవాదములు !

సాయిదాసు :— నాపేరు సాయిదాసు దేవదా ! నిన్ని దురవస్థ
యందు జూడజాలకున్నాను.

తారాచంద్ :— తమ దయార్ద్ర భావమునకు నా జోహార్లు !
అపరిచితులయ్యు బంధుభావము చూపుచున్నారు !

సాయిదాసు:—ఆపదలందు తోడ్పడుట మానవ ధర్మముకాదా !
ఈ బసీదుర్గమునకు నేను అధిపతిని. మీరు మా యతిథిగా
దుర్గమునకు రండు. మీకు స్వస్థత చేకూరిన పిదపనే
పోవుదురు గాక ! ఇదుగో ! మీ గుఱ్ఱ మిచ్చటనే
యున్నది. దానిని మెల్లగ నారోహింపుడు !

తారాచంద్ :— దయానిధీ ! ఈ ఆపదవేళ దైవమువలె నాకు
తోడ్పడిన మీ మాట కాదనగలనా ? మీయాన శిర
సావహింతును !

సాయిదాసు:— (తారాచంద్రుని గుఱ్ఱమును దగ్గరకు కొనివచ్చి)
నీవు లేవకుము. నేను నిన్ను దీనిపై కూర్చుండబెట్టుదును.

(సాయిదాసు సాయమున తారాచంద్రుడు గుఱ్ఱమెక్కెను. సాయి
దాసు దుర్గమువద్దకు గుఱ్ఱము కళ్లెముపట్టుకొని తీసికొని పోవును.)

[ తె ర వ్రా లు ను. ]

---

# ఖా మా శా

## ( షష్ఠాంకము — ఒకటవ దృశ్యము )

## స్థలము — మేవాడ పర్వత ప్రదేశము.

(మహారాణా ప్రతాపసింహుడు, యువరాజు అమరసింహుడు కూర్చుండియుండ తెరయెత్తుదురు.)

ప్రతాపసింహుడు :— అమరసింహా ! భామాశాహా మాళవరాజు వద్దనుండి కొనివచ్చిన ద్రవ్యమంతయు నిరంతర యుద్ధములతో వ్యయమై పోవుచున్నది. ఇంతకును మొగలుల విజృంభణ మాగిపోలేదు.

అమరసింహుడు :— ఈ తమసాహాస మపార విపత్పరంపరల నెదిరించుచు సిద్ధాంతముల కాపాడుకొనుచున్నది.

గిరుల గుహలె మీకు గేహంబు లాయెను
కఠిన శిలలె పాన్పుగాగ నయ్యె
హస్త యుగళమాయె హైమ పాత్రావళి
ఈ కఠోర తపము నెవ డొనర్చు ? (1)

ఈ కఠోర తపమునకు గూడ మేవాడ ఉద్ధరణము సాధ్యపడకున్నది.

ప్రతాపసింహుడు :— ఏమి చేయుదును. నా సకల శక్తులు విని యోగించుచున్నను ఫలము కలుగకున్నది. ఏమైన నగు గాక ! నా మేన తుది యూరుపున్నంతవరకు మేవాడకై పోరాడుదును. నేడు భామాశాహావా రింతవరకు రాలే దేమి ?

అమరసింహుడు :— వారు వచ్చువేళయైనది. వారీపాటికి వచ్చుచుందురు.

(చేతిలో లేఖ పట్టుకొని భామాశాహ ప్రవేశించును.)

ప్రతాపసింహుడు :— భామాశాహాజీ! నేడు తమ రాలస్యముగ వచ్చితిరే ! కారణమేమి ?

భామాశాహ :— విశేషములేనిదే నేనాలస్యముగ వత్తునా ?

ప్రతాపసింహుడు :— ఏమా విశేషము ?

భామాశాహ :— నేను తమయొద్దకు బయలుదేరి వచ్చుచుండ యవన రాయబారి వచ్చి దీని నిచ్చెను.

ప్రతాపసింహుడు :— ఈలేఖ నెవరెవరికి పంపిరి ?

భామాశాహ :— అక్బరు సేనాని మీర్జాఖాఞ నాకీ లేఖ పంపినాడు.

ప్రతాపసింహుడు :— లేఖా విశేషములు తెలుపుడు.

భామాశాహ:—ఇదుగో, జాబు చదువుచున్నాను. సావధానముగ నాలకింపుడు !

*మేవాడ మహామంత్రి భామాశాహగారికి—*

మొగలు పాదుషా అక్బరు నా సేనతో నన్ను మాళవ ప్రాంతమునకు పంపియున్నారు. మీరు తొందరగ వచ్చి నన్ను కలిసికొనుడు. ఇది అక్బరువారి యాజ్ఞ ! మీరొక్కరే రావలసినది. మీకెట్టి యాపదయు రానేరదని ఖురానుపై నొట్టు పెట్టుకొనుచున్నాను. మీరు రాణావారితో వచ్చిన నాపద తప్పదు.

—మీర్జాఖాన్ (యవన సేనాని) వ్రాలు.

ప్రతాపసింహుడు:— భామాశా గారూ! ఈ జాబు వినినంతనే నాలోని స్వాతంత్ర్యరక్తి యక్బరు కోపాగ్నిని పెంపొందించుచున్నదని తెలియవచ్చుచున్నది. నా స్వాతంత్ర్య మపహరించుట కక్బరు తన సర్వశక్తులను వినియోగించుచున్నాడు.

భామాశాహ :— అది నిక్కమే! ఇంతకు నేను మీర్జాఖానును కలసికొనవలయునా ? వలదా ?

ప్రతాపసింహుడు :— మీరు పోకున్నచో నేమి హాని కలుగును ?

భామాశాహ :— నేను వెళ్లకుండుట పెక్కిడుమ్ములకు దారి తీయగలదు. అక్బరు సర్వశక్తుల సమీకరించుకొని మేవాడపైకి తానే రావచ్చును. అప్పుడు మనకు విపత్తు లెక్కువగును !

ప్రతాపసింహుడు :— మీరనెడిదియు నిజమే! కాని తమరి నాహ్వానించుటలో వారి యుద్దేశ్యమేమి ?

భామాశాహ :— అది అక్కడకు పోనిదే నిశ్చయముగ నెట్లు చెప్పగలను ? మనకు మిత్రభేదము కల్పింప బూనియుందురు. నాకు ధనము, పదవి యెరచూపి మీనుండి నన్ను విడదీయదలచి యున్నట్లున్నది.

ప్రతాపసింహుడు :— మీరు వారి ఎత్తులకు లొంగకున్నచో మీకు హాని కల్గింపరా ? మీ స్వాతంత్ర్యము నరికట్టరా ? ఈ ముస్లిములు మొదటినుండి కుట్ర, కపటములతో హిందూదేశమున సామ్రాజ్య స్థాపనకు పునాది కావించినారు. ఘోరీ మొద లక్బరు వరకంతోయింతో ఈ పనులు చేసినవారే !

భామాశాహ :— అట్లెన్నడు జరుగదు. ఒకవేళ వారిట్టి నీచము నకు పాల్పడినను నా భుజబలమే నన్ను కాపాడగలదు.

ప్రతాపసింహుడు :— మీ బలపరాక్రమము లందలి విశ్వాసము తోడనే మిమ్ము పోనిచ్చుచున్నాను. మీ రాత్మరక్షణ మందప్రమత్తులై యుందురు గాక ! వీలైనంత శీఘ్ర ముగ రండు. నా పంచప్రాణములు మీవద్దనే ఉండును. మీరు నా యొద్దనున్న నాకాధారమంతయు తీరినట్లుండును.

భామాశాహ :— అట్లే కావించెదను. సెలవు.

( అందరు నిష్క్రమింతురు. )

[ తెర వ్రాలును. ]

## ( రెండవ దృశ్యము )

స్థలము—మాళవ మందలి యవనుల శిబిరము;

సమయము - సాయంసంధ్య.

(మీర్జాఖాన్, భామాశాహ మాట్లాడుచుండ తెరయెత్తుదురు.)

మీర్జాఖాన్ :— భామాశాహగారూ! నేడు అక్బరు చంద్రపతాక ఆర్యావర్తమందంతట ఆటంకములేక యెగురుచుండెనని యెఱుగుదురా? నేటి రాజులెల్లరు మొగలు సామంతులే కదా !

భామాశాహ :— ఖానుగారూ ! నేను తెలిసికొంటిని. మీరు నైతే మీ విషయ మెఱుగుదు. తారకలు చంద్రుని

చేరుట సహజమే ! కాని కళంకియగు చంద్రుడు ప్రభా
కరుని తేరిచూడజాలడను విషయము మీరెరుగుదురా ?

మీర్జాఖాన్ :— మీ మహాభిమాని సూర్యుడు సంధ్యాకాలమం
దేమగుచున్నాడో ?

భామాశాహ :— ఇది ప్రకృతి ధర్మము. ఇది ప్రభాకరున కవ
మాన కారణము కాదు.

మీర్జాఖాన్ :— భామాశా ! ఈ వ్యంగ్య సంభాషణము మన
కింతతో తీరునది కాదు. కాని— రాణావారు లోక
మున మహాపురుషు లనిపించు కొనుచున్నను వారనుభ
వించు కష్టముల జూచిన పగవారమగు మాకే గుండెలు
మండిపోవుచున్నవి. తన్నకు మించిన ధర్మము తగునా ?

భామాశాహ :— ఖానూ ! మీ అభిప్రాయము తెలియజేయుడు.
రాణావారికి రజతము, సువర్ణము, పదవి రుచిచూపి, వారి
స్వాభిమానమును, సిద్ధాంతములను గంగలో కలుప
దలచితిరా ?

మీర్జాఖాన్ :— మేవాడ మంత్రీ ! ఐశ్వర్యము, గౌరవము,
భోగము లేనివారికి సిద్ధాంతములు, స్వాభిమానములు
తప్ప మరి యేమి సంతోషకారణము లుండును ?

భామాశాహ :— సిద్ధాంతముల విలువలు అందరికి తెలియవను
టకు మీరే ఉదాహరణము ! మా రాణావారు 'సరే'
యన్నచో తన సామ్రాజ్యము ధారపోయుటకు మీ
అక్బరు సిద్ధముగా నున్నాడే! మా రాణావారి సిద్ధాంత

ములు చేతగానితన మనగలరా ? ఈ లౌకికములు అశాశ్వతములగు కల్లకెంపులు జీవరత్నమగు రాణావారి కేల ?

మీర్జాఖాన్ :— రాణావారు జీవరత్నమే ! కాని పొట్టకు, బట్టకు మాత్రము జరుగదు. చివర కనతికాలముననే యీ జీవ రత్నము ఈ లోకము వదలిపెట్టక తప్పదేమో ?

భామాశాహ :— ఖానూ ! మృత్యువుతో నాటలాడు వీరులకు మృత్యుభయముండునా ? పిరికివాడు నిమిషమునకు పదిమార్లు చచ్చును! ధీరు డొకేమారు మరణించును.

మీర్జాఖాన్ :— ఐనను భామాశాగారూ ! తెలియక ఒకవిషయ మడుగుచున్నాను. మీమాటలలోని సత్యమటులుంచుడు. వైశ్యులగు మీనోట నివి వెలువడుటకన్న నొక సుక్షత్రి యుని నోట వెలువడిన నమ్మియుండెడి వాడనేమో ?

భామాశాహ :— ఖానుగారూ ! మీకింత తెలివి కలుగుట ప్రమాదమే ! విజాతీయుడగు అక్బరున కప్పచెల్లెళ్లను, కూతుళ్లను కట్టబెట్టిన అక్బరు సామంతులు క్షత్రియులే కదా ! వారికన్న నేను లజ్జాహీన కార్య మేమొనరించి తిని ? వైశ్యుడు క్షత్రియుడను భేదములేల ? అభిమాన మందరకు అవసరమే! కాని వారివారి తాహతు కొలది దానిని గౌరవింతురు. మీరందరు సుక్షత్రియులేనా ? ఇప్పుడు నిన్నీకత్తితో పొడిచినచో నీ క్షాత్రమేమి యగును? (అని పొడువ బోవును. ఖాను 'అల్లాఅల్లా' అని

పారిపోవుచుండగా ఖామాశాహా పట్టుకొని యోదా ర్చుచు ధైర్యము చెప్పును.) కనుక పిరికితనము, శౌర్యము పుట్టుకతో నలవడునుగాని దీనికి జాతి కారణము కాదు!

మీర్జాఖాన్:— ఖామాశాగారూ! నాఅజ్ఞానమును మన్నింపుడు!

ఖామాశాహా :— సాహెబుగారూ ! మీకీ విద్య వెన్నతో బెట్టినది కదా ! అందిన సిగ, అందకున్న కాళ్లు ! ఒకమాట వినుడు. మేవాడ యందలి ప్రత్యణువు పిరికితన మెట్టిదో యెఱుగనిది ! ఇచ్చటి వాతావరణమున కాశక్తి సహజము ! మాకందర కుగ్గుబాలతో శౌర్యము రంగరించి పోయుదురు.

మీర్జాఖాన్:— ఖామాశాగారూ! ఇంతకు నామనవి యేమనగ మీరు రాణావారిని అక్బరు సామంతుని కావించిన మరుసటి నిముసమున మీకు అపార ధనసంపదలు, అర్ధ రాజ్యము అక్బరుగా రొసగదలచియున్నారు.

ఖామాశాహా :— యవన సేనానీ ! మీ అక్బరుతో నామాటగ చెప్పుడు. ఖామాశాహా ధనాశతో స్వామిద్రోహము కావింపడు. అట్టి ఆశ లడియాసలు గావించుకొనుడు ! ఇంకొకమారు మీకీ విషయము ప్రస్తావించినచో మీ పరువు దక్కదు.

మీర్జాఖాన్ :— ఖామాశాగారూ ! మా అతిథులై వచ్చి నా వాక్స్వాతంత్ర్య మరికట్టకుడు. మీరీ విషయమై సావధానముగ నాలోచించి నిర్ణయము తెలుపుడు. మీరెప్ప

డంగీకరించినను నాకు సమ్మతమే! ఈ విషయ మంత తేలికగా త్రోసిపారవేయ దగినది కాదు! మీరు తరతరములు సుఖముగ మహారాజులవలె బ్రతుకవచ్చును! ఈ నిమిష నిమిషము గండములు తప్పిపోవును. మీ రాణా వారుగూడ సుఖింపగలరు. స్వకార్యము, స్వామికార్యము నెగ్గించుకొనుటలో నాకు దోషము కన్పించుటలేదు.

ఖామాశాహా :— మీ యాహ్వానముపై వచ్చినందున మిమ్ము మాటాడ నిచ్చితిని. ఇది అసంభవము.

మీర్జాఖాన్ :— ఖామాశాగారూ! మీరావేశమున సరిగా నిర్ణయించుకొన జాలకున్నారు.

ఖామాశాహా:— ఇదియే నా తుది నిర్ణయము. దీనికి జీవితములో తిరుగులేదు.

మీర్జాఖాన్ :— రాజాధిరాజులు అక్బరు సేవాభాగ్యమున కాశించుచుండ మీరు తిరస్కరింప దగునా?

ఖామాశాహా :— సిద్ధాంతముల ననుసరించు వారికిది సామాన్య విషయము. ముల్లోకముల సంపదలన్నియు నన్ను కర్తవ్య విముఖుని కావింపజాలవు!

మీర్జాఖాన్ :— మీ తృణీకారము మీకందరకు విపత్పరంపరల గూర్చునేమో యోచించితిరా?

ఖామాశాహా :— ఇంద్రుని కోపమైన మా నిశ్చయమును మార్చజాలదు. మా యాత్మబలము మీ అనంతాపార సైన్య బలమును నిర్ధూమధామము కావింపగలదు.

మీర్జాఖాన్ :— పాపము! ఈ యూహాలతోనైన నానందింతురు గాక !

ఖామాశాహ :— ఇవి ఊహామాత్రములే కావు. కలకాలము నిలచునవి. ముందు తరములవారి కాదర్శములు కాదగినవి. శాశ్వతము లైనవని తెలిసికొనుడు. ఇక సెలవు !

మీర్జాఖాన్ :— మీరు వెళ్లవచ్చును. కాని— మీకొక్క యవకాశ మిచ్చుచున్నాను. మీ అంగీకారము నేనిమిషము తెల్పినను మీకితడు స్వాగత మీయగలడని గుర్తుంచుకొనుడు !

ఖామాశాహ :— (వెళ్లుచు) ఖానుగారూ ! ఈ అడియాసల పెట్టుకొనకుడు ! దావాగ్ని మధ్యమున శీతల స్పర్శ మెన్నడేని లభించునా ?

( వి ష్ట మిం తు రు )

[ తె ర ప్రా లు ను. ]

## ( మూ డ వ దృ శ్య ము )

స్థలము—అరణ్య ప్రదేశము; సమయము—శరత్సంధ్య.

(నేలపై పచ్చని రెల్లుగడ్డి. గడ్డిపై మంచు బిందువులు. చెట్లలో నుండి మసక వెల్తురు. నీలాకాశమున స్వచ్ఛ తారకలు. చిన్న కుటీరము. వాకిట చిన్నదీపము. ముంగిట బండపై మగత నిద్రలో రాణాప్రతాప సింహుడు. సమీపమున రాణి పద్మావతి, రాకుమారి యుండ తెర యెత్తుదురు.)

రాకుమారి :— (తల్లిమెడకు చేతులు పెనవైచి) అమ్మా! ఇంక కొంచెము రొట్టె పెట్టవూ !

పద్మావతి :—(గోముగా) అమ్మాయీ ! ఇంతకు ముందే రొట్టె తింటివే ! మరల నెందుకమ్మా !

రాకుమారి :— (రెండు చేతులతో కనులు తుడుచు కొనుచు) ఇందాక సగము రొట్టె మాత్రమే నాకిచ్చితివి ! నా కాకలి తీరలేదు.

పద్మావతి :— (కోపము నభినయించుచు) ఔనౌను ! ఇంతలోనే నీ కాకలి యెక్కువైనదా ! ఇక పండుకొని నిదుర బొమ్ము. ఉదయమే రొట్టె నిత్తును.

రాకుమారి:— దానిని ఇప్పుడే ఇయ్యవమ్మా! ఉదయ మడుగను.

పద్మావతి :— (రాకుమారిని దూరమునకు నెట్టుచు) నీవు గోల చేయక లేచిపో ! మరీ మొండికెత్తుచున్నావు. దొంగ యెత్తులెత్తి గోముచేసిన రెండు తగిలింతును. నాన్న గారికి నిద్రాభంగ మగును.

రాకుమారి :— నాన్నగారు నిద్రలేచినచో నా కడిగినన్ని రొట్టె లిప్పింతురు.

పద్మావతి :— (గోముగా) నా బంగారు తల్లివి కదూ ! నీవు గోల చేయకున్నచో నిన్నెత్తుకుందును.

రాకుమారి :— నన్నెత్తుకొన వద్దులే ! రొట్టె నిచ్చినచో తిని నదిలో నీరుత్రాగి హాయిగా నిద్రపోదును.

పద్మావతి :—(ఒకరాతిబండనెత్తి దాచిన సగము రొట్టెనిచ్చుచు) నీవు వినవు. తీసికో ! నేనేమి చేయగలను ?

రాకుమారి :— అమ్మా! దీనిమీద నేయి వేయవే! రొట్టె యెండి
నములలేకున్నాను.

పద్మావతి :— (కన్నీటితో) అమ్మాయీ ! ఈ యడవిలో నేయి
యెక్కడ తెమ్మందువు ? దానిని చిన్నగ నీళ్లలో నాన
బెట్టుకొని తిని నీళ్లు త్రాగి నిద్రబొమ్మ.

(రాకుమారి ఎండిన రొట్టెనప్లే తినుటకు నోటికడ బెట్టుకోబోవు
నంతలో నడవిపిల్లివచ్చి రొట్టె తీసికొనబోయి, పిల్ల రొట్టె విడిపించ
నందున పంజాతో గుండెలమీద బరికి రొట్టె లాగుకొని పోవును.
రాకుమారి పెద్దపెట్టున కేకలు వేయుచు నేడ్చుచుండ రాజావారు విద్ర
మేల్కొందురు.)

ప్రతాపసింహుడు :— (బిడ్డ నెత్తుకొని) ఏమైనదమ్మా ! ఎందు
కేడ్చుచున్నావు ? సంగతేమిటి ?

(రాకుమారి యేడ్పుమాని చేసైగతో పిల్లిని చూపును. రాజా
ఆలోచించుచుండును.)

పద్మావతి :— ప్రాణనాథా ! దాని కాకలి వేసినది. తినుట
కేమియు లేనందున సగము రొట్టె నిచ్చితిని. పిల్ల రొట్టె
తీసికొనిపోయి పోకముందే యేడ్చుచుండ పోయి చూచి
తిని గదా ! దాని చేతిలో రొట్టె కన్పించలేదు.
(రాకుమారితో) అమ్మాయీ ! నీ రొట్టె యేమైనది ?

(మరల రాకుమారి పిల్లివైపు చూపించును.)

ప్రతాపసింహుడు :— ఏమి ! నీ రొట్టె పిల్లి తీసికొన్నదా ?

రాకుమారి:—(ఏడ్చుచు) నాకు చచ్చే ఆకలి వేస్తున్నది. (బిగ్గరగా
నేడ్చును.)

ప్రతాపసింహుడు :— (కన్నీటితో) జీవితేశ్వరీ ! కన్నబిడ్డ కరుణామయ విలాపము వినలేకున్నాను.

కటికి తుపాకులుఁ గరకు కత్తులు దయ్యములన్ ఫిరంగులుఁ
దటుకున మ్రోగుచున్ గలన దారుణ గాయము లాచరింపగా
తటతటలాడి గుండియలు దాయల నెత్తురు టేర్లు బాఱగా
స్ఫుటమగు వజ్ర పర్వతము పోలిక నిశ్చల వృత్తి నుండుదున్.(1)

అట్టిడు వజ్రపర్వతము నయ్యయొ నీరముగాగ మార్చె నీ
కట్టిడి గర్భఘోష; కడగన్నుల కెంపులు తక్కనేవి క
న్పట్టని నాదు కన్నులను బారుచు నుండెను బాష్పపుం ఝరుల్
పట్టికి పొట్టనిండుటకు పట్టెడు కూడును బెట్ట నెట్టులఁ. (2)

నేనీ గర్భశోకము భరింపజాలను. మరేదైన పెట్టి పిల్ల యేడ్పు చల్లార్పుము.

(పద్మావతి మౌనముగ కన్నీరు గార్చుచు శిలాప్రతిమవలె నిలువబడి యుండును.)

ప్రతాపసింహుడు:— (పద్మావతి నిస్పృహను జూచుచు) ఏమి ! కందమూలములు సైతము కరవైపోయినవా ? ఆహా ! ఏమి ఈనాటి మేవాడ మహారాణా కుటుంబ పరిస్థితి ! స్వామీ ! ఏకలింగేశ్వరా ! ఇది యేమి పరీక్ష తండ్రీ ! రాజ్యములేదని యేడ్చితినా ? హంసతూలికలు లేవని యల్లాడితినా ? పంచభక్ష్య పరమాన్నములకు ప్రాకులాడితినా ? కట్టుకున్న ఇల్లాలికి, కడుపున బుట్టిన బిడ్డలకు కడుపునిండ కూడుబెట్టక మలమల మాడ్చి చంపునీ నిర్భాగ్యుడు నుండినను మండినను ఒకటే ! కన్నులు

తెరువని పసికూన గడ్డి రొట్టెకును మొగమువాచి మొర పెట్టుచుండ లోకకళ్యాణము, దేశోద్ధరణము, పారతంత్ర్య బహిష్కరణ మెవరి నుద్ధరించుటకు ? నా సిద్ధాంతములు నన్ను పోషింప గలవా ? ఓ స్వాతంత్ర్య పిపాసా ! నన్ను వదలి పొమ్ము ! నాగుండెలు బండలైనవి. నేనుగూడ మానసింహునివలె నక్బరు దాస్యమునకే దలవంచుదును. నాకొరకు గాదు. నా యిల్లాలి కొరకు కాదు. ఈ కన్నులు తెరవని పసిపాపకు పట్టెడు మెతుకుల కొరకు. ఇన్నేళ్లు సర్వస్వపరిత్యాగము కావించి నిలువ బెట్టుకొన్న స్వాతంత్ర్యమును బలి కావింతును. మేవాడ ఏమైన నాకేమి ? నాకేమైన త్రవ్వి తలకెత్తిరా ? ఈ కష్టము లన్నిటి కిప్పుడే పరిష్కార మార్గము చూపుదును. లొంగిపోవుచున్నా నని అక్బరునకు లేఖ వ్రాసెదను. ఈ దారిద్ర్యము నన్నేమి చేయగలదు ? అక్బరు నాపాలి కల్పవృక్షము. ఆ నీడలో బంగారు పంటలు పండించుకొందును.

(ఆవేశముతో రాణా కాగితము, కలము, సిరాబుడ్డి తెచ్చుకొని వ్రాయబోవుచుండును. నిశ్చేష్టురాలై యున్న రాణి సింగమువలె దుమికి రాణా చేతిలోని కాగితము చించి, కలము సిరాబుడ్డి ఆవల పెట్టును.)

పద్మావతి:— నాథా ! మీరేమి చేయబోవుచున్నారు ? ఇన్నాళ్లు కష్టించి కృశించి కాపాడుకొన్న స్వాతంత్ర్యమును ఒక్క క్షణములో బలిచేసెదరా ? ఒకపూట గడ్డిరొట్టె

లేనందుకు బిడ్డ చచ్చిపోవునా ? పోనిండు ! దాని యాయువునకు మనము కర్తలమా ! ఈ మహోద్యమ మందు ఎందరు బలియైనారు ? ఎంద రిల్లాండ్రు చిరు నవ్వుతో చితి నెక్కలేదు ? ఎందరు పసిపిల్లలు మొరకు తురకల కరకు కత్తులకు బలికాలేదు ? మీ రెంత ? మీ త్యాగ మెంత ? ఏమి చేసినారని ఈ నిర్వేదము ! ఈ సాధారణ సంఘటనకే యిట్లు నీరుకారి పోతిరేమి ? నా బొందిలో ప్రాణముండగా మీరు సంధిపత్రము వ్రాయ రాదు. ఆ కత్తితో మమ్మందర బొడిచి మీరు సంధి కావించుకొనుడు. నేను, బిడ్డలు నిలచి స్వాతంత్ర్య రణమున మా తుది నెత్తురు చుక్కలు రాలునంత వరకు పోరాడుదుము. మీరు ఉదయసింహుని పుత్రు లనిపించు కొనుడు. ఆయనయైనను పారిపోయినారే కాని దాస్య మున కంగీకరింపలేదు. ఆయన యాత్మ లజ్జాభరమున మరగిపోదా? మీ మాతృదేవి దైన్యరూపము కాంచుడు. మేవాడ జనని కన్నీళ్లతో, నాకలికి కొనిపోయి యక్బరు నకు వెలవోయ వద్దని మీవంక తన సర్వభారమునుంచి రూపొందిన దైన్యమో యన జూచుచున్నది. ఇంతెందుకు? మీ ప్రాణ ప్రియమైన చైతకాశ్వరాజము కావించిన త్యాగము స్మరింపుడు! ఇన్ని ప్రాణముల నేధైర్యముతో రణదుర్గకు బలిపెట్టితిరి ? వారి పవిత్రాత్మలు మీకీ పని చేసిన ఘోషించి శపింపవా ? సంధిపత్రము వ్రాయు నధి కారము మీ కెక్కడిది ?

ప్రతాపసింహుడు :— (ఆవేశముతో) రాణీ! ఇక క్షమింపుము. నన్నిక అవమానింపకుము. నీకు భర్తననిపించుకొనుటకు తగని ఘోరకార్యము చేయబోవు నన్ను మంత్రికన్న మిన్నగా మరలించితివి! ఈ దుర్ముహూర్తమున గలిగిన పిరికి తనము పోకార్చి నన్ను శాశ్వతముగ కాపాడితివి! ఇదుగో! నా ప్రతిజ్ఞ! నీ ప్రోత్సాహమున వేయి యేనుగుల బలము నా కుడిచేతికివచ్చినది. విశ్రాంతిలేదు. సంధిలేదు. యశోవా మృత్యుర్వా! మేవాడ జననీ! (నేపథ్యమునుండి) మహారాణా వారెక్కడ? ఈ యునికి సైతము శత్రువులకు తెలిసినది.

ప్రతాపసింహుడు :— ఏమీ! అకాల విజృంభణము! కాననములలో భూగర్భమున దాగియున్నను, శత్రువులకు తెలిసిపోవునా? తలపై మేరువు జారిపడు చున్నట్లున్నది. సమస్త రాజస్థానమునకీ ప్రదేశము దుర్గమ రక్షణ స్థానము. ఇదియును నన్ను కాపాడకున్న నాకేమి శరణు? కానిమ్ము! ధైర్యముతో పగతుర నెదుర్కొందును. రాబోవు దృశ్యము జీవిత నాటక రంగమునకు భరత వాక్యము పాడిన పాడునుగాక!

(ఖడ్గము నొరనుండి దీసి నలువైపుల జూచి రాణా, రాణీతో, రాకుమారితో విరవిర నరుగును.)

[తెర వ్రాలును.]

## ( నా ల్గ వ ద్మ శ్య ము )

### స్థలము-మేవాడయందలి ఒక గ్రామము;
### సమయము- హేమంతసంధ్య

(ఊరి వెలుపల నొక చిన్న కొండపై నొక చిన్న పర్ణకుటీరము; సమీపమున రాణా ఆలోచించుచుండ సామంతులు చుట్టు కూర్చుండి యుండ గూఢచారి ప్రవేశించును. తెరఎత్తుదురు.)

గూఢచారి:— (నమస్కరించి) మహారాణాజీ! ఈ ప్రదేశము కూడ శత్రువులకు దెలిసిపోయినది. అబ్దుల్ రహీము ఖాఁ మహాసేనతో వచ్చుచున్నాడు. మీరి ప్రదేశమును వదలిపోవుట మంచిది.

ప్రతాపసింహుడు :— (విచారముతో) ఇంతకన్న రహస్య ప్రదేశమేదికలదు ? ఇక మేవాడను వదలి పోవుటయే యుత్తమ మార్గము!

మొదటి సామంతుడు:— రాణాజీ! మరింక నెక్కడకు బోగలము?

ప్రతాపసింహుడు :— ఈ ప్రదేశము వదలి సింధునదీ ప్రాంతముచేరి అజ్ఞాతముగ జీవింతము.

రెండవ సామంతుడు :- జన్మభూమిని వదలి యెట్లు పోగలరు మహారాణా ! ఇక మేవాడ నుద్ధరించువారెవరు? విము తస్థుల యత్యాచారములతో నీపవిత్ర భూమి క్రుంగి, కూలారి, కృశించి పోవలసినదేనా ? ఏమైనను మీరీదేశ మును వీడిపోరాదు. మీరు దేశము నుద్ధరింపక తప్పదు.

ప్రతాపసింహుడు :— సామంత నృపాలా ! తమ యాశయము గొప్పదే! అర్ధబలము అంగబలము లేకేమి చేయగలము?

మూడవ సామంతుడు :— మరి— మీనిశ్చయము మేవాడ పరిత్యాగమేనా? ఇది తలచిన మాగుండెలు మండుచున్నవి

ప్రతాపసింహుడు :— మాతృదేశ పరిత్యాగము నాకు మీకన్న నెక్కువ బాధాకరముగనే యున్నది. ఈ ప్రతికూల పరిస్థితులందు నాకింతకన్న గత్యంతరములేదు. ఆశయ సిద్ధియను సౌధమునకుగల ద్వారములన్నియు శాశ్వతముగ మూసివేయ బడినవి. నాజీవితము తుది గడియలు ప్రశాంతముగ గడపు కొనుటయే మిగిలి యున్నవి. (సామంతుల దిక్కు చూచి) సామంతులారా! మీరందరు వెళ్లి యితరసామంతులందరికి మేవాడను వదలి వెళ్లవలసినదని తెలియ బరపుడు. నేనుకూడ కుటుంబముతో సకల సన్నాహములు కావించుకొని బయలుదేరగలను.

( అందరు నిష్క్రమింతురు. తెరవ్రాలును. )

## ( ఐ ద వ దృ శ్య ము )

### స్థలము—మేవాడ యందొక ప్రాంతము.

(హారావళీ శైలశిఖరముపై నిలువబడి చిత్తోడు దుర్గమువైపు తదేక దీక్షగ చూచుచున్న మహారాణా ప్రతాపసింహుడు, సమీపమున మహారాణి, రాజకుటుంబము, సామంతులు నిలువబడి యుండ తెరయెత్తుదురు.)

ప్రతాపసింహుడు :— బప్పారావల్, సంగ్రామసింహుడు మొదలగు మహావీరులను కన్న నో తల్లీ! తల్లికడుపు చెఱుపబుట్టిన నేను నీ స్వాతంత్ర్యమును కాపాడ జాలక పోవుచున్నాను.

తల్లి దేశమునందు స్వాతంత్ర్యరమను
నిలుపజాలక విడనాడ దలపు గొంటి
యవనులకు జిక్కు లేనియు నాత్మహత్య
యేని తప్పదు నాకింక నిచట నున్న. (1)

ఈ రెండింటికి సిద్ధపడినను దేశ స్వాతంత్ర్యము సంభవింపనందున నిరాశతో సెలవు గై కొనుచున్నాను తల్లీ! నా యీ కృతఘ్నతను మరచి నీ వరదాభయహస్తములతో నన్నాశీర్వదించి సాగనంపుము. ఎన్నటికైన నీ యీ పవిత్ర భూమిలో నా కింత తావొసగుము. (శిఖరము దిగివచ్చి సామంతులతో) ఆపద్బాంధవులారా! నే నెంత పిరికిపందను! అకర్మణ్యుడనైన నావలన మీ రెల్లరు దేశ పరిత్యాగ మాచరించుచున్నారు. నా యీ చేతకానితనమును మన్నింపుడు. నాకు సెలవొసగుడు.

మొదటి సామంతుడు :— మహారాణా! మేవాడ భాగ్యవిధాతలై యున్న తమ రేమనుచున్నారు? సకల వేళల మిమ్మనుసరించుట యే మాకర్తవ్యము. మా సుఖమునకు దేశోద్ధరణకు సకల భోగముల పరిత్యజించి వీరవ్రతము పాలించుచున్న తమవంటి దేశభక్తుల నామాక్షరములను చరిత్రలో స్వర్ణాక్షరములతో లిఖింప గలరు.

మీరులేని దేశమేమి కాగలదు? స్వాతంత్ర్య సంగ్రామ
మేమి జరుగగలదు?

ప్రతాపసింహుడు :— వీరులారా! నా దుర్బల భుజములు దేశ రక్షణ కసమర్థములైనవి. నా కేమాత్రము విశ్వాస మున్నను నా తుదియూర్పు నీ పవిత్ర భూమిలో వదలి యుండెడివాడను! నా కీ యజ్ఞాతవాస ప్రయాణము హృదయ శల్యమైయున్నది. కాని- ఇది తప్పనిదైనది!

రెండవ సామంతుడు :— ప్రభూ! తా మితర రాజులవలె ప్రలోభముల పాలై దేశమధోగతి పాలొనరింపలేదు!

సకల విధంబు తా శ్రమల సైచియు దేశము నుద్ధరింప గా
నుకనొనరించి సర్వము విస్మాత్న చరిత్ర సృజించినారు మీ
రొకట స్వతంత్రమే యొదవ నూహలుకావు నిజమ్ము దేశ మం
దకలుష సింహకేతనము నార్యుడవీవు ప్రభుత్వ మందరే? (2)

ప్రతాపసింహుడు :- సామంత నృపాలా! మీరన్నది యాథార్థ్యమే! నా దురదృష్టము నన్నా సుదినముల చూడనీయకున్నది. మాతృదేశముపై యవను లత్యాచారము కావింప నూరక చూచుచుండలేను. పోరాడలేను. కావుననే ఈ దూరప్రయాణము! బయలుదేరుడు. మనము స్మృతి చిహ్నముగ నీపవిత్రదేశము మట్టి దోసెడు భద్రపరచు కొందుము గాక!

(రాణా యుత్తరీయ మందు దోసెడు మట్టి మూటకట్టు కొనును. అందరట్లు గావింతురు. అందరు మెల్లగ సాగిపోవుదురు. విచార

సూచక సంగీతము వినిపించు చుండును. వెనుకనుండి భామాశాహ సాశ్రునేత్రములతో ప్రవేశించును.)

భామాశాహ :— మేవాడ భూషణా ! ఓస్వాతంత్ర్య ప్రభాకరా! ఆగుము! నిలువబడుము! నాయంతిమ విన్నపము విని యనుగ్రహింపుడు!

ప్రతాపసింహుడు :— (గుఱ్ఱము కళ్లెము బిగియబట్టి) భామాశాహవారు పరువెత్తుకొని వచ్చుచున్నారు. (సామంతులవైపు తిరిగి) మీరందరు వాహనములాపి వారికొఱకు నిరీక్షింపుడు!

(సామంతులు గుఱ్ఱములాపి దిగుదురు. భామాశాహ వచ్చుటచూచి రాణా గుఱ్ఱమునుండి దిగి భామాశాహ పాదములు స్పృశించి నమస్కరించును. భామాశాహ కన్నీటితో రాణా నాలింగనము కావించుకొనును.)

ప్రతాపసింహుడు :— మహామంత్రీశ్వరా ! నేడు తమ హృదయమింత దుర్బలముగ నున్నదేమి ? కన్నీళ్లెడతెగక కారుచున్నవేమి ? తమ వ్యాకులకారణ మేమో తెల్పుడు.

భామాశాహ :— మేవాడ భాగ్యవిధాతా! ధనాభావముతో మీరు మేవాడ వదలిపోవుట నా యసమర్థత కాదా! నా కృతఘ్నతకు భయంకర ప్రతిఫలము! నా లోభమునకు న్యాయమైన ఫలము ! మీరిట్లు పోవుచుండ నేను నిలువున కూలిపోకున్నా నేమి? మీరులేని నాజీవిత మేల ప్రభూ !

ప్రతాపసింహుడు :— ఆర్యా ! ఇందు తమ దోషమేమియున్నది? తమరు దేశోద్ధరణమందు నాకన్న మిన్నగ సకల ప్రయత్నములు కావించితిరి. దైవము పరాఙ్ముఖమై నప్పుడు మన ప్రయత్నములు ఫలించునా ?

భామాశాహా :— మహారాణా ! నేనేమియు చేయలేదు. నా కర్తవ్య మణుమాత్రమైన నిర్వహింప జాలనైతిని !

మీ యుప్పు తినుటచే నా యీ శరీరంబు
ప్రత్యణువును బలపరచ బడియె
మీ కటాక్షంబున నా కుటుంబము సమ
స్తైశ్వర్యముల హాయి నందుచుండె
మీ కుటుంబము తోడ మీ రరణ్యంబుల
పడరాని యిడుమలఁ బడితిరౌర !
మేవాడ దేశంబు మీరు వీడుటయేల ?
ఏను సంపదలొంది యెసగనేల ?
విమత నాగరకత విఱ్ఱవీగగ కన్ను
లప్పళించి చూడ నలవి యగునె ?
ఈ విలాస జీవితేచ్ఛ, నీ సంపద
నాత్మ గోరజాల నమల హృదయ ! (3)

ప్రతాపసింహుడు :— భామాశాహాజీ ! ఏమి మీ వెఱ్ఱి ! మన మెంత ? మన అభిప్రాయములెంత ?

కాల నిర్ణయంబు గడువంగ దరమౌనె ?
బ్రహ్మవ్రాత దప్ప వశమె మనకు ?
వక్రదైవతమును వంక దిద్దగ నౌనె ?
అపరిహార్యమైన యర్థ మిద్ది. (4)

భామాశాహ :— ప్రభూ ! ఇది పరిహార్యమే ? ప్రయత్నమునకు సాధ్యము కానిదేదియులేదు. నా ప్రార్థన నాలింపుడు. మా పూర్వులార్జించిన సంపదలు, నా పుట్టుకనుండి మా యింటనున్న శంఖదేవత యొసగు సకలైశ్వర్యములు ఈ మహోద్యమము నిర్వహింప తమ కప్పగించు చున్నాను. ధనముతో నవసరమగు సమయ మింతకంటె లభింపబోదు ! ఈ ధనముతో ఒక్కొక్కనికి నెలకు పదునేను రూప్యముల వంతున పన్నెండేండ్లు ఇరువదైదువేల సైన్యము పోషింపవచ్చును. వారికి భోజన భాజనాదులు గూర్పగలము. మేవాడపై కేసరి పతాక మవిచ్ఛిన్నముగ నెగురగలదు ! ఒక యక్బరేల ? వేవురక్బరులైన తిరిగి పోవలసినదే! నాయీ మనవి నాలించి వెనుకకు మరలుడు!

ప్రతాపసింహుడు :— (ఆశ్చర్యముతో) భామాశా ! తమ యౌదార్యము దేవేంద్రాదులకును విస్మయము కలిగించు చున్నది. తమ పూర్వార్జితము నేను గైకొనుట న్యాయమా ! దానిపై నాకేమధికారము కలదు ?

భామాశాహ :— (ఆవేశముతో) మీకు మా సంపదపై సర్వాధికారములు కలవు. ధనవంతుడు ధనమునకు ధర్మకర్తగ నుండి సద్వినియోగము కావింపనినాడు ప్రభువా ధనమును గైకొని సద్వినియోగపరుప వలయును. ఇది రాజధర్మము! రాణాజీ! మేవాడ నాజన్మభూమి! నాకును దీని యుద్ధరణమున బాధ్యత గలదు.

జననియు జన్మభూమియును స్వర్గముకన్న గరీయసంబులౌ
తనువిట మట్టి నేర్పడియె; దైవత దుర్లభమీ ప్రదేశ మో
జనవర! యిచ్చటన్ గలుగు స్వచ్ఛజలంబులత్రావి మేను పెం
చిన బలమెల్ల డిందుపడఁజేసెద దేశము తల్లి సేవలన్. (5)

నాకు త్రిలోకైశ్వర్య మీ యానందమిడలేదు. నాకీ స్వల్ప సాహాయ్యము చేయ మారాడకుడు!

ప్రతాపసింహుడు :— దానవీరా! తాము ధన్యులు!

రామునిన్ కైక పంపు టరణ్యములకు
ముంజుడు వధింపదలచుట భోజరాజు
నుదయసింహుని వనవీరు డదయుడగుచు
సంపదలగోరియే కదా చంప దలచె. (6)

అట్టి అపార ధన సంపదను తాము తృణముగ దలచి ధారపోయుచున్నారు! మీ యపూర్వ త్యాగ నిరతికి నా యంతరాత్మ జోహార్లిడుచున్నది. మేవాడోద్ధారకా! ఇవే ప్రణామములు!

భామాశాహ :— ఆర్యా! ఇది నా విధ్యుక్త ధర్మము! ఇందుకు నన్ను మీరింత ప్రశంసింపనేల! ఇది నా యదృష్టము!

ప్రతాపసింహుడు :— మహాశయా! ఇది మీ గొప్పదనమునకు వినయమునకు తార్కాణము. సామంతులారా! భామాశాగారు మన ఆపదల కడ్డుపడినారు. మనమేగి సన్మానముల కావించుకొందుము! రండు!

(మహారాణా ప్రతాపసింహునకు జై! మహామంత్రి భామాశాహకు జై! అని జయ జయలు పల్కుదురు.)

[ తె ర వ్రా లు ను. ]

## ( ఆ ర వ దృ శ్య ము )

### స్థలము—రాణాగారి సైనిక శిబిరము

(రాణా ప్రతాపసింహుడు, భామాశాహ కూర్చుండియుండ తెర యెత్తుదురు.)

ప్రతాపసింహుడు :— తమ సాహాయ్యము నాకు వరదానమువలె విజయలక్ష్మిని గూర్చుచున్నది. ఎన్ని జన్మలెత్తియు నేనే కాదు— ఈ మేవాడ పౌరులు మీ ఋణము తీర్చుకొనజాలరు. నిజముగ మేవాడ దేశము మీకు ఋణపడినది. మీరు దైవబలమై నా పౌరుషమును బంగారు పంటలు పండించుచున్నారు.

భామాశాహ :— మహారాణా! అధికముగ పొగడి నన్ను సిగ్గు పరుపకుడు! అచిరకాలమున మీరు మేవాడ సింహాసనాసీనులై నిండు కొలువు తీరుట మేము కన్నులార జూడ గలము! తొలుతనుండియు నాకా యాత్మవిశ్వాసము సంపూర్ణముగనున్నది. శేల్‌పూర్ నాక్రమింప బోయిన నమరసింహుడు గెలుపొంది యుండవచ్చును!

ప్రతాపసింహుడు :— ఇందులకుతోడు మొగలు సైనికుల ప్రమత్తత సైతము మనకుపకరించుచున్నది. వారు మద్యపానముతో, వారాంగనలతో, నృత్యగీతములతో కాలక్షేపము కావించుచున్నారు. ఈ పరిస్థితులలోనే మనము వీలైనన్ని దుర్గముల స్వాధీనపరచుకొనవలయును. అమరసింహుని నుండి వర్తమానము రాలేదే ?

(ఒక సైనికుడు ప్రవేశించును.)

సైనికుడు :— మహారాణా! శేల్ పురమును జయించి యువరాజావారు విజయము చేయుచున్నారు.

(అమరసింహుడు ప్రవేశించును.)

అమరసింహుడు :— దాజీరాజ్ ! తమ యనుగ్రహమున విజయము లభించినది. అల్పసంఖ్యగల యవనులు వీగిపోయిరి. కేసరి పతాక శేలపుర దుర్గముపై ప్రతిష్ఠించి విశ్వాసపాత్రుల నందుంచి వచ్చుచున్నాను.

ప్రతాపసింహుడు :— విజయీ భవ ! ఈ జయము మన విజయములకు నాంది ! భామాశాగారూ ! ముందటియాత్రలకు సిద్ధపరుపుడు.

భామాశాహ :— ఇప్పుడు ఖాన్ ఖాన్ విషయము తెలిసికొనవలయును. అతడు రాకముందే షానవాజ్ ఖానును గెల్చి దేవల్ వాడ నాక్రమింపవలెను.

ప్రతాపసింహుడు :— ఈ యోచన బాగున్నది. దేవల్ వాడ పిదప కుంభల్ మియ రాక్రమించుడు. అది గెల్చినచో మొగలుల బాధ సగము తప్పును.

భామాశాహా :— శుభస్యశీఘ్రమ్ ! సైనికుల సమాయత్త పరుప సేనాధిపతితో చెప్పివత్తును. నేనును మీవెంట వత్తును.

ప్రతాపసింహుడు :— మంత్రీశ్వరా ! మంచిది. మీరు తప్పక నా వెంటనుండుడు. సకల సన్నాహములతో శీఘ్రముగ బయలుదేరుడు. నేనును తొందరగ సిద్ధపడెదను !

భామాశాహా :— చిత్తము ! నేనిక సెలవు గైకొందును.

(ఇరువురు నిష్క్రమింతురు.)

[ తె ర వ్రా లు ను. ]

## (ఏ డ వ దృ శ్య ము)

స్థలము — ఢిల్లీ రాజభవనము.

(అక్బరు, ఖాన్‌ఖాన్ మాట్లాడుచుండ తెరయెత్తుదురు.)

అక్బరు :— (దిగులుగొంతుతో) ఉదయపురమునుండి వచ్చిన వార్తలు నాకు విస్మయమును గలిగించుచున్నవి. రాణా ప్రతాపుడు లొంగి వచ్చునన్న నాయాశ లడియాసలైనవి. రాణా మంత్రి భామాశాహా తన సర్వస్వము ధారవోసినాడట ! ఆ ధనముతో నిరువదైదువేల సైనికులను పదు నైదేండ్లు పోషించ వచ్చునట !

ఖాన్‌ఖాన్ :— పాదుషా ! ఆ భామాశాహా త్యాగమపూర్వము! చరిత్రలో నిట్టిదింకొకటి గోచరింపదు. ఆ ధనసాహాయ్యమున రాణాప్రతాపునకు అర్థబలము, అంగబలము సమకూడినట్లైనవి. ఇక నాతడు మనకు లొంగుట కల్ల !

ఆతని సేనలో ననుతుణము భిల్లులు, రాజపుత్రులు చేరు చున్నారట !

అక్బరు :— నిస్సందేహముగ మన మాతని గెలువజాలము ! ఇంతకు ఈ కోమటి భామాశా మన కొంప గూల్చి నాడు !

అమృత కలశ మందు హాలాహలము జిల్కె
పగటి కలల సలిపె వాంఛితముల
భామశాహ మంత్రి పాడైన దానంబు
గోడు గుడిపె నాదు కొంపగూల్చె. (1)

ఈపర కాతడు మన దుర్గముల నన్నిటిని గెల్చి యుండును. షాబాజ్ ఖానునుండి వార్తయే లేదే !

(ద్వారపాలకుడు ప్రవేశించును.)

ద్వారపాలకుడు :— పాదుషా ! ఉదయపురమునుండి సైనికుడు వచ్చి యున్నాడు.

అక్బరు :— వానిని ప్రవేశపెట్టుము.

(యవనసైనికుని ద్వారపాలకుడు ప్రవేశింప జేయును.)

సైనికుడు :— పాదుషా ! ఆలేకుం సలాం ! నేను మీకు చెడ్డ వార్త తెచ్చినందుకు మన్నించండి! ఉదయపురమును రాణా ఆక్రమించుకొన్నాడు !

అక్బరు :— ఇది అనర్థకరమే ! విషయమంతయు వివరముగ జెప్పుము.

సైనికుడు :— యువరాజు అమరసింహుడు శేల్‌పూరు ఆక్రమించెను. రాణా, భామాశాహాతో బయలుదేరి దేవల్‌వాడ నాక్రమించిరి.

అక్బరు :— మరి షాబాజ్‌ఖాన్ సైన్యముతో బాటేమైనాడు ?

సైనికుడు :— క్షణకాలములో రాజపుత్రుల ధాటికి సైన్యము నశించినది. మహామంత్రి భామాశాహాతోడి యుద్ధమున షాబాజ్‌ఖాఁ కత్తి తుత్తునియలై పోయెను. రణ ధర్మమనుసరించి భామాశా ఊరుకొన్నాడు. బ్రతుకుజీవుడా యని ఖాఁగారు పారిపోయినారు.

అక్బరు :— పిదప నేమైనది? పగవాడైనను భామాశా పొగడదగియున్నాడు ! ఆతడిచ్చిన ధనముతోనే మనకొంప కూలుచుండ నాతని యుద్ధముకూడా మన ఓటమికి కారణమైనది. ఏమి దురదృష్టము !

సైనికుడు :— ఇంకను నేను చెప్పవలసినది కొంచెము మిగిలిపోయినది ! షాబాజ్‌ఖాఁ ఓడిపోవగనే రాణా కుంభల్‌మియర్ దుర్గ సుబేదారుని వధించినారు. ఇప్పుడు వారు దాదాపు ముప్పదిరెండు దుర్గము లాక్రమించి కేసరి పతాకముల ప్రతిష్ఠించినారు. చిత్తోడు, మండల్ దుర్గములే మనకు మిగిలిపోయినవి ! సెలవు గైకొనుచున్నాను.

( సైనికుడు నిష్క్రమించును. )

అక్బరు :— ఖాఁఖాఁ ! ఎన్నోలక్షల ధనము వ్యయించి, సైనికుల బలిబెట్టి మేవాడ గెలువలేకపోగా గెలిచినవికూడా

నిలుపుకొనలేక పోతిమి. ఈ అపజయములు నా హృదయ శల్యములై వేధించుచున్నవి. ఆజన్మాంతము రాణాను గెలువలేక నేను క్రుళ్లిపోవలసినదేనా? రాణానొక్కనిని లొంగబరచుకొనలేని యీ పాదుషా పదవియేల, కాల్పనా? ఈ ఢిల్లీ సింహాసనమేల? ఇందరున్నారు! ఏమి సుఖము? ఆ మానసింహుడు నన్నీరొంపిలో దించి చూచుచూరకున్నాడు!

ఖాఁఖాఁ :— అక్బరుగారూ! మీకీ ప్రాయశ్చితము కావలసినదే. దుర్జనుడగు మానసింహుని నెత్తికెక్కించుకొని మామాట లెక్కసేయక రాణావారి నష్టకష్టముల పాలుసేసినారు! మీరు మాత్రమేమి బావుకొన్నారు! యువరాజు దుర్వ్యసనముల పాలైనాడు! మీకా ముసలితనము ముంచుకొని వచ్చుచున్నది! ఇక నమాజు చేసికొనుచు ప్రశాంతముగ జీవితము తుదిగడియల గడుపుకొనుడు.

అక్బరు :— (నేపథ్యమున నమాజుశబ్దమువిని) మీరన్నది నిజమే! మసీదున కేగుదము రండు!

( ఇరువురు నిష్క్రమింతురు. )

[ తె ర వ్రా లు ను. ]

## ( ఎ ని మి ద వ ద్రు శ్య ము )

### స్థలము — ఉదయపురము.

( విజయోత్సవముల కొరకేర్పచిన సభాగారము. రాణా, యువ రాణాల సింహాసనము అలంకరింపబడి యుండును. సమీపమందలి ఆసనములపై భామాశాహ, భీమచంద్, సామంతు లాసీనులై యుందురు. పౌరులు, గాయకులు, కవి పండితులు నిలువబడి యుందురు. )

[ తెరయెత్తుదురు. ]

( రాణా యువరాణా లంగరక్షకులతో రాగా నెల్లరు లేచి నిలువబడుదురు. సైనికులు జాతీయ గీతము పాడుచు సైనిక వందనము కావింతురు. గాయని పాటపాడుచుండ నెల్ల రొరలనుండి కత్తులు దూసి నిలుచుందురు. )

పాట. అనుబంధము — 8.

(పాట ముగియగనే సభ యంతయు నిశ్శబ్దము. ఎల్లరు కూర్చుందురు.)

ప్రతాపసింహుడు :— (లేచి నిలువబడి) స్వతంత్ర మేవాడ పౌరులారా ! సామంతులారా ! మేవాడ స్వాతంత్ర్య సమరమందు పాల్గొనినవారల నభినందించుటకీ సభ యేర్పడినది. ముఖ్యమగు సన్మానము నేను కావింతును. మీకు, నాకు, మేవాడకు, భావి తరములవారికి ఆరాధ్యుడగు మహామంత్రి భామాశాగారికి గండ పెండేరము తొడుగుచున్నాను.

(సభికుల జయ జయ ధ్వానములతో రాణా భామాశాకు గండ పెండేరము తొడుగును.)

భామాశావారికి దానశాసన పూర్వకముగ కొన్ని గ్రామము లొసగుచున్నాను. వీరు మాకు తొల్తటి సామంతులు. వీరి వంశీకులను మా వంశీయులు సదా కాపాడవలసియున్నది. ప్రతి పండుగలందు వీరు మాకడకు వచ్చుచున్నప్పుడు పంచ వాద్యములతో, తురాయిగల పాగాతో రానధికార మొసగుచున్నాను. వీరికి ' మేవాడ భాగ్యవిధాత ' యను బిరుదమొసగుచు వీరి వంశీయులకు మేవాడ ఉద్ధారకులను గౌరవము

శాశ్వతముగ జరిపించ వలసిన బాధ్యత మా ముందు తర
ములవారిపై నుంచుచున్నాను. మీరు దీనికి సమ్మతిం
తురుగాక !

సభికులు :— (ఏకగ్రీవముగ) మహామంత్రి భామాశాహా వారికీ సన్మానము తగియున్నది.

ప్రతాపసింహుడు :— భామాశాగారూ! నా ప్రియమైన గుఱ్ఱము చైతకము మరణించినచోట స్మారకచిహ్న మేర్పరుపుడు. యుద్ధమున మరణించిన వీరుల కుటుంబములకు శాశ్వత సాహాయ్యముల కల్పింపుడు.

భామాశాహా :— వీరావతార మహారాణా ! పరాక్రమోపేతు లగు సామంతులారా ! స్వతంత్ర మేవాడ పౌరులారా ! మీ కెల్లరకు నా అభినందనములు ! నాకు చేసిన ఈ ఘన సన్మానమునకు కృతజ్ఞుడను ! నేను గావించిన నా కర్తవ్యమునకు మీరింత ఘనముగా నెంచి సన్మానించుట మీ ఔదార్యమున కుదాహరణము ! మన విజయ ప్రాసాద నిర్మాణమునకు మీ బాహుబలమే పునాదియైనది. నా శేష జీవితము మన వీరదేశసేవకు వినియోగించ గలనని ప్రమాణము కావించుచున్నాను.

మంగళము దేశ మాతకు
మంగళమగు యువజనాళి మానసములకున్
మంగళము హరిపతాకకు
మంగళము ప్రతాపసింహ మహనీయునకున్.

(భామాశాహ కూర్చుండును. సభికులు "మహారాణా ప్రతాపసింహునకు జై! మేవాడ భాగ్యవిధాత మహామంత్రి భామాశాకు జై! స్వాతంత్ర్యశ్రీ దేవికి జై!" అని జయ జయ ధ్వానములు కావించుచుండ తెరవ్రాలును.)

# ఖా మా శా

## (సప్తమాంకము – మొదటి దృశ్యము)

స్థలము – సాదడియందు తారాచంద్ భవనము.

సమయము - సాయంసంధ్య.

తారాచంద్ :— మొగలులుతో పోరు మొదలైనది మొదలు సంగీతమునకు నా చెవులు నోచుకొనక పోయినవి ! రేయింబవళ్లు రణదుర్గ వీరవిహారములతో కాలము గడ చినది. సౌందర్య సుఖానుభూతులు కరవై పోయినవి! ఇకనైన నీప్రశాంత వాతావరణ మందైహిక సుఖ ముల కొల్లలుగా ననుభవింపవలయును ! బీడువారిన ఈ ప్రదేశము కళామతల్లి కాలిగజ్జల సవ్వడులతో స్వర్గ మగుగాక !

సైనూరాం :— మహాశయా! మీరు సెలవిచ్చిన దంతయు యథార్థము !

కారము తిన్నపిమ్మట సుఖమ్మగు తీపియు, విప్రలంభ శృం
గారము పిమ్మటన్ రతియు; కట్టిడి దుఃఖము వెన్కసౌఖ్యమున్
పారములేని రోదనము ప్రక్కన హాస్యము జీవనక్రమం
బైరహియించు కావున మహార్హము నేడు కళానుభోగముల్. (1)

తారాచంద్ :— సైనూరాం ! చక్కగ తెలియజెప్పితివి. ఈ మహాదవకాశము వినియోగించుకొని జీవిత శేషము గడుపవలయును. నేడే యానంద జీవితమునకు నాందిగ గాయకురాండ్రతో గోష్ఠి నేర్పరచుము!

సైనూరాం :— చిత్తము !

(పోయి అర్దురు గాయకురాండ్రతో ప్రవేశించును.)

తారాచంద్ :— ఆస్థాన గాయనీ మణులారా! చిరవియోగము పిమ్మట నీసంగీతగోష్ఠి ప్రారంభమగుచున్నది. కేతకీ! నీ మధుర గీతముతో విఘ్నేశ్వరపూజ కావింపుము.

కేతకి :— చిత్తము——(అని వీణ సవరించి పాట ప్రారంభించును.

పాట. అనుబంధము —9.

(పాట ముగియును. గాయకురాండ్రు విష్క్రమింతురు.)

తారాచంద్ :— సైనూరాం ! వీరి గానము పూర్వమువలె పార వశ్యము కూర్చుటలేదు. వీరి యౌవనముతోబాటు వీరి స్వర మాధుర్యము సైతము శాశ్వతముగ సెలవు గైకొన్నట్లున్నది.

సైనూరాం :— ప్రభూ! ఇది ప్రకృతి ధర్మమేకదా? ప్రౌఢ వయస్సు జారినట్లు నవ యౌవనము సడలిపోవునా ?

తారాచంద్ :— సైనూరాం ! మన ఆస్థానమునకు ఒక సుందర గాయకురాలి నేర్పరచుము. సజీవ సౌందర్యము తొణి కిస లాడుచుండ వలయును. అట్టివారు నీకెవ్వరైన కన్పిం చిన గైకొని వచ్చి యిచ్చట నియోగింపుము.

సైనూరాం :— ప్రభూ ! సుందరీబృందమందు 'కీతు' అగ్రగణ్యు రాలు ! వనలతలతో నుద్యానవనలతలు పోల్కికిరావను మహత్తర సత్యము 'కీతు' ను చూచిన స్మరణకు రాగ

లదు. ఆవిడ సాధారణ కుటుంబమున జన్మించిన కన్య! మహారాజుల అంతఃపురము లందును నట్టిసుందరి కానరాదు.

తారాచంద్ :- కీతు అంతసుందరియా! దాని చిత్ర ప్రతిమను చూపగలవా ?

సైనూరాం :- నేనొకనాడాకస్మికముగ చూచితిని. ఇల్లుచేరి ఆమె సౌందర్యమును చిత్రించితిని. కాని వాస్తవముగ ప్రభూ! ఆమె అందమున శతాంశమైనను చిత్రింప జాలక పోతిని! (అని తెచ్చి ఇచ్చును.)

తారాచంద్ :- (చిత్రపటమును చూచుచు) సెభాష్. కీతు ఇంత అందకత్తెయా! ఈమెను వర్ణించుటకు నాకు చేత కాకున్నది. ఈ జగదేక సౌందర్య దేవతను నాకొనగూర్పుము! అంతవరకు నాకు విరామములేదు.

సైనూరాం.:- ప్రభూ! ఆమె మీ పరాక్రమ సంపదలు విని మిమ్ము వరింప నుత్కంఠ చిత్తముతో నన్ను మరి మరి బ్రతిమాలుచు నొక్కమారు తమదర్శనము కలిగింప బ్రతిమాలుచుండ మొన్న మీరు వ్యాహ్యాళి కేగినపుడామెకు మిమ్ము చూపించితిని. ఆమె మనసార మిమ్ము వలచినది. ఆమె మీధనమునకు స్వాధీనమగునది కాదు. ఇంతకుముందు యువరాజు అమరసింహు డామెకొరకు విశ్వప్రయత్నములు కావించినను లొంగలేదు. ఆమెకు మీకు గల పూర్వజన్మసంబంధమే ఆమెకు మీపై మక్కువ కలిగించెను.

తారాచంద్ :— ఔరా ! సైనూరాం ! నీవు గ్రంధసాంగుడవే! నాకు తెలియకుండ నెంతకథ నడిపితివి! మంచిది. శుభస్య శీఘ్రమ్! ఆ మహారాణీగారి నిక్కడకు శాశ్వతముగ గొని రమ్ము! నా సర్వస్వమా ప్రేమదేవతాచరణ సన్నిధి నివే దింతును!

సైనూరాం :— పప్పులేనిపెళ్ళి యన్నట్లు కాకుండ మీరునువచ్చి స్వాగతము పలికి గృహప్రవేశము కావింపవలయును!

( ఇరువురు నిష్క్రమింతురు. తెరవ్రాలును. )

( రెండవ దృశ్యము )

స్థలము — ఉదయపురము

సమయము — సాయంసంధ్య.

(యువరాజు అమరసింహుడు మిత్రునితో విహరించుచుండ తెరయెత్తుదురు.)

అమరసింహుడు :— మిత్రమా ! దౌర్భాగ్య వశమున నేను రాణావంటి తండ్రికి కొడుకునై జన్మించితిని. ఆయనకు కళాభిరుచి, సుఖాభిలాష లేదు. దానికితోడు సర్వకాల ములందు భామాశాహాతో ధర్మగోష్ఠి! వీరి ధర్మోపన్యా సములతో నా తల బొప్పికట్టుచున్నది !

మిత్రుడు :— యువరాజా ! ఇప్పుడేమి మునుచుకొని పోయి నది. మనోనిగ్రహము మంచిదే కదా ! ధార్మిక గోష్ఠి సత్ప్రవర్తనకు మెరుగుపెట్టును సుమీ! దీనివలన నీకేమి

నష్టము వాటిల్లినది? రాణావారి ప్రకృతి నీ కేల ఈనాడింత వెగటు కల్పించినది!

అమరసింహుడు :— ఇది నాకు క్రొత్త కాదు. ఆలోచించుశక్తి కల్గినది మొదలు నాకు దాజీరాజుగారి సంయమవృత్తి అర్థము కాకున్నది. నా యంతరంగ మిత్రుడవని మనస్సు విప్పి చెప్పుచున్నాను. ఇంతకు ముందు 'కీతు' అను నొక అపరూప సుందరిని ప్రేమించితిని. ఆమె నన్ను తిరస్కరించినది. ఈనాడు భామాశాహ సోదరుడు తారా చంద్ దానిని చెట్టపట్టినాడు. నాకది యోర్వరాని దైనది.

మిత్రుడు :— యువరాజా! రాణావు కాదగిన నీవు సామాన్య బాలికను ప్రేమించుటా! అందును మహామంత్రి సోదరుని ప్రేయసినైనను నీకు మనస్సు మరల లేదా! వారిని సాధింపదలచుచున్నావా? ఆ సోదరులు మేవాడుకు రత్న ప్రాయులు. వారి మనస్సు ఖేద పెట్టకుము! ఈ విషయము రాణావారికి తెలిసిన వారెంత విచారింతురో యెరుగుదువా?

అమరసింహుడు:— నేనంతయు నెఱుగుదును! కాని— నా మనస్సును నిగ్రహించుకొనలేకున్నాను! రాణావారి కోపమునకు జంకుచున్నాను. ఏదెట్లయినను తారాచంద్రుని వధించియైనను 'కీతు' ను పొందెదను. ఆమె నిరాకరించిన ఘోరముగ చంపివేయింతును. సామాన్య వైశ్యుడు

యువరాణా ప్రేయసిని పొందుచుండ నేను చేతులు కట్టుకొని కూర్చుందునా?

మిత్రుడు :— యువరాణా ! నీపై నవివేక మధికారము చేయుచున్నది. ద్వంద్వయుద్ధమున నీవు తారాచంద్రుని గెల్వ గలవా? ఆ మహాపురుషుడు కన్ను తెరచిన, నీవు మేవాడ యేమౌనో యోచించితివా? అతనిని బ్రతిమాలుకొనుము. అయినను ప్రేయసిని త్యాగము చేయువాడుండునా? అతడు వైశ్యుడని నేమరకుము! మేవాడనుకాదు- రాజస్థానమునెల్ల నాత డొంటిగపోరి యోడింపగల దిట్ట. అన్న ఆజ్ఞమీరని శాంతమూర్తి! భామాశాహ ముఖము చూచి ఆతడాగియున్నాడు! సెలవు.

( వి ష్క్ర మి ం చు ను. )

[తెర వ్రాలును.]

## ( మూ డ వ  దృ శ్య ము )

### స్థలము — భామాశాహ భవనము

(విచారముతో భామాశా యుండ మనోరమ ప్రవేశించును. తెరయెత్తుదురు.)

మనోరమ :— నాథా ! తాము విచారముగ నున్నట్లున్నారే ! కారణమేమి ?

భామాశాహ :— జీవితేశ్వరీ !

ప్రాణికోట్లకు దిగులు మిత్రంబు సుమ్మి !
పుట్టుటాదిగ మానవుల్ గిట్టువరకు
వెంటనంటు పతివ్రత విధముగాను
నెట్టి వారును నిశ్చింత నెసగలేదు ! (1)

మనోరమ :— మహానుభావా ! మీ ధర్మోపన్యాస శ్రవణమునకు నేను రాలేదు. తమ విచార హేతువు తెల్పుడు.

భామాశాహ :— తారాచంద్రునకు స్త్రీవ్యసనము సహజమని నీ వెఱుగుదువు కదా! ఆతని యందనున్న 'కీతు'ను యువరాజు అమరసింహుడు అభిలషించి తిరస్కరింపబడి, 'కీతు'ను బలాత్కారమ్ముగ గొనివచ్చుటకు కృతనిశ్చయుడై యున్నాడు !

మనోరమ :— ఇది నిజముగ విచారణీయమే ! కాని మరది గారికి వయస్సు ముదిసినను వ్యసనము ముదియకున్నది. యువరాజింత నీతి బాహ్యుడైనాడేమి ? రాణాగారికి విషయము చెవిసోకలేదా ?

భామాశాహ:—ఓరిమితో వ్యవహరించ వలసినదని తారాచంద్రునకు వార్త వంపితిని. ఐనను నిది సామాన్యముగ ముగియదు. యువరాజు సేనాబలముతో విక్రమించకమానడు. తారాచంద్రుడు వీరావతారుడై యెదిరించక పోడు. చివరకు రాజీ రాజీ సాంఘిక కలహము కాగలదేమో ? ఈ విషయము రాణా వారెరిగినచో యువరాజును నిష్కారణముగ శిక్షింపగలరు. మరల మేవాడ సింహాసనమునకు నుత్తరాధికారిని వెదకుకొను పని తప్పదు.

కొన్నాళ్లనుండి శాంతి సుభిక్షములతో నున్న దేశము మరల రణ దుర్గకు తాండవ ప్రదేశమగుట నాకిష్టములేదు.

మనోరమ :— మీ వాదము సమంజసమే! కీతు యువరాజునం దిష్టముగనున్నదా ?

ఖామూశాహా :— లేదు! యువరాజును తిరస్కరింప గలదు. చివరకు కీతు ప్రాణములపై నాసవదలుకొనవలయునేమో! అమరుని అవివేక మెట్టిపరిణామములకు దారితీయునో గదా! చివరకు తారాచంద్రు డేమగునో! అంతయు దైవేచ్ఛ! ఇక నీవు శయనింపబొమ్ము.

( మ నో ర మ ని ష్క్ర మిం చు ను )

[ తె ర ప డు ను. ]

## ( నా ల్గ వ దృ శ్య ము )

(ఉదయపురమందలి యుద్యానవనము. అమరసింహుడు, కీతు, నైనూరాం ప్రవేశింప తెర యెత్తుదురు.)

అమరసింహుడు :— నైనూరాం! నీ విక్కడ నుండుము! నేనా చెట్టుక్రింద కీతుతో మాట్లాడవలసియున్నది.

(నైనూరాం విలచిపోవును. అమరసింహుడు, కీతు ముందున కేగుదురు.)

అమరసింహుడు :— (చెట్టునీడకడ నిలిచి) కీతూ! నా ప్రణయ సామ్రాజ్యాధిదేవతా! ఈ నీచరణదాసు డెన్నాళ్ల నుండియో నీ యనుగ్రహామునకు వేచియున్నను నీవేమి చూచి యీ తారాచంద్రుని చేరితివి ?

కీతు :— భృత్యు లందవిశ్వాసముగల మిమ్ముచూచి ప్రేమించు యోగ్యత లేకుండుటే అందుకు కారణము ! మేవాడ స్వాతంత్ర్యమునకు సర్వస్వము ధారపోసిన యా సోదరులకు మీరు కావించిన యీ బహుమానము మేవాడ చరిత్రలో శాశ్వతముగ నిలచిపోవును లెండు ! 'రాజానఃస్మయ దూషితాః' యన్న యార్యోక్తి వ్యర్థమగునా ?

అమరసింహుడు :— అధిక ప్రసంగము మాని నా కుంపుడుకత్తెవు కమ్ము ! నేను నీ ధర్మోపన్యాసముల వినుటకు రాలేదు.

కీతు :— ఇంతటి సరసునకు, ఇంతటి సహృదయునకు, ఇంతటి నీతివేత్త కెవ్వతె మనసియ్యకుండును ? కారుకూతలు కూయక నీదారిని నీవు పొమ్ము !

అమరసింహుడు :— పోనీ నీకు ఉంపుడుకత్తెగా నుండుటిష్టము కానిచో నీ మెడ నొకతాడు కట్టెదను లెమ్ము.

కీతు :— అప్రాచ్యుడా ! ఆ మహానీయుని కడుపునం దెట్లు పుట్టితివి ?

పాలసంద్రమందు బాడబానల మట్లు
రత్నఖనిని గాజురాయి వోలె
రమ్య చరితుడైన రాణాకు నీయట్టి
కూళ యెట్లుపుట్టె కొడుకుగాను ! (1)

పవిత్ర భారతదేశ నారి ఒకనికే ఒకమారే మనస్సు నర్పించు ననుటయు నెఱుగవా ! ఇకనైనను నీ తండ్రి గౌరవము కాపాడుటకైనను ఈ వెడకోర్కె మాని పొమ్ము !

అమరసింహుడు :— కీతూ ! నీ విట్లు తృణీకరించుచున్నావే ? దీని ప్రతిఫలము భీషణముగ నుండును సుమీ !

కీతు :— ఓయి యమాయికుడా ! నీ బెదరింపులు నావద్ద సాగవు ! నీవు ప్రాణాలకు మోసము తెత్తువని నే నెఱుగనా ! నిన్ను పొందుట కంటె మృత్యుశీతలస్పర్శ నా కానందదాయకము !

మరణమునకన్న నొక్క భీకరము గలదె ?
నరకమునకన్న దోష విస్తరము కలదె ?
ఉడుత యూపగ మ్రాకు లుఱ్ఱూగగలవె ?
బడుగ ! నీ బెదరింపుల నుడుగుమింక. (2)

రాజులు గర్వదూషితులు; రాట్కులమన్నది ముండ్లకంప; రా
రాజుల విశ్వసించు టపరాధము; ద్రోహము నుగ్గుబాలతో
రాజులు నేర్చుకొందు రిక రాజను నామము లోకమందు నే
యోజను నుచ్చరించిన నయోనిజుడైనను కష్టమొందెడిన్. (3)

అమరసింహుడు :— ఆ కోమటి తారాచంద్రుడు నీ ప్రాణమున కన్న ప్రేయసుడా ?

కీతు :— ఆ మహానీయుని పవిత్ర నామము నీ నోట పలికి యేల నపవిత్ర పఱచెదవు ?

తన సర్వస్వము దేశరక్షణకు స్వాతంత్ర్యమ్ము కున్ ధారవో
సిన వీరవ్రతు రాట్కుటుంబమునకై జీవంబు త్యాగంబు చే
యను సిద్ధంపడు త్యాగశీలునకు సమ్యగ్బుద్ధి నూహింపనే
రని రీతిన్ ఫలమిచ్చి తీవుగద ! తారాచంద్ర దేవర్షికిన్. (4)

అమరసింహుడు :— అతని త్యాగము, పరాక్రమము నేను కాదందునా ! నేను కాదన్నను లోకమూరకుండునా ? నన్ను

నిరాకరించిన నీవు వానినేల వరించితివి? నా ప్రతి స్పర్ధికి ప్రియురాలి నప్పగించి చేతులు ముడుచుకొని కూర్చుందు ననుకొంటివా? ఆతనిమీద నీ కంత యభిమానమున్న నాతని బరిత్యజించి నన్నంగీకరింపుము! నిన్ను మహారాణిని జేసెదను.

కీతు :- తుచ్ఛుడా! నీప్రలోభము ముగిసినదా! నా ప్రతిజ్ఞ పాలనము- అనగా నీ కోర్కెను ఘోరముగ, క్రూరముగ, నీచముగ తిరస్కరించుటే నాకు పరమానందము! నా దేవుని పిక్కమీది వెంట్రుకనైన కదలించుటకు నీ వంటి యువరాణాలు రాణాలు వేలకొలది పూనుకొన్నను నా వీరావతారుడు కన్ను విచ్చి చూచినచో నాశనమై పోదురు. ఈ సకల రాజస్థానమును శాసింపగల నా మహానీయు నేల తృణీకరింతువు? దుష్కర్మములచే విశ్వాస ద్రోహములచే ముగియుచున్న నీ జీవ సూత్రమును పుణ్యాత్ముల నిందించి యేల త్రెంచుకొనెదవు? ఈ ద్రోహ మింతటంతట నాగునది కాదు. ఆ వీరకేసరి అగ్రజాజ్ఞా బద్ధుడై యాగినాడు. లేకున్న నీ తల్లికి గర్భశోకము కల్గించి యుండెడివాడు! ఈ దుష్కర్మకు ప్రతిఫలమేమో యోచించితివా? నా ప్రియుడు సకుటుంబముగ నగ్ని కాహుతి కానున్నాడు! మరణమైనను మా కొక చోట నొక్కమారుగ గల్గింప నొల్లవా? మాగోడు నిన్ను కట్టి కుడుపక మానదు. నీవు రాణావు కాలేవు! మేవాడ స్వాతంత్ర్యము ప్రతాపసింహుల జీవిత

పర్యంతమే! నీవు మొగలాయిల చెప్పులు నాకి, కుక్కకు గూడ నవమానము కల్గించు వాడవు కాక తప్పదు! నీ చేతిలో మేవాడ ప్రేతభూమి కాక మానదు. ఇది నా శాపము ! నా స్వామి యొసగు మరణ శాసనము! ఓ సూర్య భగవానుడా ! ఓ పంచ భూతములారా ! ఈ దీనురాలి యార్తాలాపములు వినుడు ! నా ఘోషకు ప్రతిఫలము ముట్టచెప్పుడు ! ఈ పవిత్ర భారత దేశమున నీ దీనురాలికి జరిగిన తీవ్రావమానము చరిత్ర ప్రసిద్ధి నొంది యుగయుగములు దాని దుష్పరిణామమును చాటునుగాక !

అమరసింహుడు :— ఓసీ! చెవిటి ముందు శంఖమూదినట్లు ఎందు కంత గొంతు చించుకొందువు ? నీ తుది నిర్ణయ మిదేనా ? నీకు నూకలు తీరినవి ! లేకున్న నీవాగుడు పుట్టునా ?

కీతు :— నీవంటి నృశంసుని మోము చూచుచు నా మహాప్రస్థాన యాత్ర కాలస్యము కావించు టెందుకు ? ఇదుగో నా గుండె ! చూపించుకొనుము నీ విక్రమము !

అమరసింహుడు :— కానున్నది కాక మానదు! నీ బెదరింపులకు నేను లొంగుదునా ? ఎవరురా అక్కడ ? కానిండు ! ఆలసింపకుడు.

(వెనుకనుండి సేవకుడు కత్తి విసరి కీతును చంపును. కీతు తుది ఘోష.)

(సై మారాం ప్రవేశించును.)

అమరసింహుడు :— నైనూ ! సర్వము ముగిసినది. నేను పోవుచున్నాను. నీ యజమానికి సర్వము నివేదింపుము.

(కీతు రక్తసిక్తమగు మేలి ముసుగు గైకొని నైనూరాం పోవును.)

[తె ర వ్రా లు ను.]

( ఐ ద వ దృ శ్య ము )

స్థలము—సాదడి - బహిఃప్రదేశము.

(తారాచంద్రుడు, అతని నలువురు భార్యలు, ఆర్వురు గాయకురాండ్రు, అతని అశ్వము, నైనూరాం, అతని భార్య, తారాచంద్రుని మేనమామ, మేనత్తలు, ఒక ముస్లిము మహాత్ముడు ప్రవేశించియుండ తెర యెత్తుదురు.)

నైనూరాం :— (చిలి పేర్చుచు) ప్రభూ ! తమ సోదరులు, తాము మేవాడకు తను ధనము లర్పించి కావించిన సేవకు భావి రాణా చక్కని ప్రతిఫలమును ముట్టచెప్పినాడు. కీతు అంతిమయాత్రా ఘట్టము నా కన్నులనుండి మరలి పోకున్నది. ఆ తుచ్ఛు నామె తిరస్కరించిన తీరు ప్రశంసనీయము ! మేవాడ రుద్రభూమిగ మారునని శపించినది. ఆ మానవతి ఆత్మఘోష ఊరక పోవునది కాదు ! భగవంతు డామె కోర్కె తీర్చి ఆత్మశాంతి చేకూర్చగలడు !

తారాచంద్ :— నైనూరాం ! ఇందు కెవ్వరు కారణము గాదు. నా స్త్రీ వ్యసనమే ఈ ఘోర పరిణామము కూర్చినది. వేప విత్తు నాటి మామిడిపండు కోరిన వచ్చునా ? అన్న గారు ఇదివరకు మందలించుచుండ నెఱుగనైతిని. వ్యసనము ఘోర పరిణామకారి !

సైనూరాం :— ప్రభూ ! మీవంతు దోషము మీ రెరిగితిరి. కాని అమరసింహుని కిరాతక కృత్య మంతటింతటితో మరపునకు వచ్చునా? ఒక నిండు ప్రాణిని నిష్కారణముగ తన పాపపు కోర్కె తీర్పలేదని, తన పశువాంఛకు బలికాలేదని ప్రాణము తీయునా ?

తారాచంద్ :— సైనూరాం ! అమరసింహుని పాప పరిణామ మూరక పోదు. నిష్కల్మషురాలగు కీతు శాపము వ్యర్థము కాబోదు. బలము కల్గియు నగ్రజాజ్ఞాబద్ధుడనై శాంతము, అహింసల పేరుతో కీతు నా పాపిచేతి కప్పగించిన పాపాత్ముడను ! వేయేల వినుము :

శ్రోత్రియ వృద్ధు పెండ్లిగొను రూపసియౌ జవరాలు పోల్కి దు
ష్పాత్రుని జెందుదాన మనజాల విరక్తిని రాజ్యలక్ష్మి తా
నై త్రపనొంది పొందును సుమా ! తలపోయగ దైవ శూన్యమౌ
క్షేత్రము పోల్కి నా యమరసింహుని యందును ప్రీతగాదికన్.(1)

సైనూరాం :— అగ్రజాజ్ఞాబద్ధులై శక్తి కల్గియు మీరూరకున్నారు కాని యింకొక రూరకొందురా ? ఐనను శాంతము వహింపు మనుటలో ఖామాశాగారి అభిప్రాయము నాకు బోధపడకున్నది !

తారాచంద్ :— ఏమున్నది ! ఏ మేవాడ క్షేమముకోరి ప్రజలు, రాజు, సోదరుడు, మనము ఇంత త్యాగము చేసినామో అది యంతయు నీనాడొక మన తొందరపాటు మూలముగ సర్వనాశనము కాగలదు. అమరసింహునితోబాటు నేనును తొందర పడినచో పోరు ఘోరమగును ! రాణా

వారు కుమారుని బహిష్కరించి యేకైక పుత్రవ్యసనముతో మంచము పట్టుదురు. ఏదెట్లైనను మేవాడకు మరల రాణాను వెదకుకొను దురవస్థ తప్పనిసరి కాగలదు. ఒక్క కీతు ఆత్మబలితో దేశ స్వాతంత్ర్యము కాపాడబడును గదా! కీతు మీది మమతతో నేను మరణించినను దేశము శాంతి భద్రతలతో సుఖితముగ నుండునని మా సోదరుని విశ్వాసము!

సైనూరాం :— ఐనను మీరు త్యాగము చేసినంతమాత్రమున మీ యాత్మబలి వలన నమరసింహుని వ్యసనము నశించునా? ఆతడు తండ్రివలె రాజ్య మేలగలడా? ఏనాటికైన మేవాడ స్వాతంత్ర్యము నశించి తీరవలసినదే! మధ్య మీరు మరణించుటచే నొరగున దేమి?

తారాచంద్ :— నాయనా! నీకింకను తెలియకున్నది. ఎప్పుడో వచ్చు ప్రళయము నిప్పుడే ఆహ్వానింతుమా? భారత యుద్ధము తప్పనిసరి యని తెలిసియు భగవంతుడగు కృష్ణుడు యుద్ధమాపుటకు ప్రయత్నింప లేదా! అట్లే అన్నగారుకూడ దేశము శాంతి భద్రతలకు నన్ను బలి కమ్మని యాదేశించినారు. ప్రయత్నించుట మన విధి కాదా!

సైనూరాం :— ఇప్పటికి నా సందేహము సంపూర్ణముగ తొలగినది! కాని మన యీ సంఘమరణ మూరకపోవునా?

తారాచంద్ :— నాయనా ! నాయొక్కని కొరకేల మీరు మరణింతురు ? కీతు మూలకమైన యమరసింహుని వైరము నా మరణముతో తీరిపోగలదు. భర్తృజీవనలగు భార్యలు సహగమించుట కాదనజాలము. నా యండ బ్రతుకుచున్న శతవృద్ధులు మేనమామ మేనత్తలు నా మరణమునకే చచ్చిపోగలరు. వారి మరణమునకు చితి నిమిత్త మాత్రమే ! నా యాశ్రితులగు గాయకురాండ్రు, నీవు, నీభార్య ఈ ప్రయత్నము విడనాడుడు !

కేతకి :— దేవా ! దీనురాండ్రమగు మాకును మిమ్మనుసరించు పుణ్యము నొసగుడు ! అమరసింహుని దుష్కార్యమునకు మా సంఘాతమరణము తీవ్రమగు నిరాకరణమును చూపింప గలదు ! ప్రాణములకు భయపడి చచ్చుటలేదు. స్వేచ్ఛగ, ధైర్యముగ, నమ్మిన లక్ష్యమునకు నవ్వుచు పవిత్ర హుతాశమునందు లీనము కానున్నాము ! కీతూ ఆత్మకు శాంతి కలుగు గాక !

సైనూరాం :— మనము కలసిమెలసి బ్రతికితిమి. ఈనాడును ఈ నా స్వామిభృత్య సంబంధమును మరణము విడదీయ జాలదు. నా భార్య నన్నుసరించుట నీతికాదా ! నా మరణము సైతము యువరాణా దుష్కార్యమునకు ఆరి పోని ప్రతికూలమైన తార్కాణము ! ఐనను మీరు మాత్రము మన త్యాగమునకు స్మారకముగ నిలచి పోవలయును.

తారాచంద్ :— నైనూరాం ! ఇరువదొక్క ప్రాణుల మరణమునకు కారకుడ నగు నేను బ్రతుకవలయునా! పిచ్చివాడా! మన త్యాగమునకు స్మారక మేల ? చరిత్ర మన త్యాగము వేనోళ్ల కొనియాడును. మహాకవు లెలుగెత్తి కావ్య ప్రపంచమున మనకు శాశ్వతస్థానము కలిగింతురు. ప్రజలు తరతరముల వరకు మనలను కొనియాడుచుండ గలరు. ఇక నాలస్యమేల ! (అగ్నిహోత్రము నుద్దేశించి) దేవా ! హుతాశనా ! మమ్ము నీలో జేర్చుకొనుము !

అమరసింహుని వ్యసనాగ్ని యారుగాక !
కీతు యాత్మకు శాంతియౌ గాత ! మాతృ
దేశమున శాంతి భద్రతల్ తేజరిలుత !
ఆత్మశాంతులు మాకింక నమరుగాక !

(కీతు రక్తసిక్త వస్త్రిమును చితిని వైచి తారాచంద్రుడు ముందు దుముక నెల్లరు వెంటనే దుమికి భస్మమై పోవుదురు. నేపథ్యమునుండి విషాద సంగీతము వినిపించుచుండును.)

[ తెర వ్రాలును. ]

సమాప్తము.

# మా ప్రచురణలు

(వేంకటేశ్వర వేంకటరమణకవులు)

1. వస్తుపాలుడు (జీవిత చరిత్ర) రు. 1·25
2. భామాశా (చారిత్రక నాటకము) రు. 1·50

## మా రాబోవు ప్రచురణలు :

1. హేమచంద్రుడు
2. జయశ్రీ
3. విజయశ్రేష్ఠి దంపతులు
4. వాదిదేవసూరి
5. ఆర్యవజ్ర స్వామి
6. జగడూశా
7. వైశ్యమాత (పద్యము)
8. వైశ్య సామ్రాజ్యము
9. వైశ్యవంశ సుధార్ణవము (చంపూ)
10. విమల మంత్రి (కవి పాదుషా)

స్టాకిస్ట్సు :

**దాచేపల్లి కిష్టయ్యా అండ్ సన్స్,**

విద్యావిషయక ప్రచారకులు

సికింద్రాబాదు — హైద్రాబాదు — వరంగల్లు.



B. V. H. R. Society
Publication.